# ముక్తేవి భారతి కథలు

డా॥ ముక్తేవి భారతి



ముక్తేవి ప్రచురణలు

ముక్తేవి భారతి కథలు



ప్రథమ ముద్రణ : 1994 మే

వెల రూ. 40/-

ప్రచురణ :

ముక్తేవి ప్రచురణలు
6-1-107/22 పద్మారావు నగర్,
సికింద్రాబాదు - 25.

ప్రతులకు :

1. విశాలాంధ్ర బుక్ హౌస్
4-1-435 విజ్ఞానభవన్,
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు.

2. యువభారతి
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

3. డా॥ ముక్తేవి భారతి
6-1-107/22 పద్మారావు నగర్,
సికింద్రాబాదు - 25.

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380.
ఫోన్లు : 611413, 600547.

తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో ప్రచురింపబడినది.

పద్మభూషణ్ 31-4-1994

డా॥ సి. నారాయణరెడ్డి

Acc No 19911

# జ్ఞాపికలు

మంచి కథ జీవితాన్ని తట్టిలేపుతుంది. మరిచిపోయిన సంఘటనలను తరిచి చూపుతుంది. ఎదటవున్న వాస్తవాలను అంచనావేసే సరికొత్త దృక్కోణాన్ని సమకూర్చుతుంది. మంచి కథను చదువుతూవుంటే తెలిసిందేకదా అనిపిస్తూ అప్పుడప్పుడూ, అక్కడక్కడా ఉలిక్కిపడేట్టు చేస్తుంది. భేషజాల మాటున, కృత్రిమ ప్రవృత్తుల చాటున మరుగుపడిపోయిన అచ్చమైన విలువలను మనసు దారంలోకి పూసలు పూసలుగా ఎక్కిస్తుంది. అప్పుడు మనకు తారసిల్లే ప్రతి సన్నివేశం ఒక పరిపూర్ణ హారంలా రూపొందుతుంది. పాఠంలా కాకుండా యథార్థ జీవితం పాటలా మనలో అల్లుకుపోతుంది.

డా॥ ముక్తేవి భారతి కథలు చదివిన తరువాత నాలో కలిగిన స్పందన యిది. ఈ సంపుటిలోని కథలన్నీ చిన్నవే. అయితే, పరిమాణాన్ని మించిన భావ పరిణామం ఈ కథల్లోని మౌలిక గుణం. మనోరంజనం కోసం రాసిన కథలు కావివి ఏదో ఒక సంఘటన, ఏదో ఒక ఆలోచనా పార్శ్వం మనసును తట్టినప్పుడే కలిగిన ప్రతి స్పందనకు కమనీయాకృతులు ఈ కథలు. మొదటి కథే చూడండి. "వాన." ఇందిరలో పేరుకున్న అహాన్ని ఏరిపారేసి మానవత్వాన్ని పాదుకొలిపిన కథ అది. "కాపలా" కథలో కుక్కపిల్ల మెడలోని గొలుసు బంధానికి, జీవితంలో వేసుకున్న గొలుసుల బంధాలకు వున్న లంకె యేమిటో తెలుస్తుంది. "పర

మార్గం" కథలో గుళ్లూ గోపురాల్లో కాదు - పనివాడిలోని పరమాత్మను చూపించే ఆత్మీయదర్శనముంది. "అయ్యగారికి దండం పెట్టు" అనే కథలో "దణ్ణాలు" పెట్టించుకోవడంలోని ఆనందం, "నిద్రించిన వెన్నెల"లో అస లైన జీవిత మాధుర్యం బ్యాంక్ లాకర్లలో భద్రపరిచే వస్తువుల్లో లేదని ధ్వనింపజేసే ప్రబోధం చిక్కని కథాకథనంవల్ల సరికొత్త రూపురేఖలు సంతరించుకున్నాయి. చాలాకథల్లో పాఠకుల్ని ఓ క్షణంపాటు కుదిపే కొసమెరుపులు ఎన్నో వున్నాయి. "నీతికథ" నన్ను మరీమరీ కదిలించిన గొప్ప కథ. నీతికి అంతస్తులతో పనిలేదు. చదువులతో పదవులతో నిమిత్తంలేదు. అది సంస్కారంతోపాటు ఎదిగే సహజ సుగుణం. రిక్షా వెంకటి పాత్ర ద్వారా డా॥ భారతి ఆ నీతికి చేసిన మూర్తికల్పనం అద్భు తంగా వుంటూనే అత్యంత సహజంగా వుంది.

అధ్యాపకురాలిగా, పరిశోధకురాలిగా తెలుగు సాహిత్యరంగంలో సముచితస్థాయికి చేరుకుంటూ, చక్కని కవితలూ, కథలూ రాసి సృజ నాత్మక రంగంలో పేరొందిన డా॥ ముక్తేవి భారతి రచించిన ఈ కథలు ఉత్తమశ్రేణికి చెందినవి. శబ్దాలతో సాముగరిడీలు చేయకుండా, తీసుకున్న వస్తువును సరళశైలిలో గుండెకు హత్తుకుపోయేటట్టు ఎలా చెప్పాలో ఈ కథల్ని చదివితే తెలుస్తుంది. అందరి జీవితాల్లో అప్పుడో యిప్పుడో అందుకునే కమ్మని జ్ఞాపికలు ఈ కథలు.

సినారె

# మనసులోని మాట

తెలుగు సాహిత్య ప్రక్రియలన్నిటిలోనూ నా మనసుని ఆకట్టుకున్నది కథాప్రక్రియ. విస్తృతంగా రాయకపోయినా, ముప్పయి సంవత్సరాలకు పైగా కథా సాహిత్యంలో కృషిచేస్తూనే వున్నాను. చాలా కథలు వివిధ పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. అందులో కొన్ని మాత్రమే "ముక్తేవి భారతి కథలు" సంపుటిలో పొందుపరుస్తున్నాను.

నిజ జీవితంలో ఎన్నో సందర్భాలలో ఎన్నో సంఘటనలకు స్పందించటం జరుగుతుంది. ఆ స్పందనకు ప్రతిరూపాలే ఈ కథలు. సహృదయునికి మంచి కథ రసానందాన్ని కలిగిస్తూనే ఉంటుంది. ఈ నా కథలు పాఠకుల మనసులలో ఒక స్థానం సంపాదించుకోగలిగితే నా ప్రయత్నం ఫలించినట్టే తలుస్తాను.

నా గురువర్యులు, జ్ఞానపీఠపురస్కార గ్రహీత, పద్మభూషణ్ సి. నారాయణరెడ్డిగారు నా కథలకు "జ్ఞాపికలు" అంద చేయటం గొప్ప విశేషం. బహు కార్య నిమగ్నులైయుండి కూడా నా కథలు చదివి, "అందరి జీవితాల్లో అప్పుడో యిప్పుడో అందుకునే కమ్మని జ్ఞాపికలు ఈ కథలు" అని యోగ్యతాపత్రం ఈ కథలకు యివ్వటం నా మహా ద్భాగ్యం. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనాలు సవిన యంగా సమర్పిస్తున్నాను.

ఈ పుస్తకం ప్రచురించడానికి కొంత ఆర్థిక సహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, నా కథలు ప్రచురించిన వివిధ పత్రికా సంపాదకులకు, ఎంతో శ్రద్ధగా పుస్తకాన్ని ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి నా కృతజ్ఞతలు.

—ముక్తేవి భారతి

## ముక్తేవి భారతి కథలు

# కథాసూచిక

# పత్రికల్లో ప్రచురణ వివరాలు

1) వాన - ఆంధ్ర సచిత్ర వారపత్రిక 11.9.1970. 2) మంచు మండింది - వనిత, మార్చి 1979. 3) కాపలా - వనిత నవంబరు 1981. 4) ఎగరని గాలిపటాలు - ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 5.8.81. 5) చెట్లు - ఉదయం వీక్లీ ఉగాది ప్రత్యేక సంచిక. 6) హే ! ఆషాఢస్య ప్రథమ దివస - ఆంధ్ర సచిత్ర వారపత్రిక 10.12.71. 7) పడిలేచే కడలితరంగం - ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 29.6.1977. 8) ఓ ఇల్లాలు కావాలి - మహిళ, జూలై 1979. 9) పులిగోరు పతకం-ఉదయం వీక్లీ ఉగాది ప్రత్యేక సంచిక 1990. 10) పరమార్థం - వనిత, 15 అక్టోబరు 1977. 11) పడగనీడ - ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 5.2.88. 12) ఆకసాన హరివిల్లు విరిస్తే - ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 15.1.82 13) చిగిర్చిన వసంతం - కృష్ణా పత్రిక ఆగస్టు 1965. 14) అయ్యగారికి దణ్ణం పెట్టు - పల్లకి 17.3.1993. 15) మనసు తీరని మాతృత్వం - కృష్ణా పత్రిక నవంబరు 2, 1988. 16) నిద్రించిన వెన్నెల - ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 21.1.83. 17) మమత—మానవత - వనితా జ్యోతి, నవంబరు 1984. 18) నీతికథ - ఆంధ్ర సచిత్ర వారపత్రిక 10.7.1991. 19) అంతస్తుకి అటు ఇటు - ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 18.2.1977. 20) నింగినుండి నేలకి - ఆంధ్రజ్యోతి ఆదివారం ప్రత్యేక సంచిక 13.2.1994. 21) సుశీల మనసు - ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 3, 1979. 22) సీటు దొరికింది - ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 16.12.1981.

# వాన

అనుకోకుండా మొదలైంది వాన. పక్కింటివాళ్ళ పిల్లలు, ఆ పిల్లల తల్లి, ఆవిడ మరిది, ఆ ఇంటాయన కూడా కిటికీలోంచి రోడ్డును చూస్తున్నారు. వానలో తడవటాన్ని లెక్కపెట్టేదేమిటన్నట్లు తడుస్తూ పోతున్న వాళ్ళని, ఆ వానకే మొక్క మొలుస్తామన్నట్లు ఇళ్ళపక్కన, చెట్లకింద తల దాచుకుంటున్న వాళ్ళని, బట్టలమీద వాన నీళ్ళు చిందుతాయేమోనని ముందుగానే భయపడి దిక్కుతోచకుండా పరిగెత్తే పడుచువాళ్ళని చూస్తూ నవ్వుకుంటూ, మధ్య మధ్య జాలిపడుతూ, వెక్కిరిస్తూ, విమర్శిస్తూ ఆ కిటికీలోనే అన్ని తలలూ అవతలకు జరగనీయకుండా అవస్థపడుతున్నారా ఇంటివాళ్ళు.

వానచినుకు పడిందంటే చాలు ఇందిరకి కోపం!

'ఎన్నాళ్ళకు వానచినుకు పడిందండీ!' అంటుంది, కుంభవృష్టి కురుస్తుంటే పక్కింటావిడ అదేమిటో.

ఇందిర కిటికీలోంచి చూచింది. 'అమ్మో! ఆ వానచినుకులు కిటికీలోంచి ఇంట్లోపడితే!' గబుక్కున లేచి కిటికీ తలుపువేసి కూచుంది ఇందిర.

ఒక్కసారి గదంతా పరిశీలనగా చూచుకుంది. కిటికీకి అందమైన కర్టెనులు, గోడలకి చక్కని పెయింటింగ్స్, మూలల పూలకుండీలు, ఆ పక్కగా రేడియో, దానిమీద డాన్సింగ్ డాలు, ఒక పక్కగా పేజీ కూడా తిరగెయ్యకుండా, నలగకుండా అట్టలువేసి అమర్చిన పుస్తకాల షెల్ఫు, మధ్య టేబుల్‌మీద ఖరీదయిన ఆల్‌బమ్. అందులో అన్నీ తన

పెళ్ళినాటి అందమైన రంగు ఫోటోలు - ఫోటోలు - ఒక్కొక్క పేజీ తిప్పుతోంది ఇందిర.

తలుపు చప్పుడవటంతో సోఫాలోంచి లేచింది.

'రెండగ్గిపుల్లలుంటే అమ్మ ఇమ్మంది.' చిన్ని చింపిరిజుట్టు పక్కకు తోసుకుంటూ అడిగింది.

'ఏం, మీ అన్నయ్య ఇంట్లో లేడా?'

'ఉన్నాడండీ....కాని వానకదూ, అందుకు కొట్టుకు వెళ్ళలేదు.'

'అవును, వాన....' ఇందిరలేచి రెండంటే రెండే అగ్గిపుల్లలు తెచ్చి చిన్ని చేతిలో పెట్టింది.

'అబ్బ....ఛీ!' తడిపాదాలు గదిలో అక్కడక్కడా కనిపించాయి. ఇందిర విసుక్కుంటూ గదంతా బట్టతో వత్తింది.

ఆఫీసునుంచి వచ్చి చాలాసేపయి గదిలో పేపరు చదువుతూ పడుకున్నాడతను.

'వేడిగా కాఫీ తాగుదామా హాయిగా!' అతని చేతిలో పేపరు పక్కన పడేస్తూ అంది ఇందిర.

'కాఫీ ఏమిటి....ఈ వానలో వేడిగా పెసరట్లు చేసిపెడితే!'

'పాపం....కష్టపడతారు!' కాఫీ తాగుతూ చిన్నికిచ్చిన రెండగ్గిపుల్లలు గుర్తొచ్చి నవ్వుకుంది ఇందిర.

*　　　*　　　*

వాన నెమ్మదిగా పెద్దదయింది. అతనికి వానంటే చాలా సరదా. వానలో తడుస్తూ గుమ్మంలో నిలబడడం అతనికి ఇష్టం నిజానికి.... కానీ....

మళ్ళా తలుపు చప్పుడవటంతో విసుక్కుంది ఇందిర.

'ఏం కావాలి?' కాఠిన్యంగా గొంతులో మారుమ్రోగుతాంటే ఇందిర ప్రశ్న.

'లోపల గుమ్మంలో కూచుంటా.' తడిసిన బట్టలు, నెత్తిన నీరు కారుతూ ముసలాడు.

'బయట నుంచున్నావు చాలదూ?' దబీమని తలుపేసింది.

'పోనీ, రానీయకూడదూ- వాన తగ్గాక వాడే పోతాడుగా?'

'అబ్బా.... మీకంత జాలయితే పిలిచి మీ కోట్లు కూడా రెండు కప్పండి పాపం- వాడి గుడ్డలూ వాడూ....ఛీ, చుట్ట కాల్చుకుంటూ....'

'పాపం... ముసలాడు కదూ!' అతను గుమ్మం తెరిచాడు. ఖాళీ గుమ్మం వెక్కిరించింది. ఒక వ్యక్తికి ఒక్క నిముషం ఆశ్రయం ఇవ్వలేడు తను! ఇందిరకేసి చూసి లోపలి కెళ్ళిపోయాడతను. ఒక్క క్షణంలో ముసలాడిని, వాననికూడా మరచిపోయి పుస్తకం చదవడంలో నిమగ్నుడైపోయాడు.

* * *

'తల తుడుచుకో ఈ బట్టతో.' పక్కింటి అత్తయ్యగారి గొంతు.

'వో అగ్గిపుల్ల యియ్యి బుల్లెమ్మా, చుట్ట కాల్చుకుంటా, కాస్త ఎచ్చగా వుంటుంది....'

'ఏం పని చేస్తావురా అబ్బీ—' ఇంటాయన ప్రశ్న.

'కూలి పని బాబయ్యా....'

'సరేకాని.... తల బాగా తుడుచుకో.... మళ్ళా జలుబు చేస్తుంది.... తెల్లారితే కూలికి పోవద్దూ....'

'వానకి తడవటం, ఎండకి ఎండటం అలవాటే తల్లీ.'

'తాతా, అన్నం తిన్నావా?' చిన్ని చిన్న గొంతు.

'వాన తగ్గినాక గంజి కాసుకుంటా.'

'మరి నీకు ఆకలెయ్యదా.... నేనయితే ఎప్పుడో తినేసా తెలుసా.... తాతా, అమ్మతో చెప్తా అన్నం పెట్టమని.... తింటావా?'

'వద్దులే బుల్లెమ్మా....పోతాగా కూసేపాగి!'

'అన్నం తిన్ని పడుకో.... పొద్దున పోదుగానిలే.'

అన్నం తిన్నాడు ముసలాడు. విస్తరి మడుస్తూ,

'మీలాటోళ్ళున్నారు కాబట్టి.... ప్రపంచం ఇట్లా ఉంది ... అంతా ఆ పక్కింటమ్మలాట్లోల్లయితే....' వాడు ప్రేవున త్రేన్చి, విస్తరి వీధిలోకి విసిరికొట్టాడు.

*　　　　*　　　　*

తలుపు పక్కగదిలో సోఫాలో పడుకుని సంభాషణ వింటున్న ఐశ్వర్యవంతుల ఆడబిడ్డ, ఆధునిక ఆదర్శాల ఆటపట్టు ఇందిరకి షాక్ కొట్టింది.

వాన ఇంకా ఇంకా పెరిగిపోయింది. భూనభోంతరాళాలు ఏకం చేస్తూ కుంభవృష్టి కురిసింది. ఒక్కసారిగా ఇంట్లో దీపాలు ఆరిపోయాయి. ఆ అంధకారంలో ఒక వాస్తవం కళ్ళముందు మెరిసింది. —చిరిగిపోయిన చాప, ఆకారంలేని వంటగిన్నెలు, పాలుచాలక కక్కటిల్లే పసివాడి ఏడుపు, చిరిగినచీరతో ఆ ఇల్లాలు; బీడీ ముక్క కాలుస్తూ లోతుకుపోయిన కళ్ళతో ఇంటాయన; చింపిరిజుట్టు చిన్ని; నిరుద్యోగి మరిది....వీళ్ళు, వీళ్ళే తన పక్కవాళ్లు— వీళ్ళుండబట్టి ప్రపంచం ఇంకా ఈ మాత్రం పచ్చగా వుందిట!

తనుండబట్టి—

మెట్లులేని అంతస్థునుంచి కిందపడింది ఇందిర.

*　　　　*　　　　*

5

'నాన్నా, మన పొట్లపాదు బోల్డు కాయలు కాస్తుంది కదండీ—'

'అవును తల్లీ!'

'అవి మనం అందరికీ ఇష్టం కదండీ నాన్న— మన పిన్నికీ, మీ ఆఫీసు అబ్బాయికి, మన పక్క ఇందిర అత్తయ్యగారికి— అందరికీ ఇయ్యాలి కదండీ....' చిన్ని తియ్యని గొంతు ఇందిరని కదలించివేస్తోందా చీకట్లో—

గదిలో సోఫాలు, ఫోను, తన అందమైన పూలకుండీలు, తన డాన్సింగ్‌డాలు, తన ఆధునికత - అవే జీవం అనుకుని నమ్మింది— ఏమిటో అన్నీ జీవం లేకుండా ఉన్నవైనా, ఈరోజు ఒకటితో ఒకటి తనను చూసి వెక్కిరించి నవ్వుకుంటున్నాయ్, గుసగుసలు చెప్పుకుంటు న్నాయి.

* * *

తెలతెలవారుతోంది. నిద్ర పట్టని ఇందిర కిటికీలోంచి చూచింది.... వాన!

ఇందిర కళ్ళలో నీళ్ళు నిలిచాయి—

వాన పడుతుంటే కిటికీలో నుంచుని కబుర్లు చెప్పుకుంటూ నవ్వు కునే పిల్లలు తనకు లేరు. లేరేమిటి - తనే వద్దనుకుంది ఇంతదాకా....తన దొడ్లో పచ్చగా పెరిగిన పొట్లపాదు తనకు లేదు....

మనిషిగా బతకటానికి కావలసిన ఒక ధర్మం....తనకు లేదు....

ఈ వాన ఎండిన మానుల్ని చిగురిస్తుంది....

ఈ వాన తనలో మానవత్వాన్ని....

వానలో తడిసిన ముసలాడు కళ్ళముందు నిలిచాడు ........ ఇందిర ఒణికిపోయింది.

*

# మంచు మండింది

కాలింగ్ బెల్ మోగడంతో పేపరులోంచి తలెత్తి గుమ్మంవైపు చూసింది రాజ్యలక్ష్మి. గుమ్మంలో కునికిపాట్లుపడుతున్న వెంకటమ్మ గబుక్కున లేచి తలుపు తీసింది.

ఓ పద్నాలుగేళ్ళ కుర్రాడు, చేతిలో రెండు పుస్తకాలతో, ముఖాన్న పడుతున్న జుట్టు పక్కకు తోసుకుంటూ—

"నమస్కారమండీ" అన్నాడు. 'వీడూ ఇదేబాపతు' అనుకుంది రాజ్యలక్ష్మి కుర్రాడికేసి చూస్తూ.

"టెన్త్‌క్లాసు చదువుతున్నానండి."

"ఊఁ"

"భోజనానికి........' ననిగాడు కుర్రాడు.

"ఊఁ" అంది రాజ్యలక్ష్మి అతనికేసి చూస్తూ.

సమాధానంలేదు. ఓ క్షణం ఆగి,

"ఏం చేయమంటావ్- భోజనం పెట్టాలి నీకు- అంతేనా?" రాజ్యలక్ష్మి మాటలకి వంచినతల ఎత్తి "అబ్బే కాదండి- ఈరోజు కాదు- ఈ రోజు ఎదిరింటి మేడవాళ్ళ దగ్గర కుదుర్చుకున్నానండి- కానీ-" కుర్రాడు గొణిగాడు.

"ఒక్కమాటలో చెప్పేయ్- నీకేం కావాలో." కుర్చీలోంచి లేచి, రాజ్యలక్ష్మి కిటికీ దగ్గరకెళ్ళి నిలబడింది.

కుర్రాడి మనసు బాధగానే వుంది. కానీ, ప్రస్తుత పరిస్థితులలో తప్పదు. ఒక్క నిముషం అలాగే నిలబడ్డాడు మాట్లాడకుండా. రాజ్యలక్ష్మి ఒక్కసారిగా—

# 7

"ఊఁ చెప్పు" కసిరింది కుర్చీలో కూర్చుంటూ.

"నేను వారాలు చేసుకుని చదువుకుంటున్నాను. నాకు రెండు రోజులకి ఇళ్ళు కుదరలేదు. ఆ మేడమీద వాళ్ళు మీరెంతో మంచివారని, ఎందరికో ఇలా సహాయం చేస్తుంటారని చెప్పారు. ఈ పదో క్లాసు పాసయి చిన్న నౌకరీ సంపాదించుకుని నా బతుకు నేను బతకాలని...." కుర్రాడు ఆగాడు. తలొంచుకున్నాడు.

"చూడు బాబూ! నువ్వు చెప్పినట్టుగా నేను చాలా మంచిదాన్నే. నా మనసు ఇంకా చాలా మంచిదే. కానీ, ఎందుకీ మంచితనం? కాల్చనా?" కుర్రాడు బెదిరిపోయి చూస్తున్నాడు రాజ్యలక్ష్మి వైపు.

"నీకు ఈ రోజు కడుపునిండా అన్నం పెడతాను, తింటావు. అంతేనా?" రాజ్యలక్ష్మి కుర్రాడి కళ్ళలోకి చూసింది.

"కాదండి, బతికున్నంతకాలం మీ పేరు చెప్పుకుంటాను."

రాజ్యలక్ష్మి కళ్ళు ఎర్రపడ్డాయి.

"అందుక్కాదు నీకు పెట్టేది." రాజ్యలక్ష్మి మాటలు ఆపి కుర్చీ లోంచి లేచింది.

"నీకు ఒక్క రోజు కాదు - రోజూ అన్నం పెట్టగలను. పెద్ద చదువు చెప్పించగలను.నీకు ఉద్యోగం ఇప్పించగలను." కుర్రాడి కళ్ళలో చిన్న వెలుగు, కానీ మరోక్షణంలో—

"కానీ నేనేమీ చేయను. వెళ్ళు, బయటకెళ్ళు" రాజ్యలక్ష్మి మాటలకి నిర్ఘాంతపోయాడు కుర్రాడు.

"నేను మీరనుకొనేటటువంటి వాణ్ణి కానండి. మీరు చేసే సాయం మరచిపోయే విశ్వాసఘాతకుణ్ణి కానండి." కుర్రాడు ఏదో అంటున్నాడు.

ఇలాగే పదేళ్ళనాడు తన దగ్గరకొచ్చిన ప్రకాష్ కళ్ళముందు కదలాడాడు. తనే చదువు చెప్పించి, బట్టలిచ్చి, తిండి పెట్టి ఆరేళ్ళ

పోషించింది. ఆ తర్వాత ఒక ఆఫీసులో చిన్న ఉద్యోగం వేయించింది. అంతే, ఈరోజు తనెలా వుందో, బతికిందో, చచ్చిందో కనుక్కోవాల్సిన అవసరంకూడా లేదు. అతనెక్కడున్నాడో తెలియచేయాల్సిన అవసరం కూడా లేదు. రాస్కెల్స్! మంచితనం, మంచితనం!! రాజ్యలక్ష్మి కళ్ళు నిప్పులు కురుస్తుంటే, ఎదురుగా నిలబడ్డ కుర్రాడు పరమ దుర్మార్గుడిలా అనిపించాడు.

"ఐ సే యు గెట్ అవుట్!" రాజ్యలక్ష్మి గొంతు ఒక్కసారి దద్దరిల్లింది.

"వెళ్ళు బాబూ, వెళ్ళు." కుర్రాడిని బయటకి పంపి తలుపు వేసింది వెంకటమ్మ.

* * *

రాజ్యలక్ష్మి సహజంగా చాలా మంచిది. ఎవరి కష్టాల్నీ చూడలేదు. చాలా చిన్నతనంలో తండ్రి మరణిస్తే ఇద్దరి చెల్లెళ్ళని, తమ్ముణ్ణి ఓ దారికి తెచ్చి, చదువులు చెప్పించి, పెళ్ళిళ్ళు చేసింది. రాజ్యలక్ష్మికి పిల్లలంటే చాలా ఇష్టం. పిల్లలు పరమాత్మ స్వరూపులని, పాపం పుణ్యం తెలియని పసివాళ్ళని గట్టి నమ్మకం రాజ్యలక్ష్మికి.

రాజ్యలక్ష్మిని ఎందరో అడుగుతుంటారు - "మీరెందుకు పెళ్ళి చేసుకోలేదు? పోనీ, ఇప్పుడెందుకు చేసుకోకూడదూ?" అని. రాజ్యలక్ష్మి నవ్వుతుంది. "ఏం, నేను పెళ్ళిచేసుకోకపోతే ఏం? ఎందుకు మళ్ళా కొత్త అనుబంధాలు? నాది అనేవి ఎందుకూ?" అంటుంది నవ్వుతూనే.

రాజ్యలక్ష్మి ఉద్యోగంలో స్థిరపడిపోయిన తర్వాత ఎందరెందరో తెలిసినవాళ్ళు, తెలియనివాళ్ళు ఆమెకు ఆత్మీయులయ్యారు. తను సంపాదించిన డబ్బు ఎవరిమీద ఎలా ఖర్చుచేసినా అడిగేవాళ్ళు లేరు. అయినా, పైసా పైసా కూడబెట్టి ఏం చెయ్యాలి? అందుకే రాజ్యలక్ష్మి ఎక్కడ

ఎవరు ఇబ్బంది పడుతున్నారన్నా తబ్బు సహాయం చేస్తుంది. మనిషి సహాయం కావాల్సివచ్చినప్పుడు తనే స్వయంగా చేస్తుంది. అలాగేకదూ పక్కవాటాలో వున్న ఇందిరతో స్నేహం పెరిగింది!

ఇందిరకి ముగ్గురాడపిల్లలు, మూడోపిల్ల పురిటికి ఇందిరకి చాలా సుస్తీ చేసింది. రాజ్యలక్ష్మి హాస్పిటలుకు వెళ్ళడం, కారియర్ తనే సిద్ధం చేయడం, పిల్లలకి అన్నాలు పెట్టడం - ఇలాటివెన్నెన్నో చేసింది. అంతే కాదు, ఇందిర చిన్నకూతురు చిట్టితల్లి అంటే మరీ చనువు ఎక్కువయింది. ఆ పిల్ల రాజ్యలక్ష్మిని వదిలేదికాదు. రాజ్యలక్ష్మి అఫీసునించి వచ్చి తలుపు తీయటం ఆలస్యం- చిట్టితల్లి గబగబా లోపలకొచ్చేది, తను తెచ్చిన బిస్కట్లు, చాక్లట్లు తింటూ కబుర్లుచెప్తూ కూచునేది చిట్టితల్లి.

రాజ్యలక్ష్మి దొడ్లో ఎన్నో పూలమొక్కలున్నాయి. ఎన్నోసార్లు చిట్టితల్లికి పూలజడలు కుట్టింది. ఓరోజు "ఈ పూలు మీ అమ్మకిచ్చి పూలజడ కుట్టించుకో- నాకు ఒంట్లో బాగా లేదు" అంది రాజ్యలక్ష్మి. చిట్టి తల్లి ఇంట్లోకెళ్ళి మళ్ళా వచ్చింది.

'మా అమ్మకి రాదంట- నిన్నే అల్లమంది.''

'ఏమిటీ- పూలజడ అల్లటంరాదూ?' అంది రాజ్యలక్ష్మి కాస్త విసుగ్గా.

'వచ్చనుకో- అయినా అమ్మకి ఇలాటి పనులు బోరంట- అమ్మ చెప్పింది.'

'ఆహా!' రాజ్యలక్ష్మికి ఓపిక లేకపోయినా చిట్టితల్లికి జడకుట్టి పంపింది.

రాజ్యలక్ష్మికి చిట్టితల్లి బాగా అలవాటయింది. ఆ పిల్ల ఓ పూట కని పించకపోతే తోచేదికాదు. ఆ పిల్లకోసం పండక్కి గౌన్లు కొనేది. బజారు నుంచి ఎన్నెన్నో తెచ్చిపెట్టేది.

ఓ రోజు, 'ఆంటీ' అంటూ చిట్టితల్లి గుమ్మంలో కొస్తూ 'అమ్మ వచ్చింది' అంది నెమ్మదిగా. సాధారణంగా ఇందిర లోపలికిరాదు. చాలా ముభావంగా వుంటుంది.

'మా పాప ఆంటీ ఇంటికి రమ్మని ఒకటే గోల. నాకు ఎవరింటికి రావాలనిపించదు' అంది ఇందిర హాలంతా కలయచూస్తూ. పదినిముషాలు కూచుని ఇందిర వెళ్ళిపోయింది. ఆ తర్వాత వారం రోజులకి ఇందిర తండ్రి ఊరినించి వచ్చాడు.

"మా తాతయ్య ఆంటీ"అంది చిట్టితల్లి తాతయ్యని లోపలకి తెస్తూ.

తాతయ్య ఆ కబుర్లు ఈ కబుర్లు అడుగుతూ, "మా అమ్మాయి రాసింది - చిట్టి తల్లంటే మహా ప్రాణమని మీకు. మీరు చాలా మంచి వారని అమ్మాయి చెప్తూ వుంటుంది - లేకపోతే మీరూ ఒక్కరే అయిపోయారు. అదే - ఈ పిల్లదాన్ని మీ దగ్గరే వుంచుకుంటే - ఇంకా ఇద్దరాడపిల్లలు ఉన్నారు కదా దానికి....అని -" తాతయ్య నసుగుతున్నా మాటలు సగం అర్థం అయి, సగం అర్థం కాక నివ్వెరబోయింది రాజ్యలక్ష్మి.

"అంటే - మీ ఉద్దేశం?"

"ఆ ఏముంది - ఆ తండ్రి చిన్న సంపాదనలో ముగ్గురాడపిల్లల్ని ఎలాగూ ఓ దారికి తేలేడు. మీకూ ఓ కష్టం సుఖం చెప్పుకుందుకు, కాలికి చేతికి సాయంగా ఉంటుంది కదా అని అమ్మాయి, అల్లుడు అనుకుంటున్నారు" అన్నాడు. అభిప్రాయం అర్థమయిపోయిన రాజ్యలక్ష్మి మనసు భగ్గుమంది.

'తను పెళ్ళిచేసుకోదు - తను సంపాదించే ఈ డబ్బు, ఈ ఇల్లు - అన్నీ ఎవరెకివ్వాలా అని తన తరఫున - వాళ్ళే ఆలోచిస్తున్నారన్నమాట! చిట్టి తల్లిని ముద్దుచేయటం చిన్నపిల్లగానే కానీ- రాజ్యలక్ష్మి తల తిరిగి

పోయింది - మనిషికి స్వార్థమో, వంచనో, ద్రోహమో ఏదో ఒకటి ఉండి తీరాలన్న మాట! మొదటిసారిగా తను ఒంటరిది అనే విషయం వీళ్ళు జ్ఞాపకం చేసారే - అంటే చిట్టితల్లిని కూడా వాళ్ళే ప్రోత్సహించి పంపు తున్నారన్న మాట!

*                    *                    *

ఆదివారం పొద్దున్నే తాతయ్య ఊరెళ్ళిపోయాడు. చిట్టితల్లి, ఇందిర గదిలోంచి బయటికి రాలేదు.

"పిల్లను పంపమన్నారు అమ్మగారు - పూలజడ కుడ్తారంట!" వెంకటమ్మ ఇందిర గుమ్మంలో నుంచుంది.

"జ్వరంగా ఉందని చెప్పు-దిక్కుమాలిన కళ్ళు ఎవరివి పడ్డాయో!" దభీమని తలుపేసింది ఇందిర. ఆ తర్వాత చాలారోజులు చిట్టితల్లి రాజ్యలక్ష్మిని తప్పించుకు తిరిగింది. రాజ్యలక్ష్మి మంచులాంటి మనసు భగ భగ మండిపోతూంది. ఆ ఇంట్లో తను ఒంటరిగా అయిపోయినట్లు అనుకొంటూ నీళ్ళు నిండిన కళ్ళు రహస్యంగా తుడుచుకుంది, పిలిచినా వినిపించనట్టు వెళ్ళిపోయిన చిట్టితల్లిని తల్చుకుంటూ.

*                    *                    *

ఆఫీసు నుంచి ఇంట్లో అడుగు పెడుతూనే గుమ్మంలో వున్న ఉత్తరాలు చూసింది రాజ్యలక్ష్మి. ఒకటి తమ్ముడు రాసింది.

"పసివాడికి ఇప్పుడిప్పుడే మాటలొస్తున్నాయి. ముందు నిన్నే పిలుస్తున్నాడు. నీ మరదలు నిన్ను పండక్కి తప్పక రమ్మని మరీ మరీ చెప్తోంది. రెండురోజులుండేట్టురా. ఇంకో విషయం - నీకు ఇవ్వాల్సిన డబ్బు - ఈమాటు - తప్పక పంపించేస్తాను." రాజ్యలక్ష్మి నవ్వుకుంది.

"నాకు అప్పు తీర్చడమేమిటి - చిన్నవాడివి, నీ సంసారం చక్కగా చూసుకో. కావలసి వచ్చినప్పుడు నేనే అడుగుతాగా-ఎంత వాడయ్యాడు! నాకు అప్పు తీర్చేంత - " రాజ్యలక్ష్మికి తమ్ముడు రాసిన ఉత్తరం చాలా ముచ్చటేసింది. మళ్ళీ మళ్ళీ చదువుకుంది.

మరో ఉత్తరం విప్పి చదువుతుంటే రాజ్యలక్ష్మికి చాలా ఆశ్చర్యం కలుగుతోంది.

"మీ డబ్బు చాలా త్వరలో పంపేస్తాను. మీ చెల్లెలి గొలుసు అమ్మేస్తున్నాను. ఎంతో మంచిగా తియ్యగా మాట్లాడుతూ, మీకు ఆ డబ్బుతో ఇప్పుడేం పనిలేదని, వీలయితే ఎప్పుడో ఇయ్యండని మాకు ఇచ్చారు. ఆ రోజు మీరు డబ్బు ఇస్తానని ముందుకు రాకపోతే, మేము ఏ కాబూలీవాలా దగ్గరో తెచ్చుకుని, అప్పు తీర్చలేక సమస్తమూ అమ్ము కునేవాళ్ళం. కానీ మీరెంతో మంచిగా మాట్లాడినా, కాబూలీవాలా కన్నా...." ఇలా నిష్ఠూరంగా సాగిన ఉత్తరాన్ని చదివి బల్లమీద విసిరి కొట్టింది రాజ్యలక్ష్మి.

ఓ అవసరానికి చెల్లెలి భర్తకి డబ్బు సర్దింది తను. 'వడ్డీకి తెచ్చు కుని ఇబ్బందులు పడకండి - మీకు వీలున్నప్పుడు ఏ వడ్డీలు లేకుండా నాకిద్దురు గాని' అని తనే వాళ్ళకి డబ్బిచ్చింది. అంతే. తను అడగ కుండానే ఏమిటీ పిడుగుపాటు___

రెపరెపలాడుతున్న కాగితం చివరి వాక్యాలు రాజ్యలక్ష్మిని కదల్చి వేసాయి.

'నా డబ్బు నాకిచ్చి నాతో చుట్టరికం తెంపేసుకుంటారట. కాని, ఆ రోజు మంచితనానికి పోయి, జాలిపడికదూ తను వాళ్ళని ఆదుకున్నది. కానీ తప్పు తనదే - మంచితనం దేనికి, బూడిదలో పొయ్యనా!" రాజ్యలక్ష్మి ఆ ఉత్తరాన్ని చించి బుట్టలో పారేసింది.

వారం రోజుల తర్వాత చెల్లాయి రాస్తుంది ఉత్తరం - "అక్కా! ఇంతవరకు నువ్వెంతో మంచిదానివనుకున్నాను. ఈమధ్య ఇందిరవాళ్ళ నాన్నగారు మా యింటికి వచ్చారు-అన్నీ చెప్పారు. నీకు డబ్బు కావాలంటే వడ్డీతోసహా నీ మొఖాన్న పారేస్తాము. అయినా నువ్వు ఒంటరిదానివి - బంగారు వళ్ళానికి కూడా గోడ చేరువ కావాలంటారు - నీకు చెప్పమంటున్నారు మా ఆయన-" ఇలా సాగింది ఉత్తరం!

ఇందిర వాళ్ళ నాన్న - అవును ఆయన తనని ఇంటికి చుట్టూ గోడ కట్టుకోవాలి, డబ్బు అప్పు ఇమ్మంటే తన దగ్గరలేదని, ఉన్న డబ్బు చెల్లెలు వాళ్ళకి అవసరమని సర్దానని చెప్పింది కదూ - అదా ఈ గాలి దుమారం? రాజ్యలక్ష్మి మనసు ముక్క ముక్కలయింది. ఆ రాత్రంతా నిద్రపట్టలేదు రాజ్యలక్ష్మికి. ఎవరు తనవాళ్ళో, ఎవరు పరాయివాళ్ళో అర్థం కాలేదు రాజ్యలక్ష్మికి. ప్రతి వ్యక్తి ఇతరుల మంచితనాన్ని కొల్లగొట్టాలని చూసేవాళ్ళే - ఛఛ!

ఆఫీసుకి సెలవు పెట్టి ఇంట్లో ఉంది రాజ్యలక్ష్మి.

చిట్టితల్లి తలుపు తోసుకు నెమ్మదిగా అడుగు పెట్టింది. రాజ్యలక్ష్మికి కళ్ళల్లో నీళ్ళొచ్చాయి.

"రావటం లేదేం?"అంది మంచం మీద చిట్టితల్లిని కూచోపెట్టుకుని.

"నెమ్మదిగా - అమ్మ వింటుంది." భయం భయంగా తలుపు కేసి చూస్తూంది చిట్టి తల్లి.

"ఏమిటి కబుర్లు - అన్నం తిన్నావా?" అంది రాజ్యలక్ష్మి చిట్టితల్లి తల నిమురుతూ.

"రేపు మేము ఇల్లు ఖాళీ చేస్తున్నాము."

"ఏమిటీ?!"

"అవును. అమ్మ అప్పుడే చెప్పద్దంది - రేపు అమ్మే చెప్తుందిట."

రాజ్యలక్ష్మి ఏమీ మాట్లాడలేదు. చిట్టితల్లి కొత్త యింట్లో కూచున్నట్లుగా గోడల్ని చూస్తోంది.

"ఇది తిను." ఫ్రిజ్‌లోంచి ఒక యాపిల్ తీసి యిచ్చింది.

"ఒద్దు."

"ఏం?"

"అమ్మ మీ యింట్లో ఏమీ తినద్దంట."

"అంటే - అదివరకు తినేదానివిగా?"

"అప్పుడు నువ్వు మంచిదానివిట. ఇప్పుడు ఏమో మరి - తింటే చంపేస్తానంది."

రాజ్యలక్ష్మి దీర్ఘంగా నిట్టూర్చింది. తన మంచితనం ఇలా బెడిసి కొట్టిందా? సరే వీళ్ళు ఖాళీ చేస్తే ఇంకోళ్ళొస్తారు. వాళ్ళతో మాత్రం ఖచ్చితమైన ఇంటిదానిలా నెల మొదటి రోజునే అద్దె వసూలు చేస్తాను. ఒక్కరోజు ఆలస్యం చేసినా గొంతు పిసికి చంపేస్తాను - ఇక నుంచి ఇలాగే ఉంటాను!

చిట్టితల్లి వెళ్ళగానే రాజ్యలక్ష్మి ఠపీమని తలుపు వేసుకుంది.

ఎర్రగా, చల్లగా, మంచులా వున్న యాపిల్ పళ్ళెంలో ఎదురుగా కనిపిస్తోంది-రాజ్యలక్ష్మి దానివంకే చూస్తోంది- 'వెంకటమ్మా!' గర్జించింది రాజ్యలక్ష్మి. పనిలోవున్న వెంకటమ్మ పరిగెత్తుకొచ్చింది.

"ఆ చాకుతే."

తెచ్చింది వెంకటమ్మ.

యాపిల్ ముక్కముక్కలుగా కోసింది. పళ్ళెం నిండింది. ఎన్ని ముక్కలో! వెంకటమ్మకి కొన్ని పెడితే? ఆ ఎందుకూ, దానికి ఇవి పనికి

రావు. అయినా ఈ యాపిల్ నాకష్టార్జితం. నేనే తినాలి. ఎవరికో ఎందుకు పెట్టాలి? ఎర్రటి, చల్లటి యాపిల్ ముక్కలు రాజ్యలక్ష్మిని చూసి నవ్వుతున్నట్టే ఉన్నాయి పళ్ళెంలో ఎదురుగా.

ఒక్క ముక్క నోట్లో పెట్టుకుంది. రాజలక్ష్మి దుఃఖం గొంతులో నిండి, ముక్క గొంతు దిగలేదు.

"వెంకటమ్మా!" రాజ్యలక్ష్మి మళ్ళీ గర్జించింది.

"అమ్మా!" చేతులు తుడుచుకుంటూ వెంకటమ్మ నిలబడింది.

"ఈ యాపిల్ ముక్కలు ఆ చెత్తబుట్టలో పారేయ్."

వెంకటమ్మకి అర్థం కాలేదు.

"అవును. పారేయ్. మొత్తం చెత్తబుట్టలో పారేయ్. మరీ చల్లనివి, మరీ తియ్యనివి పనికిరావు. అంతే!" మనసు భగభగ మండుతుంటే రాజ్యలక్ష్మి చల్లని యాపిల్ ముక్కల్ని చెత్తబుట్టలో పోయించింది. *

# కాపలా

"కుక్కగారి గొలుసుగారు ఊడిపోయారు. కాస్త కట్టరా." రామ లక్ష్మిగొంతు ఖంగుమంది. చదువుతున్న పుస్తకం బల్లమీద పడేసి లేచాడు రామం ఎప్పుడయితే గౌరవవాచకం చెపిని పడిందో అప్పుడే అర్థ మయింది పరిస్థితి. అందులో గొలుసుగారు అని కూడా తల్లి అనేసరికి పరిస్థితి కొంచెం డేంజర్‌లో పడిందని అర్థమవటానికి అరనిముషం పట్ట లేదు రామానికి. రామలక్ష్మి ముఖం ఎప్పుడయితే ఎర్రబడిందో అప్పుడే ఇంట్లో అంతా నిశ్శబ్దం. ఇంచుమించుగా వారంలో మూడు రోజులైనా రామలక్ష్మికి ఇంట్లో అందరి మీద కోపం రాకతప్పదు. ఈ మధ్య వారంలో ఆరు రోజులూ ఇదే పరిస్థితి - కారణమేమిటంటే - బిక్కీ వచ్చి అప్పటికి మూడు వారాలైంది.

బిక్కీ రావడానికి ముందు ఇంట్లో చాలా గొడవ జరిగింది. వాదోపవాదాలయ్యాయి. వాగ్దానాలు కూడా అయ్యాయి. ఇంట్లో అందరూ ఓ రాజీ మార్గానికొచ్చిన తర్వాత బిక్కీ ఇంట్లో ప్రవేశించింది.

''చాకిరీ, ఈ పిల్లలు చాలక దీన్ని నేను చూడలేను - అంత్య నిష్ఠూరంకన్నా, ఆదినిష్ఠురం మేలు'' అంది ఖచ్చితంగా రామలక్ష్మి.

''నువ్వేం చూడక్కర్లేదు - అన్నీ మేమే చూసుకుంటాము.'' ముక్తకంఠంతో ఇంట్లో అందరూ అన్నారు.

అంతే. ఆ తర్వాత రెండు రోజులయేసరికి బిస్కట్లు, ప్లేటు, గొలుసు, బెల్టు - ఒకటేమిటి ఆఖరికి - ఓ మూల మంచి చోటు, పడుకుం దుకు ఓ దుప్పటి అన్నీ సిద్ధమయిపోయాయి. ఒక శుభ సమయంలో

గృహప్రవేశం చేసింది బిక్కీ. ఇంట్లో ఎంతో సందడి. ఎవరొచ్చినా బిక్కీ ముచ్చట్లే - ఒకళ్ళపైన ఒకళ్ళు పోటీపడి దానికి తిండి పెట్టడం, ఒళ్ళో కూచోపెట్టుకోటం- చెప్పలేనంత హడావిడి. బిక్కీ తప్ప మరో ప్రపంచం లేదనుకునే జడభరతులయ్యారింట్లో అందరూ- ఒక్క రామలక్ష్మి తప్ప!

నెలరోజులు గడిచాయి. వస్తాయి వస్తాయి అనుకున్న పరీక్షలు వచ్చేసాయి - అందరూ ఎవరి గొడవలో వారు మునిగిపోయారు. స్నేహితుడింటికి వెళ్ళి చదువుకొనేవాడొకడయితే, తలుపు తీసుకుని గదిదాటి బయటకి రానివాడు మరొకడు. ఇంట్లో వాతావరణమే మారిపోయింది.

''అరే - పన్నెండవుతోందే -'' గబుక్కున పుస్తకం కింద పడేసి వంటింట్లోకి నడిచాడు రామం.

రామలక్ష్మి అన్నం తింటోంది. కాసేపు అటు ఇటు చూసాడు. "ఏం కావాలి" అంది రామలక్ష్మి.

''ఏం లేదు - బిక్కీకి అన్నం పెట్టావా అని." నసిగాడు రామం. "ఓహో ఇప్పుడు గుర్తొచ్చిందా - అది తిని గంటయింది. వెళ్ళు - వెళ్ళి చదువుకో." రామం మాట్లాడకుండా గదిలోకొచ్చేసాడు.

వాగ్దానాలు చేసిన వారంతా దాని విషయమే మరిచిపోయారు. తెల్లారేసరికి పాలు పోయటం - తర్వాత బిస్కట్లు, తర్వాత - అన్నం ఇలా ఒక దాని తర్వాత ఒకటిగా బిక్కీ పనులన్నీ రామలక్ష్మే చేస్తోంది. గుమ్మంలో రామలక్ష్మి నిలబడితే చాలు తోకాడిస్తూ దగ్గరకొస్తుంది. కోపంగా వుంటే దానికీ తెలుస్తుంది. ఓ మూల నక్కి కూచుంటుంది. ఎవరిమీద ఏమి కోపగించినా బిక్కీని మాత్రం శ్రద్ధగా చూస్తోంది రామలక్ష్మి. రెండు నెలలు తిరిగేసరికి బొద్దుగా, ముద్దుగా తయారయింది బిక్కీ.

జ్ఞాపకమొచ్చినప్పుడు అడుగుతుంటారు ఇంట్లో అంతా - 'పాలు పోసావా, అన్నం పెట్టావా' అని. అలాంటప్పుడు రామలక్ష్మికి ఒళ్ళు మండిపోతుంది.

"అంత ప్రేమున్న వాళ్ళయితే మీరే పొయ్యొచ్చుగా. ఎలాగూ నేనే అన్నీ చూసుకుంటా కదా అని తెలిసి - గడుసుతనం!" రామలక్ష్మి మూతి తిప్పుకుంటూ లోపలకెళ్ళిపోతుంది. మరీ విసుగ్గా వున్నపుడు 'దీన్ని బయట వదిలేయండి' అంటుంది.

"నిజంగా వదిలేయనా?" పెద్దబ్బాయి అన్నాడు తల్లితో.

"ఆ వదిలేయ్."

"నిజంగానేనా?" రెట్టించాడు.

"ఏం ,నన్నుద్ధరించటానికే దీన్ని తెచ్చినట్టు మాట్లాడుతున్నావే!"

"సరే, సాయంత్రం మా ఫ్రెండు వస్తాడు. ఎప్పటినుంచో కుక్కపిల్ల కావాలంటున్నాడు దీన్ని ఇచ్చేస్తాను. ప్రేమగా పెంచుకుంటాడు. ఒక మాట చెప్పనా మమ్మీ - ఇది ఇంట్లో వుంటే నీకు కొంత కంపెనీ - అదే, నీకు కాలక్షేపం."

పెద్దబ్బాయి మాటలకి విస్తుపోయింది. కళ్ళల్లో గిర్రున తిరిగాయి నీళ్ళు. ఇదా నాకు కంపెనీ! దాని మీద ఇష్టంతోటి, ఇంటికి కాపలాగా వుంటుందని తెచ్చారనుకుంది. ఇన్నాళ్టికి - ఇప్పుడర్థమయింది అసలు విషయం. అయినా మనింట్లో మణి మాణిక్యాలేమున్నాయని కాపలాకి? నిజమే - అది నాకు కాపలా, నేను దానికి కాపలా.

రామలక్ష్మి మాట్లాడకుండా లోపలికెళ్ళి పోయింది ఎర్రబడ్డ ముఖంతో.

అమ్మకి అంత కోపం ఎందుకు వచ్చిందో అర్థంకాక తికమక పడ్డాడు అబ్బాయి.

*                    *                    *

ఆనాటి నుంచీ విక్కీ అంటే ప్రత్యేకమైన అభిమానం ఏర్పడి పోయింది రామలక్ష్మికి. అబ్బాయి దీన్ని బయట వదిలేస్తాడేమో అనే భయం కూడా లేకపోలేదు. వదిలేస్తే దిక్కులేని అనాథలా రోడ్డున పడుతుంది. అలా కావడానికి వీల్లేదు - ఎవరూ చూడక్కర్లేదు. నేనే చూసుకుంటాను దీన్ని. గుమ్మంలో కూచున్న విక్కీ అమాయకంగా రామలక్ష్మి కేసి చూస్తోంది. పాపం, నోరులేనిది. ఆ నిముషంలో ఎంతో జాలేసింది దాని మీద రామలక్ష్మికి!

అప్పుడప్పుడు పాలు పోశావా అని, అన్నం పెట్టావా అని అడిగే వాళ్ళు ఈ మధ్య అది కూడా అడగటం మానేశారు. దాని బాధ్యతంతా రామలక్ష్మిదే అనే భావం ఇంట్లో అందరికీ కలిగింది. మరో ధైర్యం కూడా వచ్చింది. ఎవరెక్కడకెళ్ళినా, ఎప్పుడొచ్చినా ఫరవాలేదు. విక్కీ వుంటుందిగా ఇంట్లో!

*                    *                    *

కాలం గడుస్తోంది. రామలక్ష్మికి ఇల్లే సర్వస్వం అయిపోయింది. ఎప్పుడయినా బయట కెళ్ళాలంటే విక్కీకి పాలు ఎవరు పోస్తారు, అన్నం ఎవరు పెడతారు అనే బెంగ! - ఒక్కొక్కసారి రామలక్ష్మికి ఇంట్లో వాళ్ళ మీదే కాకుండా లోకం మీదే కోపం వస్తుంటుంది. అలాంటప్పుడు విక్కీ దగ్గరకిపోయి కూచుంటుంది!

ఆ రోజు పెద్దబ్బాయి తల దువ్వుకుంటూ "ఈ రోజు ఇంగ్లీషు సినిమా కెళుతున్నాం. నిన్ను తీసికెళదామంటే—" సణిగాడు. రామలక్ష్మి నవ్వింది. "ఏం నేను ఇంగ్లీషు సినిమా చూడకూడదా?"

''అది కాదు'' అద్దంలో మరోసారి ముఖం చూసుకుని బయట వెళ్ళిపోయాడు పెద్దబ్బాయి.

మరో రోజు ''నేనూ వస్తా మీతో'' అంది రామలక్ష్మి, టై సరిచేసుకుంటూన్న రాజశేఖరంతో.

"రా నీకభ్యంతరం లేకపోతే.మా ఫ్రెండ్స్‌తో కలిసి వెడుతున్నా.

"ఏం ఫరవాలేదు, నేనూ వస్తాను." రామలక్ష్మి జుట్టు ముడి వేసుకుని గబగబా డ్రస్ చేసుకుని, చెప్పులు తొడుక్కుంది.

"నిజంగా వస్తున్నావా?"

"భయపడకండి. మీ వెంటపడి రాను—ఊరికే అన్నానంతే,

రాజశేఖరం ఒక్క నిమిషం నిలబడ్డాడు. కొంచెం బరువుగా రెండడుగులు ముందుకు వేశాడు. ఒక్కసారి వెనక్కి తిరిగి చూశాడు. బిక్కీని ఒళ్ళో కూచో పెట్టుకుని ఒళ్ళు నిమురుతోంది రామలక్ష్మి. గబగబా నడిచి ముందు కెళ్ళిపోయాడు.

*   *   *

ఇంట్లో మిగిలింది తను. కాదు కాదు కాళ్ళదగ్గర కూచున్న బిక్కీ కూడా. రామలక్ష్మికి నవ్వొచ్చింది ఎందుకో.

"బిక్కీ - నిన్ను ఇంటికి తెచ్చినప్పుడు కోపగించాను, విసుక్కున్నాను. కానీ ఎంత పూలునో చూశావా! నువ్వు ఈ ఇంటికి కాపలా. నేనూ ఈ యింటికి కాపలా. ఈ ఇంటివాళ్ళు గొప్పోళ్ళే బిక్కీ! నిన్ను నన్ను కూడా పోషిస్తున్నారు. కాకపోతే నీ మెడకి ఓ గొలుసు కట్టారు తప్పించుకు పోతావని, ఎవర్నన్నా కరుస్తావని. నేను అరుస్తాననుకో కరవను. నీకు ఒక్క గొలుసు బంధం, నాకు గొలుసుల గొలుసుల బంధాలు. ఎక్కడికి తప్పించుకుపోతామే మనం బిక్కీ?" రామలక్ష్మి

చేతిలో వున్న బిస్కట్లు దాని నోటి కందిస్తూ అప్రయత్నంగా చూసింది గోడకేసి. పెళ్ళినాటి ఫోటో....అబ్బ, ఎంత సన్నగా ఉందప్పుడు! ఇప్పుడో? రామలక్ష్మికి పాతికేళ్ళగతం కళ్ళముందు కదలాడింది. ఇంట్లో వాళ్ళ నెదిరించి రాజశేఖరాన్ని రిజిష్టరు పెళ్ళి చేసుకొంది. చదువుకొనే రోజుల్లో వుండే ఆదర్శాలు ఒకటి ఒకటి దూరమైపోయాక, కేవలం పిల్లల తల్లిగా, మిసెస్ శేఖరంగా మిగిలిపోయింది. అయితే మాత్రమేం!

"మమ్మీ-నిన్ను అమ్మమ్మ ఊరు పంపించం. నువ్వు లేకపోతే బోర్‌గా వుంటుంది" అంటారు పిల్లలు.

రాజశేఖరం మాటలు తక్కువ మాట్లాడినా అతని మనసు నిండా ఉన్నది తనేగా! రామలక్ష్మికి గొప్ప తృప్తి మనసు నిండా నిండింది. రామలక్ష్మి గోడమీదున్న ఫోటో కేసి చూస్తోంది. వీధిలో కారు హారన్ మోగటంలో ఈ ప్రపంచంలోకి వచ్చింది.

మిసెస్ నళినీ మోహన్ కారు దిగింది.

"ఓ చిన్న పార్టీ. రేపు నువ్వు రావాలి."

"పార్టీయా?"

"ఆ. నా బర్త్ డే పార్టీ. అన్నట్టు ఇవి నీకు చూపించాలని నిన్నటి నుంచి ఒకటే ఇదిగా వుంది నాకు." తళతళలాడుతున్న వజ్రాల దుద్దలు.

"అబ్బ చాలా ఖరీదుంటాయేం?"

"ఆ ముప్ఫయివేల పయినే. దుద్దులే కాదు, రింగు కూడా తెచ్చారు మద్రాసునించి." గలగల మాట్లాడింది మిసెస్ నళినీ మోహన్.

"వెంకటలక్ష్మికి ఫోను చేశాను. వస్తానంది. అది వచ్చేదేమిటిలే, చర్త తీసుకొస్తాడుగా, నిన్న పంతొమ్మిదివందల ఏభై పెట్టి మంచి చీర కొన్నాను. చూస్తావుగా రేపు." గలగలా మాట్లాడి, గబగబా కారెక్కింది.

రాళ్ళు, రప్పలు, చీరలు, నగలు ఇవి చూసుకు తృప్తిపడిపోతోంది పాపం నళిని! జీవితంలో ఏం పోగొట్టుకుందో తెలుసుకోలేని వెర్రిది. విలాసాల్లో వినోదాల్లో మునిగి తేలుతూ జీవితాన్ని అనుభవించేస్తున్నాడు మోహన్ మద్రాసులో. అతని భార్యగా సంఘంలో బతికేస్తోంది నళిని.

ఎంత దురదృష్టవంతురాలో నళిని! ఎంతో జాలేస్తుంది నళినిని తల్చుకున్నప్పుడల్లా రామలక్ష్మికి.

రామలక్ష్మికి రాజశేఖరం మాటలు గుర్తొచ్చాయి వెంటనే. "సంసారం అనే సామ్రాజ్యాన్ని ఏలే మకుటం లేని మహారాణి నువ్వు" అని. నిజమే మరి-రామలక్ష్మి కళ్ళు గర్వంతో మెరిశాయి ఆ క్షణంలో.

"బిక్కీ - మనమే హాయిగా ఉన్నాం మనం ఈ ఇంట్లో భాగస్వాములం. అరే, ఈ మధ్య నీకు ఇంగ్లీషులో చెప్తే కాని అర్థం కావటం మానేసింది కదూ-మనం పార్టనర్స్. ఈ ఇల్లు నువ్వు కాపలా కాయి. ఈ ఇంట్లోవాళ్ళని నేను కాపలా కాస్తాను." అవునుమరి, ఏ వయ్యారిభామో రాజశేఖరాన్ని కొట్టేయ్యకుండా కాపలా కాసుకోవద్దూ తను! ఏ చిన్నదో అమాయకుడైన తన అబ్బాయిని వలలో వేసుకోకుండా కాపలా కాసుకోవద్దూ తను!! ఒళ్ళో వున్న బిక్కీ నల్లని కళ్ళతో రామలక్ష్మిని చూస్తూ అటు ఇటు కదిలింది.— "కూచో, నాకు పనులు లేవనుకుంటున్నావా?" బిక్కీని కిందకి దింపివేసింది రామలక్ష్మి.

బిలబిలమంటూ నలుగురు స్నేహితుల్ని వెంటేసుకు వచ్చాడు రామం లోపలకి.

''మమ్మీ, ప్లీజ్-''

''ఏమిటీ?''

''ఫైవ్ కప్స్ ఆఫ్ టీ-ప్లీజ్-''

"నాకు తెలియదు-" రామలక్ష్మి టీ ఇస్తానందో ఇవ్వనందో తెలుసుకోకుండా ముందు గదిలోకెళ్ళి స్నేహితుల మధ్య కూచున్నాడు రామం!

తిన్నగా వంటింట్లోకి నడిచి టీ కోసం నీళ్ళగిన్నె స్టౌ మీదుంచింది రామలక్ష్మి.

*

# ఎగరని గాలిపటాలు

ఆకాశం నిండా రంగు రంగుల పతంగులు కనిపిస్తుంటే అలా చూస్తూ ఎంతోసేపు కూచునిపోయాడు డాబా మీద రాజు. ఈ వూరొచ్చి పదేళ్ళయింది. అమ్మమ్మకి ఒంట్లో బాగాలేదని చూడ్డానికి వచ్చాడు, తల్లితోకలిసి. అమ్మమ్మ ఇంటి ఎదురుగుండా చిన్న గుడిసె ఇప్పుడూ ఉంది. అందులో పాపిగాడు ఉన్నాడా? ఏమో! తనలాగే చాలా పొడుగయి ఉంటాడు. నల్లగా ఉన్నా, భలే అందంగా ఉండేవాడు పాపిగాడు. ఒక్కసారి కనిపిస్తే బాగుండును. తనని గుర్తుపడతాడో, లేదో? రాజు ఆ గుడిసె కేసి చూస్తూ అలాగే కూర్చున్నాడు. క్షణంలో గతంలోకి వెళ్ళిపోయాడు.

* * *

అకాశంకేసి చూసి చూసి మెడ నొప్పి పుట్టింది పదేళ్ళ రాజుకి. కళ్ళు మండుతున్నాయి. రెండు నిమిషాలు నేలమీద చతికిలబడ్డాడు. పక్కనున్న పాపిగాడు ఈలోగా పతంగ్ ఎగరేస్తున్నాడు. ఎదురుగా చిన్న గుడిసెలో ఉన్న రత్తి కొడుకు పాపిగాడు. పనిచేయడానికి రత్తి వస్తే దానివెంట వీడూ వస్తాడు ఈ మధ్య సెలవులని అమ్మమ్మ గారింటికి వచ్చిన రాజుకి వీడితో స్నేహం ఎక్కువైంది. కాని తల్లి కంటపడకుండా పాపిగాడితో ఆడుకొనేవాడు. లక్ష్మి పాపిగాడిని చూస్తే చాలు, విసుక్కుంటుంది. వాడితో ఆడుకోవాలని ఎంత ఉన్నా తల్లి చూస్తూండగా ఆడుకునేందుకు భయం రాజుకి.

రేడియోలో క్రికెట్ కామెంటరీ వస్తోంది. లక్ష్మి రేడియో ముందు నుంచి కదలకుండా కూచుంది. హమ్మయ్య, అమ్మ ఇప్పట్లో బయటికి

రాదు. హాయిగా పాపిగాడు, నేను పతంగులు ఆడుకోవచ్చు. రాజు రత్తి గుడిసెలో కెళ్ళాడు. పాపిగాడి చెవిలో రహస్యం చెప్పాడు. ఇద్దరు డాబా మీద కెళ్ళారు ఉత్సాహంగా!

ఆరోజు లక్ష్మి రేడియో వినటం అయిన తర్వాత గుమ్మంలోకొచ్చి నిలుచుంది. 'అబ్బబ్బ, పిల్లాడు పతంగుల గొడవలోపడి అన్నంకూడా తినడం మానేశాడు' అనుకుంటూ గబగబా డాబామీద కెళ్ళింది.

పతంగ్ పిలాయిస్తున్న పాడిగాడిని, చెరఖా పట్టుకున్న రాజుని చూడగానే లక్ష్మి కళ్ళు నిప్పులు కురిశాయి. 'ఎన్నిసార్లు చెప్పాను— మా వాడితో ఆడద్దని?' లక్ష్మి పాపిగాడి చేతిలోని పతంగ్ లాగేసుకుంది. వాడు ఒక్క క్షణంలో పరిగెత్తి గుడిసెలోకి వెళ్ళిపోయాడు. రాజు చెయ్యి పట్టుకుని లాక్కుపోయింది కిందకి లక్ష్మి. రాజు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తనకు పతంగులు ఎగరేయటం రాదు. ఎన్నో పతంగులు మామయ్య కొనిపెట్టాడు. పాపిగాడితో కలిసి ఎగరేస్తే- ఛీ, అమ్మ ఒప్పుకోదు. నిజంగా పాపిగాడి అమ్మే మంచిది. రాజు కళ్ళు తుడుచుకున్నాడు.

అమ్మ కొడుతుందనే భయంకొద్దీ కొంచెం అన్నం తిన్నాడు రాజు. 'పడుకో. ఎండలో వెళ్ళకు. చూడు ఎంత నల్లబడిపోయావో!' లక్ష్మి తను పరుపుమీద వాలుతూ రాజును తన పక్కనే పడుకోమంది. కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. నిద్రవస్తేగా! పాపిగాడు ఏంచేస్తున్నాడో? సగం కళ్ళు తెరిచి మెల్లగా చూచాడు. తల్లి నిద్రపోతోంది. అడుగుల చప్పుడు కాకుండా కిటికీ దగ్గరకొచ్చి నిలబడ్డాడు. చిన్న కాగితానికి దారం కట్టుకుని హాయిగా ఎగరేసుకుంటున్నాడు పాపిగాడు గుడిసె ముందు. రత్తి గుమ్మంలో కూచుని చూస్తోంది. తన గదిలో ఎన్నో పతంగులు, జీబాలు అద్దాలు.... ఎన్నెన్నో ఉన్నాయి. అవన్నీ పాపిగాడిచేత ఎగరేయిస్తే!రాజు నెమ్మదిగా నడిచి తల్లి గదిలోకొచ్చాడు. లక్ష్మి గాఢంగా నిద్రపోతోంది. తలుపు

నెమ్మదిగా దగ్గరగా వేసి గబగబ పతంగులు పట్టుకొని రత్తి గుడిసె దగ్గరికి పరిగెత్తాడు రాజు. పాపిగాడు పతంగులకి కన్నాలు చేసి దారాలు కట్టాడు. కొన్ని పతంగులు ఎగరేశాడు. కొన్నింటిని కోశాడు. రాజు సంతోషంతో పొంగిపోతున్నాడు పక్కన నిలబడి. అమ్మ లేచిందేమోనని ఒక్కసారి గుమ్మంకేసి చూశాడు. భయంతో వణికిపోయాడు. అంతలోనే ఎదురుగా గుమ్మంలో నిలబడి తననే చూస్తోంది లక్ష్మి.... ఇంట్లోకి పరిగెత్తాడు. ఆరోజు బుగ్గలు ఎరుపెక్కేటట్లుగా కొట్టింది లక్ష్మి. ఇంకెప్పుడూ ఆ గుడిసెలో అడుగుపెట్టనన్నాడు.... పాపిగాడితో మాట్లాడనన్నాడు. లక్ష్మి చాలా సంతోషించింది. 'నా బంగారు తండ్రి! మమ్మీ చెప్పినట్టు వింటాడు కదూ.... వాడితో ఆడితే నువ్వూ అలా అయిపోతావంతే!' లక్ష్మి మాటలు వింటూ వూరుకున్నాడు. అమ్మ అక్కడనుండి వెళ్ళిపోయిన తర్వాత ఎంతసేపో వెక్కివెక్కి ఏడ్చాడు.

ఆ తర్వాత వారం రోజులు రాజు పాపిగాడిని చూడలేదు. ఒకనాడు రత్తిని రహస్యంగా అడిగాడు. పాపిగాడికి జ్వరం అని తెలియగానే గుడిసె దగ్గరికి పరుగెత్తాడు. ఇంతలో తల్లికి తెలుస్తుందన్న భయంతో తలుపు సందులోంచి చాపమీద పడి నిద్రపోతున్న పాపిగాణ్ణి చూచి పరుగెత్తుకు ఇంటికి వచ్చేశాడు రాజు. కాని రాజుకి ఏమీ తోచటంలేదు. తనకి స్నేహితులు లేరు ఇక్కడ. పాడిగాడితో ఆడుకోనీదు అమ్మ. ఛీ, పాపిగాడి అమ్మే మంచిదని మళ్ళా ఒకసారి అనుకొన్నాడు ఆ పసివాడు.

ఆరోజు లక్ష్మి బజారు కెళ్ళింది. అమ్మమ్మ ఇంట్లో ఎక్కడో ఉంది. రాజు రత్తి గుడిసెలోకి పరుగెత్తాడు. పాపిగాడిని తనతో ఆడుకుందుకు రమ్మన్నాడు. వాడు రానంటే బతిమాలాడు. అమ్మ బజారు నుంచి ఇప్పుడే రాదులే అన్నాడు. పాపిగాడు సంతోషంతో గంతులేస్తూ రాజు వెంట డాబా మీదికి వచ్చాడు.

పతంగులకి దారాలు కట్టాడు పాపిగాడు. చెరఖా రాజు పట్టుకుంటే పతంగులు ఎన్నో ఎగరేసి, కొన్నింటిని కోస్తున్నాడు. రాజు సంతోషంతో, గర్వంతో ఆకాశం కేసి చూస్తున్నాడు. ఎండలో ఎగరేస్తున్న పాపిగాడి కళ్ళు చీకట్లు కమ్మాయి. ఇంక ఎగరవేయలేక మెట్ల దగ్గర వచ్చి కూర్చున్నాడు. రాజు పతంగ్ ఎగురేస్తున్నాడు. ఇంతలో ఉరుము ఉరిమింది. పిడుగు పడింది. "ఈ శని నిన్ను వదలడు." పెద్దగా అరుస్తూ డాబామీద కొచ్చింది లక్ష్మి. మెట్లపైన కూర్చున్న పాపిగాణ్ణి ఒక తన్ను తన్నింది. అంతే. క్షణంలో మెట్లన్నీ దొర్లుకుంటూ కింద పడిపోయాడు. రాజు కొయ్యబారిపోయాడు. లక్ష్మి ఒక్క క్షణం కంగారు పడిపోయింది. వెంటనే రాజును కిందకు లాక్కుపోయి తలుపు లేసేసింది. పాపం, పాపిగాడు! రాజు మనసంతా వాడిమీదే.

ఆ సాయంత్రం లక్ష్మి కిటికీ తలుపు తీసి నెమ్మదిగా చూసింది. గుడిసె ముందు ఎవరూ లేరు. ఆరు గంటలు కాకుండా రాజును తయారు చేసి సినిమాకి బయలుదేరింది లక్ష్మి. సినిమా కనిపించడం లేదు రాజుకి. మెట్లమీద నుంచి దొర్లి పడిపోయిన పాపిగాడే కళ్ళముందున్నాడు.

సినిమానుంచి ఇంటికొచ్చేశారు తల్లి, కొడుకు. ''అవును కానీ, మమ్మీ! పాపిగాణ్ణెందుకు మెట్లమీద నుంచి తోసేశావ్?'' రాజు మాటకి గతుక్కుమంది లక్ష్మి. వెంటనే సర్దుకుంది. ''నేను తోసేస్తానా! పాపం-వాడే కాలుజారి కిందపడిపోయాడు. క్రికెట్ చూపించారు ఎంత బావుందో చూశావా. నీకూ కొనిపెట్టనా బంతి, బాటు అన్నీ?"

రాజు మాట్లాడలేదు. వాడి చిన్న మనసుకి తెలుసు - పాపిగాడు కాలుజారి పడలేదని!

రెండు రోజులు పనికి రాలేదు రత్తి. ఆ రోజు గదులు తుడుస్తూ లక్ష్మితో మాట్లాడుతోంది. పాపిగాడి కాలు విరిగిం దన్నారట డాక్టర్లు-

హాస్పిటల్‌లో ఉన్నాడట. కట్టు ఇప్పుడే విప్పరట. విప్పినా కాలు వస్తుందో రాదో చెప్పలేమన్నారట. ఈ మాటలన్నీ శ్రద్ధగా వింటూ, ''అవునే, రత్తీ! నీ అదృష్టం, వా డదృష్టం బాగుంది కనక కాలు విరగటంతో సరి పోయింది. ఇంకేమన్నా అయితే - ఏమన్నా ఉందా?'' దీర్ఘంతీస్తూ స్వెటర్ అల్లడంతో మునిగిపోయింది లక్ష్మి.

''అంతే నమ్మగారూ! వాడిరోజు బాగుంది. కాలు విరిగిం దంతే!'' గబగబా గదులు తుడుస్తూ పోయింది రత్తి. ఈ మాటలన్నీ వింటున్న రాజుకి ఒక్కసారి భయమేసింది. రానంటుంటే బలవంతంగా తీసు కొచ్చింది తను కాదూ అనాడు పాపిగాణ్ణి? వాడు హాస్పిటల్లో ఉంటే చూసి వస్తే ఎంత సంతోషించేవాడు. ఈ అమ్మ ఒకర్తి తనమాట ఒక్కటీ ఒప్పుకోదు. క్షణం గుడిసెకేసి చూశాడు. మరోక్షణంలో గదిలోకి పరి గెత్తాడు. కిటికీలో పడేసిన రంగు రంగుల పతంగులన్నీ గాలికి కదులు తుంటే వాటిపైన ఎంతో కోప మొచ్చింది రాజుకి. అన్నింటిని ఇష్టమొచ్చి నట్టు చుట్టేసి దారాలతో కట్టేసి అటకపైన విసిరాడు మళ్ళా కనబడ కుండా. ఆ తర్వాత కొద్ది రోజులకే రాజు తల్లితో కలిసి తన ఊరు వెళ్ళి పోయాడు.

* * *

ఆకాశం నిండా సంధ్య కాంతులు అలుముకున్నాయి. అక్కడ క్కడ పతంగులు ఎగురుతున్న చిన్న చిన్న పక్షుల్లా కనిపిస్తున్నాయి. గుడిసెలో చిన్న దీపం వెలిగింది. మేడమీద నుంచి కిందికి దిగిన రాజు, గుడిసె కెదురుగా ఉన్న సోడా బండిని ఆపాడు.

సోడా చేతి కందించి— "నేను బాబూ! పాపిగాణ్ణి" అన్నాడు నవ్వుతూ. రాజు చేతిలో సోడా సీసా కింద పడబోయింది. నోట్లో సోడా చేదు విషమల్లే అనిపించింది. గొంతు దిగలేదు. "ఇదిగో" పాపిగాడి

చేతిలో రూపాయి పెట్టి చిల్లరకోసం ఆగకుండా లోపలి కెళ్ళిపోయాడు రాజు. 'మా బాబు ఎప్పుడూ మంచోడే!' సోడాబండి నడుపుకుంటూ కదిలి పోయాడు కుంటి పాపిగాడు!

సోఫాలో కూచుని పత్రిక తిరగేస్తున్న తల్లిని చూడగానే ఎందుకో కోపం కట్టలు తెంచుకుంది రాజుకి. అక్కడ నిలబడకుండా చెప్పులు తొడుక్కుని బయటికి నడిచాడు. ఎన్నో రంగు రంగుల గాలిపటాలు ఆకాశంలో ఎగరటం మానేసి, తన మెడచుట్టూ చుట్టుకున్నట్లుగా, ఉక్కిరి బిక్కిరయినట్లుగా అనిపించిందా నిమిషం రాజుకి. కుంటి పాపిగాడి సోడా బండి చప్పుడు చెవుల్లో మారుమ్రోగింది. ఎర్రని లిప్‌స్టిక్ పెదాలతో నవ్వుతున్న తల్లి ముఖం భయంకరంగా కనిపించింది కళ్ళముందు. ఎగరని గాలిపటాలెన్నో భీష్మించుకు కూర్చున్నట్లుగా డాబా నిండా చెల్లా చెదురుగా ఉన్నట్లనిపించింది. తల తిరిగినట్లయింది. రెండడుగులు ముందుకు వేసిన రాజు లోపలికొచ్చి చెప్పులు విప్పి గదిలో మంచంమీద వాలిపోయాడు.

*

# చెట్టు

చెట్టునుంచి జలజలా రాలి పడ్డాయి పళ్ళు. పిల్లలు బిల బిల పరి గెత్తుకుంటూ వచ్చారు. ముందు ఇద్దరు. ఇద్దరు నలుగురయ్యారు, ఆరుగు రయ్యారు, పదయ్యారు, పదిహేనయ్యారు, చిన్న, పెద్ద, అబ్బాయిలు, అమ్మాయిలు తలలు పైకెత్తి చిటారు కొమ్మనున్న కాయలవంక చూస్తు న్నారు. అంతలో ధనధనా రాలిపడుతున్నాయి కాయలు. జేబులు నిండా నింపుకొన్నారు. నోటికి కరచుకున్నారు. దోసిళ్ళలో నింపుకుని పరిగెత్తి పక్కనున్న ఇంటి గుమ్మం ముందు వాళ్ల జేబులు నింపుకుంటున్నారు. ఆ ఇంటి వాకిలినిండా పిల్లలే....

తాతగారు డాబామీద కర్ర పెట్టేసి నెమ్మదిగా మెట్లుదిగి వచ్చారు. అక్కడున్న పడక్కుర్చీలో వాలారు అలసట ఆయన ముఖంలో కని పిస్తోంది. ఈ కార్యక్రమం ఇంచు మించుగా నాలుగు మూడు రోజుల కొకసారి అలవాటే ఆయనకి.

"మీరు తినండి తాతయ్యా!" పిల్లలు పోటీలుపడి బాగా పండిన పళ్లు అందిస్తుంటే మెత్తనిది ఒక్కటి తీసుకుని అలా పిల్లల్ని చూస్తూ వుండ టంలో గొప్ప ఆనందముందాయనకి.

ఆ పెద్ద జామచెట్టు కాయలు కాస్తూనే వుంటుంది. అన్ని కాయలూ కోసేసినా మళ్లీ నాలుగు నెలలయ్యేసరికి చెట్టు నిండిపోతుంది. ఆ చెట్టు నున్న పళ్ళకోసం, పిట్టలు, పిల్లలు వస్తూ పోతూ వుంటే తాతగారికి పట్ట రాని సంతోషం. గొప్ప తృప్తి ఆ కళ్ళలోనే కనిపిస్తుంది. భగవంతుని సృష్టి ఎంత చిత్రమైందో అని ఆశ్చర్యపోతుంటారు ఎన్నిసార్లో ఆ చెట్టు కింద వాలు కుర్చీలో కూచోని....

పిల్లలు ఇంకా ఆ చెట్టు దగ్గరే నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు. గుమ్మంలో అడుగుపెట్టిన రాణికి ఆ దృశ్యం మహా చిరాకును కలిగించింది. ధుమధుమలాడుతూ తన బెడ్ రూములో కెళ్ళి కిటికీ తలుపులు ధన్మామని వేసుకుంది. కిటికీలోంచి జామచెట్టు కనిపించ దింక! తాతగారు ఓ నవ్వు నవ్వుకుని "ఒరేయ్ బుజ్జీ, ఆ మూల జామకాయ పండింది. చూశావా - తెచ్చుకో" అన్నారు.

ఢిల్లీలో రెండు గదుల ఫ్లాట్‌లో పెరిగింది రాణి,

అమ్మ, నాన్న, తమ్ముడు, తను తప్ప మరెవరూ తమ ఇంటికి రావటం, నాలుగు రోజులుండటం ఏనాడూ తెలియదు రాణికి. పైగా పిల్లల్ని ముద్దు చేయటమంటే చిరాకే కాదు, అలా ముద్దు చేసేవాళ్ళపై కోపం కూడా రాణికి.

రాణికి పెళ్ళయి ఆరు నెలలైంది. పెళ్ళికొచ్చిన స్నేహితులు, బంధువులు అంతా తన అత్తవారింటిని మెచ్చుకుంటూ ఇంత పెద్ద ఇల్లు ఎంత హాయిగా వుందో అని, ఇన్ని పూల మొక్కలు, ఈ పెద్ద జామ చెట్టు, ఖాళీస్థలం ఎంత బావుందో అంటుంటే ఆనాడు రాణికి అత్తవారిల్లు చాలా బావుందనిపించింది.

కానీ, అసలు పేచీ నెమ్మదిగా మొదలయింది. ఆ ఇంటి వాతావరణం ఎందుకో ఆమెకి నచ్చలేదు .. తనింట్లో ఏవి అనవసరంగా భావించి పెరిగిందో తను - ఇక్కడ అవన్నీ అవసరంగా వున్నాయి. ఈ ఇంటికి స్నేహితులు. చుట్టాలు ఎప్పుడూ వస్తూనే వుంటారు. వచ్చిన వాళ్ళందరికీ కాఫీలని, భోజనాలని అత్తగారు సిద్ధం చేస్తూనే వుంటారు. ఇది రాణికి ఏపాటీ నచ్చదు. పెళ్ళయిన కొత్తల్లో భర్తతో రహస్యంగా అందికూడా- 'ఇలా ఇంటికి ఎవరో ఒకరు ఎప్పుడూ వస్తుంటే నాకు చాలా బోర్' అని. రామం నవ్వేసి 'ఎవరూ రాకపోతే నాకు బోర్' అని అన్నాడు. మాట్లాడకుండా ఊరుకుంది.

ఆ ఇంట్లో పూర్తిగా నచ్చనిది ఈ జామచెట్టు.... అదేం చిత్రమో, ఎప్పుడూ కాయలు కాస్తూనే వుంటుంది. ఆ కాయల కోసం పిల్లలు ఎప్పుడూ ఆ ఇంట్లోకి వస్తూనే వుంటారు. ఎవరినీ అడగక్కర్లేదు. తిన్నగా డాబా ఎక్కి కొమ్మలు వంచి జామకాయలు కోసేసుకుంటారు. సగం సగం కొరికి కిందపడేస్తారు. ఎక్కడ చూసినా ఆకులు, కొరికి పడేసిన పిందలు.... ఛీ, ఛీ.... తనింట్లో చిన్న డ్రాయింగ్ రూమ్, చక్కటి ఫ్లవర్ వాజ్.... అందమైన కుర్చీలు. ఇక్కడో.... ఆ పెద్ద హాల్లో వున్న కుర్చీలు, పిల్లలు తీసుకెళ్లి దొడ్లోకొచ్చి పొడుగాటి కర్ర తీసుకుని కుర్చీ ఎక్కి జామకాయలు కోయటం ఎన్నిసార్లు తను కళ్ళతో చూసిందో.... మళ్లీ ఆ కుర్చీ లోపల పెట్టరు.... ఛీ, చాలా న్యూసెన్సు.... రాణి ముఖం నిండా చిరాకు!

'అయినా రాణీ, నీ కెందుకంత కోపం.... ఆ చెట్టు కాయలు పిల్లలు కాకపోతే మనం తింటామూ?' రామం పుస్తకంలోంచి తల ఎత్తకుండానే అన్నాడు.

'మనం తినం కానీ-' ఏదో చెప్పబోయింది రాణి.

తాతగారు చేత్తో పెద్ద కర్ర పట్టుకుని మేడ మెట్లు ఎక్కుతున్నారు. రాణి ఒళ్లు మండిపోయింది.

'చూడండి.... ఈ తలుపు మీరు తియ్యడానికి వీల్లేదు. ఆ పిల్లలంతా ఎలా దూరుతారో చూస్తాను.' రాణి లేచి గబగబా వెళ్లి తలుపేసింది.

చెట్టునించి కాయలు కింద రాలి పడుతున్నాయి. పిల్లలు తలుపులు బాదుతున్నారు. రాణి అలా చూస్తూ కూచుంది. అప్పుడు గుర్తొచ్చింది స్టౌమీద పెట్టిన పాలు పొంగిపోయి వుంటాయని. లోపలికి వెళ్లింది రాణి. గబ గబా తాతగారు తలుపుతీయడం, బిలబిలా పిల్లలు లోపలికి పరిగెత్తి వచ్చి కాయలు ఏరుకోటం జరిగిపోతోంది.

రాణికి కోపమే కాదు, అవమానంగా అనిపించింది. తను తలుపేసి వస్తే తాతగారు తలుపు తీయటం. అలా చేస్తే ఆ పిల్లలకి భయ మేముటుంది.

'నవ్వుతారేమిటి- ఆ పిల్లలకి నేనంటే ఏమున్నా భయముంటుందా?' రామం చేతిలోనున్న పుస్తకం లాగి విసిరిపారేసింది రాణి....కోపంతో బుగ్గ లెర్రబడ్డాయి. రామం నవ్వుతూనే అన్నాడు.

'నువ్వు కోపంగా వున్నప్పుడు మరీ బావుంటావు తెలుసా?' రాణిని దగ్గరికి తీసుకున్నాడు. 'పసిపిల్లలకి నీ మీద ప్రేమ ఉండాలి కానీ, భయ మెందుకు చెప్పు రాణీ?'

రాణీ మాట్లాడలేదు.... కళ్ళలో సన్నటి నీటిపొర కదిలింది.

రోజురోజుకీ చెట్టు పెద్ద సమస్యలా తయారైంది. దీన్ని ఎలా వదిలించుకోవాలా అని రకరకాల ఆలోచనలు చేసింది రాణి. స్నేహితు రాళ్ళతో ముచ్చటించింది....'ఇదేం పెద్దసమస్య?'అంది లీల.ఆసాయంత్రం ఆఫీసునుంచి కలిసివస్తూ....నెమ్మదిగా ఉపాయం చెప్పింది....చెట్టుకి బేరం కుదిరింది.

నాలుగు రోజులయేసరికి తెల్లవారగానే కూరలమ్మే అబ్బాయి చెట్టు ఎక్కాడు. కింద సంచి పట్టుకుని మరొకతను నుంచున్నాడు. కాయలు కోస్తున్న సందడి ఇరుగుపొరుగు పిల్లలకి ఎలా అంతుపట్టిందో, పరుగు పరుగున వచ్చారు. ఆశ్చర్యపోతూ చెట్టువంక చూస్తున్నారు. ఒక్కకాయ కిందపడుతుందేమో ఎత్తుకుపోదామని సిద్ధంగా నిల్చున్నారు. చెట్టువంక ఆశగా చూస్తున్నారు. చెట్టునున్న కాయలన్నీ సంచిలో నింపుకున్నాడు కూరగాయలవాడు. అమ్మగారికి డబ్బు లెక్కకట్టి ఇచ్చేశాడు. చెట్టు మొత్తం దులిపేశాడు వాడు. పిల్లలంతా బిక్కమొకం వేసుకుని వెళ్ళి పోయారు. తాతగారు గదిలోంచి బయటికి రాలేదు. రాణి విజయగర్వంతో లోపలకొచ్చింది.

'ఇదిగో—' డబ్బు బల్లమీద పెడుతూ భర్త ముఖంలోకి చూసింది.

'అది రాక్షసి డబ్బు— ఇక్కడినుండి తీసేయ్!'

రామం ముఖం గంభీరంగా వుంది.

'అంటే, నేను రాక్షసినా?' గొంతు సవరించుకుంది రాణి. రామం మాట్లాడలేదు. రోజూ పదింటికి ఇల్లువదిలే రామం, గంటన్నర ముందర ఇంట్లోంచి వెళ్ళిపోయాడు.

రాణి గబగబా పనులు తెముల్చుకుంది. ఆ రోజు ఎంతో ఆనందంగా వుంది ఆమెకి. ఏదో గెల్చినగర్వం, ఆనందం ఆమె కళ్లల్లో మెరిసాయి.

గేటు సందులోంచి పసికళ్ళు తొంగిచూడ్డం కనిపించింది రాణికి. 'ఫో!' కేక పెట్టింది. ఒక్కపరుగుతీసాడు పసివాడు.

సాయంత్రం ఆఫీసునుంచి రాణీ వస్తుంటే ఎక్కడనుంచో మాటలు వినిపిస్తున్నాయి. 'ఆంటీ వస్తోందిరా.అటుచూడు, బ్రహ్మరాక్షసిలాలేదూ?'

'ఆ....దెయ్యంకదూ-' పిల్లలు కిలకిలా నవ్వుకున్నారు. రాణి తల తిప్పి వెనక్కి చూసింది. చిన్న రాయి భుజానికి తగిలింది.

'సారీ ఆంటీ.... నేను కాదు, నేను కాదు.'

'సరే.' గబగబా నడుస్తోంది రాణి.

'ఆంటీ—'

వెనక్కి తిరిగింది రాణి. తలుపు సందులోంచి పొద్దున కనిపించిన చిన్న కళ్ళు. 'ఆ చిన్నది కోసుకోనా—'

'ఊఁ.' రాణి ఉరిమింది.

పిల్లలు గలగలా నవ్వి పరుగెత్తారు.

ఆ ఇంట్లో వాతావరణంలో చాలా మార్పు వచ్చేసింది. ఉన్నట్టుండి తాతగారు ముభావంగా అయిపోయారు. రామం చాలా సీరియస్‌గా ఉంటు న్నాడు, తన పని తను చేసుకుంటూన్నాడు. ఇరుగుపొరుగు పిల్లలెవరూ ఇంట్లో అడుగుపెట్టటంలేదు.

మూడు నాలుగు నెలలయ్యేసరికి మళ్ళీ చెట్టు పూలతో, పిందెలతో నిండిపోయింది. అయినా ఆ చెట్టువైపు కన్నెత్తి చూడటంలేదు ఎవరూ. ఒక్క పసివాడు కూడా గుమ్మంలో అడుగుపెట్టటంలేదు.

రాణీకి కొన్నిసార్లు ఆశ్చర్యం, మరికొన్నిసార్లు భయం కలుగు తోంది. ఈ ఒక్క సంఘటన వీళ్ళ మనసుల్ని ఇంత గాయపరచింది. చెట్టుకేసి చూసింది రాణీ. కాయలన్నీ అలాగే వున్నాయి. పిట్టలుకూడా రావటంలేదా ఏమిటీ? నవ్వొచ్చింది రాణీకి.అంతటా నిశ్శబ్దం. ఏదో వెలితి. తాతగారు ఉత్సాహంగా డాబామీదికి వెళ్ళటమే లేదు.

ఆఫీసునించి వస్తుంటే, జామకాయల బండిచుట్టూ పిల్లలు మూగి కొనుక్కుంటున్నారు.

గబగబా ఇంట్లోకొచ్చిన రాణీకి, కుర్చీలో దిగాలుపడి కూర్చున్న తాతగారు కనిపించారు.

ఈ ఒక్క చెట్టు ఇంత గొడవ సృష్టించింది. అయినా పిల్లల్ని తనెందుకు కోసుకోనివ్వటంలేదు? వాకిలంతా కాయలు, గింజలు, ఆకులు పారేస్తారనా? పనిమనిషి తుడుస్తుంది. కాకపోతే, ఒక్కసారి తనూ వాకిలి శుభ్రంగా తుడుచుకోవచ్చు.ఈ చెట్టు ఎన్ని వసంతాలు చూసిందో?ఆ రోజు ఎంగేజ్‌మెంట్ అయ్యాక తను ఈ ఇంటికొచ్చినపుడు, ఈ డాబామీదికి తీసుకెళ్ళి తనకు జామకాయలు కోసిచ్చాడు రామం. 'నేనూ, నా ఫ్రెండ్సూ ఎప్పుడూ ఈ చెట్టు దగ్గరే ఆడుకున్నాం, ఈ చెట్టుకింద కూచొని చదువు

కున్నాం తెలుసా! ఐ లవ్ దిస్ ట్రీ' అన్నాడు రామం. ఆ మాటలు రాణి చెవుల్లో గింగురుమన్నాయి.

'అమ్మాయ్ చెట్టు కాయలు కోసుకునేందుకు అతనొచ్చాడు.' తాతగారి గొంతు గదిలో కిటికీదగ్గర కూచుని చెట్టునుచూస్తున్న రాణికి విన్పించింది

గబుక్కున తలుపు తీసుకు బయటకొచ్చింది.

గబగబా గేటుదగ్గర కొచ్చింది. 'ఇటుచూడు, ఈ మాటు కాయలు అమ్మకానికివ్వద్దని తాతగారు అన్నారు. అందుకని.' రాణి నెమ్మదిగా అంది.

'సరే, ఇంకోసారి వస్తానని' అతను సంచి భుజాన వేసుకుని వెళ్ళిపోతుంటే, 'సరే, సరే' బంగారుగా లోపలికొచ్చేసింది రాణి.

తను రాక్షసికాదు, రాక్షసికాదు! రాణి తనలోతనే అనుకుంటూ గుమ్మంలోకెళ్ళింది.

'ఇటురా.'

'బాబూ రా.'

'కాయలు కోసుకోండిరా.'

'నాన్నా, ఆ చెట్టు కాయలన్నీ మీకే.'

రాణి మాట ఎవరూ వినటంలేదు.భయం భయంగా చూసి పక్కకు తప్పుకుంటున్నారు పిల్లలంతా.

'నాకు వద్దు ఆంటీ....నేను కొనుక్కుంటా.' పక్కింటి రాజా గుమ్మంముందు నుంచుని చెట్టువంక చూస్తూ అన్నాడు.

చిన్నపిల్లలు వస్తుంటే కొంచెం పెద్దపిల్లలు ఆపుతున్నారు పోనీకుండా. రాణీ అలాగే గుమ్మందగ్గర నిల్చుంచి చాలాసేపు. ఆమె కళ్ళనిండా నీళ్ళు నిండాయి. చెట్టువంక చూసింది ఒక్క నిమిషం.

గబగబా లోపలికొచ్చింది. పెద్ద కర్ర తెచ్చింది. 'తాతగారూ.... చెట్టు కాయలన్నీ దులపండి, పిల్లల్ని రమ్మనండి....హాయిగా తినమనండి'

తాతగారు క్షణం చెవులని నమ్మలేకపోయారు. 'రండి తాతగారూ. కాయలన్నీ కోయండి.' బతిమాలుతోంది రాణి.

తాతగారు నెమ్మదిగా డాబామీద కెళ్ళారు. బయట నుంచున్న పిల్లలంతా ధైర్యంగా తోసుకుంటూ లోపలకొచ్చేశారు.

ఒకళ్ళు, ఇద్దరు, పదిమంది, ఇరవైమందితో ఆ వాకిలి నిండి పోయింది.

చెట్టునించి కాయలు రాలిపడుతుంటే, పరుగు పరుగున వచ్చి ఏరు కుంటున్నారు. ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటున్నారు. జేబుల్లో నింపు కుంటున్నారు.

ఆ పిల్లల్నిచూస్తూ ఆనందంతో కన్నీటిబిందువులు రాణి చెక్కిలిపై జారిపడుతుంటే, అప్పుడే గుమ్మంలో అడుగుపెట్టిన రామం విస్తుపోయాడు ఆ దృశ్యాన్ని చూసి.

'నేను రాక్షసిని కాదండీ!' రాణి గొంతు గద్గదికమౌతుంటే 'నాకు తెలుసు రాణీ!' గుండెలకు హత్తుకున్నాడు రామం. *

# హే! ఆషాఢస్య ప్రథమ దివస!!

'ఇదిగో' ఇంట్లో అడుగుపెట్టగానే అందించింది ఉత్తరాన్ని తల్లి.

'నా ముఖం, ఒరిఘాదస్తం' ఉత్తరం బల్లమీద పడేసి వో నవ్వు నవ్వాడు రామం.

'ఈవిడేది' అన్నాడు ఇల్లంతా కలయచూస్తూ.

'ఇప్పుడే వస్తుందిలే - పేరంటానికెళ్ళింది' తల్లి సమాధానం.

మళ్ళా వోమాటు ఉత్తరాన్ని చదివాడు రామం.

'ఎవరి దగ్గరనుంచి?' రామం ముఖం చూస్తూ అడిగింది తల్లి.

'మామగారు - ఆషాఢమాసం వస్తోందిట, వాళ్ళ అమ్మాయిని పంపాలట.'

'అవును మరి తొలి ఆషాఢంలో ఆడపిల్ల పుట్టింట్లోనే ఉండాలిమరి.'

'నాన్సెన్స్' సాక్సు బల్లకిందకు విసిరికొడుతూ అన్నాడు రామం.

'బావుంది - లోకానికంతా వున్నదే- తొలి ఆషాఢంలో ఆ అమ్మాయి అత్తారింట్లో ఉండకూడదు. నువ్వు కూడా అత్తారింటికి వెళ్ళకూడదు.' రామం ముఖంచూస్తూ నవ్వింది తల్లి. అమ్మ అలా నవ్వినపుడు రామానికి బలే కోపమొస్తుంది. ఎందుకో?

'అయినా అత్తాకోడలు వో ఇంట్లో ఉంటే ఏమవుతుందిట'. గొంతు కాస్త రెట్టించాడు రామం.

తల్లి పకపకా నవ్వింది. గదిలోంచి వస్తూ తండ్రి కూడా నవ్వాడు.

'అది కాదురా, అత్తాకోడళ్ళు వో గడప దాటకూడదంతే' అన్నాడు తండ్రి.

'గడపదాటితే ఏమవుతుందో చూద్దాం మనం' రామం తండ్రికేసి చూసాడు.

'అదేం కుదరదులే.'

'అలాటప్పుడు ఆ ఆషాఢం ఏదో అయ్యాకే పెళ్ళిళ్ళు చెయ్యొచ్చుగా-వైశాఖంలో పెళ్ళిచేయటం దేనికి' - ఈ మాటు అమ్మా నాన్నతో పాటు రామం కూడా నవ్వేశాడు.

పట్టుచీర ఫెళ ఫెళ మంటుంటే గుమ్మంలో అడుగుపెట్టింది ఇందిర.

'ఇదిగో మీ నాన్న ఉత్తరం.'

ఉత్తరం చదువుతున్నంతసేపు ఇందిర ముఖంలోకి చూచాడు రామం. సంతోషం ముఖంలో దాచుకోలేకపోతోంది. ఒక్కసారి గుమ్మంలోకి చూసాడు రామం. అమ్మ నాన్న లోపల కెప్పుడో వెళ్ళిపోయారు.

'ఊ-ఏమంటావ్' అన్నాడు కాస్త నెమ్మదిగా రామం.

'హాయిగా వెడతాను.'

'వెళ్ళిపోతావా' ఆవిడ అభిప్రాయాన్ని తెలుసుకోవాలని మళ్ళా అడిగాడు.

'వెళ్ళద్దుమరి - రెండు నెలలయింది మా వాళ్ళని చూసి - మా బుజ్జిగాడు ఎలా వున్నాడో ఏమో-' ఇందిర క్షణంసేపు పుట్టింటి ఆలోచనల్లో తేలిపోయింది.

'సరే వెళ్ళు- అక్కడేవుండు-మళ్ళారాకు' ఇందిర చేతిలో ఉత్తరం లాక్కుని విసిరికొట్టాడు రామం.

ఇందిర విస్తుపోయింది.

'మీరూ నేనూ కలిసే వెళదాం-కొన్ని రోజులుండి వచ్చేయొచ్చు మీరు-ఆయినా దిక్కుమాలిన ఆఫీసు రోజూ ఉండేదేగా-'

'నీ సలహా అడగలేదు నేను-'

పెళ్ళయి రెండు నెలలన్నా కాకుండా అప్పుడే రావాలా ఆషాఢ మాసం కొంప మునిగిపోతున్నట్లు! ఇంతకు ముందు ఎన్ని ఆషాఢాలు వచ్చి వెళ్ళలేదు కనక. ఎప్పుడు వచ్చేవో, ఎక్కడు పోయేవో,-అయినా ఒక రోజా రెండు రోజులా-నెల్లాళ్ళు, అంటే ముప్ఫై రోజులు, ముప్ఫయి రాత్రులు, ముప్ఫయి పగళ్ళు-ఇంపాసిబుల్, ఇంపాసిబుల్.

వేలు చుర్రుమని కాలగానే సిగరెట్టు ముక్క యాష్ట్రేలో పడేశాడు రామం.

ఈ మామగారొకరు, పెద్ద సాంప్రదాయాలతో కొట్టుకుపోతున్నట్టు-రామానికి దూరంగావున్న మామగారిమీద చాలా కోపం వచ్చింది. ఆ కోపం పోస్ట్‌మేన్ మీద, తల్లి మీదకూడా వ్యాపించింది.

అతి ముఖ్యమయిన ఉత్తరాలు చాలా ఆలస్యంగా అందించడం; నాలుగిళ్ళ అవతల పడేయటము పోస్టుమాను కలవాటే - ఇదెందుకో అతి ముఖ్యమయినదానిలా పట్టుకొచ్చి పడేశాడు-అమ్మమాత్రం, 'అబ్బాయ్, నీకేదో ఉత్తరం వచ్చిందిరా, చెప్పడమే మరిచాను., చూసావా ఎంత మతిమరుపో' అంటూ పదిహేను రోజుల తర్వాత ఉత్తరాన్ని చేతికిచ్చిన రోజులు లేకపోలేదు! మరి ఈ రోజు! ఇంతకీ తన దురదృష్టం.

*　　　*　　　*

ఓ మెరపులాంటి ఆలోచన రామం బుర్రలో మెదిలింది. తండ్రి పక్కన భోంచేస్తున్న రామం సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలియక తికమకపడ్డాడు. ముద్ద గొంతులోకి దిగటంలేదు-

'అమ్మా, పిన్ని మనింటికొచ్చి ఎన్నేళ్ళయిందో చూసావా'-రామం తల్లి ముఖంలోకి చూచాడు.

'నిజమే మరి, దాని కూతురి పెళ్ళికి కూడా మనం వెళ్ళలేదు. నాకూ చూడాలని ప్రాణం పీకుతోంది'

అమ్మమాటలకి రామంకి లేచి గంతులెయ్యాలనిపించింది.

'చుట్టరికాలు వస్తూపోతూ వుంటేనే మరి' అన్నాడు రామం.

'దానికయినా నాకయినా ఒకటే గొడవ; ఇల్లు- ఇల్లు వదలి పోవాలంటే కుదరదు'

'బావుంది - ఇల్లు ఏమీ అవదులే - మేమంతా వున్నాంగా - నువ్వు హాయిగా పిన్ని దగ్గరకెళ్ళి వో నెల్లాళ్ళుండిరా' - గుమ్మంలో నుంచున్న భార్యకేసి రహస్యంగా చూస్తూ అన్నాడు రాము.

'మీ ఆవిడ దోవను ఆవిడ, మీ అమ్మదోవను అమ్మ వెళ్ళిపోతే నేను ఈ వంటలు వార్పులు చేయలేను బాబూ'

రామం ముఖం ఒక్కసారి పాలిపోయింది. పెద్ద ఆలోచన ఒక్క క్షణంలో ఆర్పేశారు నాన్నగారు.

అమ్మ పిన్నివాళ్ళ ఊరెడితే ఇందిర పుట్టింటి కెళ్ళాల్సిన సమస్య రాదు. గడపలు పెద్ద సమస్యలుగా కళ్ళముందు నిలవపు- ప్చ్! ఏం లాభం!

తానొకటి తలుస్తే నాన్నొకటి తలచారు!

'ఎంతసేపు కలుపుతావురా-తిను' అమ్మ గొంతు విని ఉలిక్కి పడ్డాడు.

'నీ ఇష్టం- వెడితే పిన్ని సంతోషిస్తుందంతే' నెమ్మదిగా లేచాడు రామం.

*　　*　　*

ఆషాఢం దగ్గరకొస్తున్నకొలదీ రామం మనసుకి విశ్రాంతి దూర మవుతోంది. ఊళ్ళోనే అత్తారిల్లయితే ఏ సినిమా హాల్లోనో, హోటల్‌లోనో, రోడ్డు చివరలోనో కలుసుకోవచ్చు- ఈ పెద్దవాళ్ళకేం ఇలాగే చెబుతారు. ఒకసారి అమ్మమీద, నాన్నమీద, మామగారిమీద, ఊళ్ళో పెద్దవాళ్ళందరి మీద కూడా కోపం వచ్చింది రామానికి!

అగ్గిపెట్లో పుల్లలయిపోయాయి. వెధవ అగ్గిపుల్లలకోసం ఎవడు వెడతాడు వంటింటిదాకా.

'ఇదిగో'- కేక పెట్టాడు రామం.

పనిలో వున్న ఇందిర చీరకొంగుతో చేతులు తుడుచుకుంటూ వచ్చింది.

'అగ్గిపెట్టె'

'దీనికేనా ఇంత కేక పెట్టారు' ఇందిర అగ్గిపెట్టి రామం ఒళ్లో పడేసింది.

'ఆగాగు' అన్నాడు.

'పని అయ్యాక వస్తాను'

'నేను పెద్ద సమస్యతో తల బాదుకుంటూంటే నీకేంపట్టదు- సరే వెళ్ళు'-

ఇందిర సోఫాలో కూలబడింది.

'మా స్నేహితుడు గది ఖాళీచేసి ఇవాళ ఊరెడుతున్నాడు ఆఫీసు పనిమీద- వాడి గది మనం తీసుకుందాం- ఎలావుంది ఆలోచన'- ఇందిర పకపకా నవ్వేసింది రామం మాటలకి.

'స్టుపిడ్- ఏమీ అర్థంకాదు- వెళ్ళు- పనిచేసుకో'- రామం కిటికీలోకి చూస్తూ నిలబడ్డాడు.

'నెల్లాళ్ళకోసం గది తీసుకుంటే అందరూ నవ్వరూ- అయినా అత్తగారూ మామగారూ ఒప్పుకోవద్దూ'

'ఎవరో నవ్వితే నాకేమిటి- ఇప్పుడు ఆషాఢం అని వెడతావు- ఆ తర్వాత మీ అమ్మ శ్రావణమాసం నోములని ఉంచేస్తుంది నేనొక్కణ్ణి ఉండలేను ఇందూ'- రామం కిటికీలోకి చూస్తూ నిలబడ్డాడు.

ఇందిర మాట్లాడలేదు.

'అమ్మ పిలుస్తోంది'

ఇందిర కదలలేదు.

'నిన్నే, అమ్మ పిలుస్తోంది వెళ్ళు- ఏడుపెందుకూ'

గబగబా పమిటతో కన్నీళ్ళద్దుకుని వెళ్ళిపోయింది ఇందిర.

* * *

రామం గదిలో అడుగుపెట్టాడు. తండ్రి పేపరు చూస్తున్నాడు. తన అభిప్రాయాన్ని బయటపెట్టడానికి నానా ఇబ్బందీ పడుతూ చివరక్కి తేల్చాడు రామం.

'హాయిగా వెళ్ళి ఉండండి- నెల్లాళ్ళు ఇట్టే తిరిగొస్తాయి' అన్నాడు పేపరులోంచి తలతీయకుండానే తండ్రి. తండ్రికి ఎలా కృతజ్ఞతలు చెప్పాలో తెలియక ఉక్కిరిబిక్కిరయ్యాడు రామం.

* * *

రామం, ఇందిర చిన్నగదిలో హాయిగా వున్నారు. 'ఏమో బాబూ ఎలా వుంటారో, పురుళ్ళకని, పెళ్ళిళ్ళకని పుట్టింటికెళ్ళి కూచుని' అనుకుంది ఇందిర ఆషాఢాన్ని గెల్చుకున్నామన్న ఆనందంలో.

* * *

ఇందిరముఖం ఆక్షణం చిన్నబోయింది. సాయంత్రం రాము ఇంటికొచ్చాడు ఆఫీసునుండి.

'ఇదేమిటండీ ఖర్మ'

ఇందిర మాట క్షణం అర్థంకాలేదు రామానికి.

'ఏమైంది'

'ఏమవాలో అదే అయింది- ఆ ఇంటాయన వచ్చాడు, నా దగ్గర నుంచి గది తీసుకున్న మనిషి నాకు అప్పగించాలి కాని ఇదేమిటని ఒక టే గోల- నాకు తెలియదు మీతో మాట్లాడమన్నాను'-

ఇందిర చిరాగ్గా ముఖం పెట్టింది.

రామం బట్టలు మార్చుకుని కాఫీ తాగుతున్నాడు- యమునిలా ప్రత్యక్షమయ్యాడు ఇంటివాడు-

ఎంతో నచ్చచెప్పాడు, బతిమాలాడు రామం ఇంటివాణ్ణి. 'ఈనెల అయిపోయాక ఒక్కరోజయినా మాకొద్దు ఈ గది' అన్నాడు.

'అదేమీ కుదరదు, ఆషాఢంలో మా అమ్మాయి వస్తుంది. మా అల్లుడికి ఇక్కడే ఉద్యోగమయింది. అత్తఅల్లుడు ఒక గడపలోంచి నడవ కూడదు. అందుకు ఈ గది ప్రత్యేకంగా కావాలి' అన్నాడు వేరే మాటకి అవకాశం లేకుండా.

క్షణకాలం దిక్కు తోచలేదు రామానికి.

'సరే చూడు ఇందూ, ఆఫీసుకి సెలవు పెట్టేస్తాను-మీ నాన్నకి రాయి, నాకు వో గది ప్రత్యేకించమని, ఏం'-ఇందిర ముఖం ఒకసారి వెలిగింది. హాయిగా పుట్టింట్లో తను భర్త వో నెల్లాళ్ళు గడపవచ్చు.

రామం ఆఫీసుకెళ్ళిన అర్థగంటకే వీధి తలుపు చప్పుడయింది. అప్పుడే సెలవు పెట్టి వచ్చేశాడేమో అని ఆలోచిస్తూ తలుపు తీసింది. ఇందిర.

గుమ్మంలో మామగారు!

'చూడమ్మాయ్, మీరిలా విడిగా ఉండటం మీ అత్తగారికి నచ్చ లేదు—అయినా ఆవిడ చెల్లెల్ని చూడాలని అనుకుంటోంది-వాడేమో నిన్ను

పుట్టింటికి పంపడాయే - అందుకని ఆషాఢంలో మీ అత్తగారు ఇక్కడ లేకుండా వుంటే సరిపోతుంది గదా అని ఆవిడ చెల్లెలింటికి వెడతా నంటోంది - అబ్బాయిరాగానే ఇద్దరూ వచ్చేయండి'—

'హమ్మయ్యా' ఇందిర విశ్రాంతిగా ఊపిరి పీల్చుకుంది.

ఇంటివాడితో పేచీ అక్కర్లేదు.

ఆఫీసుకి సెలవక్కర్లేదు.

టిక్కట్లకి డబ్బు తగలెయ్యక్కర్లేదు!

గుమ్మంలో అడుగుపెట్టగానే రామానికి చెప్పింది శుభవార్త. రామం పొంగిపోయాడు.

'చూసావా మావాళ్ళు ఎంత మంచివాళ్ళో' అన్నాడు ఒక్క సారిగా.

తల్లి రేపు ప్రయాణం. ఎల్లుండితో ఆషాఢం వచ్చేస్తుంది. అవి ఇవి సర్దుతోంది. పిన్నికి ఇష్టమని చిన్న జాడీలో ఊరగాయ సర్దింది.

నాలుగు గంటలకి ప్రయాణం. సామానంతా సర్దుకోటం అయింది.

కాఫీ ఫలహారాలుచేసి హాలులో కూచుని కబుర్లు చెప్పుకుంటు న్నారు రామం, ఇందిర, తల్లి, తండ్రి.

పోస్ట్‌మాన్ పడేసిన ఉత్తరాన్ని చదువుతున్నాడు తండ్రి.

'మళ్ళీ మామగారేమో చూడండి' అన్నాడు రామం,

ఉత్తరం చదవటం పూర్తిచేసి తల్లికేసి చూసాడు ముసలాయన రామంకేసి చూసాడు తర్వాత.

'మీ చెల్లాయి మొగుడు వస్తున్నారట రాత్రికి.'

తల్లి ముఖంలోకి చూచాడు తండ్రి.

రామం ముఖం ఒక్కసారి పాలిపోయింది.

'ఏమిటో చెప్పండి సరిగ్గా' అంది ఖంగారుగా తల్లి.

'ఏముంది—మీ మరిది నెల్లాళ్ళ సెలవుపెట్టి వస్తున్నాడు. అక్కను చూడాలని మీ చెల్లాయి చాలా అనుకుంటోందిట. పైగా వాళ్ళ అల్లుడు వాళ్ళ ఊరు ఉద్యోగ ప్రయత్నాలకోసం వస్తున్నాడట. ఆషాఢమాసం కదా అత్త అల్లుడు ఒకే గడపలో నడవకూడదనీ, చాలా రోజులై అక్కని చూడాలనుకుంటోందని — బయల్దేరి వస్తున్నాడు — ఈ ఉత్తరం నిన్న ఇయ్యాల్సింది, ఇవాళ ఇచ్చాడు. అదీ—విన్నావా' ముసలాయన రామం ముఖంలోకి చూచి నవ్వాడు.

రామమూ నవ్వాడు ఏడ్వలేక!

ఇంక ఉపాయాలు ఆలోచించే స్థితి దాటిపోయింది రామం బుర్ర.

తను నిమిత్తమాత్రుడు, తను చేయగలది ఏమీలేదు!

ఇందిర రైల్లో కూర్చుంది.

అనుబంధాల్ని, ఆప్యాయతల్ని దూరానికి దగ్గరికి తీసుకుపోయే రైలు కూసి కదిలింది.

రామం గుండె కదిలింది!

తనూ ఈ రైల్లో ఎక్కిపోతేనేం!

నీళ్ళ నిండిన కళ్ళతో రామంకేసి చూసింది ఇందిర.

రైలుతోపాటు, రామమూ కదిలాడు!

'ఇంక నెల్లాళ్ళు—'ఏడ్వాలనిపించింది రామానికి. నీళ్ళు తిరిగిన కళ్లు రహస్యంగా తుడుచుకున్నాడు నడుస్తూ.

రాత్రి నిద్రలేకుండానే ఆషాఢ తొలి ఉషస్సును చూశాడు రామం! *

# పడిలేచే కడలితరంగం

లలితమ్మ అన్నగారి ఊరు వెళ్ళాలని వాలుగేళ్ళుగా అనుకుంటోంది. కాని, ఎప్పుడూ ఒకటే సమస్య ఎదురవుతోంది. తను ఓ వారం రోజులు ఇల్లు వదిలి వెడితే ఏమీ కాదని అన్నగారు ఎన్నోసార్లు చెప్పాడు. "నువ్వు లేకపోయినా ఇల్లేమీ కాదు. ఎక్కడికీపోదు. ఎవరి పనులు వారు చేసుకుంటారు. సుఖంగా ఉంటారు" అని. అయినా ఏమిటో ఇల్లు వదిలి వెళ్ళడానికి లలితమ్మ మనసు సమాధానపడటం లేదు.

ఎనిమిదయే సరికి తన పెద్ద కొడుక్కు టిఫిన్‌చేసి బాక్సులో పెట్టి యియ్యాలి. ఒక్క రోజు మానేసినా వాడు ఏ హోటళ్ళలోను తినడు. తను లేకపోతే ఎవరు చేసి పెడతారు? చిట్టితల్లికి ఒక్కపని రాదు. దానికి జడ వేసుకోడం కూడ రాదు ఆఖరికి. శ్రీవారి సంగతి చెప్పనక్కర్లేదు—— బలవంతాన లాక్కొచ్చి కూచోపెట్టినా పెద్దగా తినాలనే అనిపించదు. చిన్నవాడు మహదుడుసు పిల్లాడు. స్కూలునించి తిన్నగా ఇంటికి వచ్చే వరకు రోజూ భయమే. ఈలాటి సంసారాన్ని వదిలి ఎక్కడకెడుతుంది, ఎలా వెడుతుంది తను? పైగా అన్నగారు నీకు రావాలనుకుంటే ఇవేమీ పెద్ద అడ్డంకులు కావులే అంటాడు. వాడికేమి అర్థం అవుతుంది తన యింటి పరిస్థితి? లలితమ్మ బియ్యం ఏరుకుంటూ పదేపదే ఆ విషయమే అనుకుంటోంది. క్షణంలో లలితమ్మ మనసు మారిపోయింది. తను ఇలా తాపత్రయపడుతోంది గాని తన చెల్లెలు ఏడాదికి ఆర్నెల్లు ఊళ్ళు తిరుగుతూనే ఉంటుంది. దాని సంసారాని కేమొచ్చింది? లక్షణంగా ఉంది - కాని, దాని విషయం వేరు - దాని మొగుడు, పిల్లలు ఇల్లంతా చూసుకుంటారు. మరి తనవాళ్ళో! లలితమ్మకి ఒక్కసారిగ మొగుడిమీద, పిల్లల

మీద విసుగు వచ్చేసింది. కాఫీ కూడా కాచుకో నవసరం లేకుండా ఇల్లు వదిలి ఒక్క రోజన్నా ఎక్కడికి వెళ్ళకుండా తనే ఈ ఇంటిని ఇలా తయారు చేసింది అనుకుంది మళ్ళీ. ఇప్పుడనుకుని ఏం లాభం - తనకి కుదరదు. అబ్బే, తనెక్కడ కెడుతుంది. మనసు నిశ్చయం చేసుకుంది లలితమ్మ బియ్యం డబ్బాలోకి ఎత్తుతూ. పిల్లలంతా పెద్దవాళ్ళయ్యాక ఎక్కడకన్నా ఊరేగచ్చు. ఇప్పుడేం తొందర - లలితమ్మ మనసు కుదుట పర్చుకుని హాయిగా పనులలో నిమగ్నురాలయిపోయింది.

* * *

రోజులు గడుస్తున్న కొద్ది చుట్టాలందరూ లలితమ్మకి గర్వం అని అయినా దాన్ని ఇంట్లో వాళ్ళు ఎక్కడికి పోనీరని రకరకాలుగ చెప్ప కోటం మొదలుపెట్టారు.

ఆ రోజు మామయ్య రోడ్డు మీద కనిపించి, 'ఏరా! మీ అమ్మని ఇల్లు కదలనీయకుండా కట్టేస్తున్నారు. దానికి మాత్రం పుట్టింటికి రావాలని ఉండదూ' - నిలదీసి అడిగేసరికి మెడికల్ కాలేజిలో మూడో సంవత్సరం చదవుతున్న రఘు ఏం మాట్లాడాలో తెలియక ఊరు కున్నాడు. మామయ్య అక్కడతో ఆపకుండా ఇంటికొచ్చి ఆఫీసు నుంచి వస్తున్న రాజశేఖరానికి ఎదురెళ్ళి 'ఏం బావగారూ! మా చెల్లాయిని ఒక్క వారంరోజులు పుట్టింటికి పంపరేమిటి - మా చెల్లాయిని మీ ఇంటికి కాపలా పెట్టేసి పట్టున్నారే - ఎప్పుడూ' అంటే రాజశేఖరం కళ్ళు ఎర్రబడ్డాయి.

'అయినా మెడిసిన్ చదువుతున్న పిల్లాడు కాఫీ కాచుకుని, కాస్త అన్నం ఒండుకోలేడంటే' అని ఒకరంటే 'అదేం చిత్రమో మరి - పదమూడేళ్ళ పిల్ల జడలేసుకోలేదంటుంది విన్నావా' అని ఒకరు. 'అసలు విషయం నే చెప్తా - అతనికి పెళ్ళాన్ని పుట్టింటికి పంపటం ఇష్టం ఉండదు - ఏమిటో మరి' అని మరొకరు అనుకుంటూ ఉంటే, చేరాల్సిన కబుర్లన్నీ రాజశేఖరం చెవికి, అంతకుముందే రఘు చెవికి చేరనే చేరాయి

ఆ రోజు తులసి కోట దగ్గర కూచుని బియ్యం ఏరుతోంది లలితమ్మ. రఘు తల్లి దగ్గర కొచ్చి కూచున్నాడు.

'అమ్మా! నిన్నోమాట అడుగుతాను కోపం రాకూడదు.

'చెప్పు ముందు' - రెండు బియ్యం గింజలు నోట్లో వేసుకుంది.

'మరి నువ్వు మామయ్య ఎన్నిసార్లు రమ్మన్నా ఎందుకెళ్ళవు? క్షణం విస్తుపోయింది.

'బావుంది నాకు వాడంటే కిట్టదనుకున్నావా?'

'మరెందుకు?'

'ఎందుకేమిటి - నేను నిజంగా నాలుగు రోజులు ఊరెడితే కదా మీకు తెలిసేది - తెల్లవారేసరికి అందరికీ అన్ని పనులు అమరుస్తుంటే ఎవరికీ తెలియదు.' తెల్లని లలితమ్మ చెవులు ఎఱ్ఱబడ్డాయి. అంటే లలితమ్మకి కోపం వచ్చేసింది. రఘుకి నవ్వొచ్చింది. ఇంకా ఆ విషయమే మాట్లాడితే అమ్మకి కోపం ఎక్కువయి పోతుందని భయమేసి అప్పటికి ఆ విషయం ఆపాడు. కాని, రెండు రోజుల తర్వాత రాజశేఖరం కాఫీ తాగుతూ 'నువ్వు ఓ వారం రోజులు మీ అన్నగారింటికి వెళ్ళి రారాదూ - వీదో ఇంట్లో గడుపుకుంటాం నెమ్మదిగా' అన్నాడు. 'అవును మమ్మీ! నువ్వెళ్ళు మేము ఎలాగో అన్నీ చేసుకుంటాము. అయినా నువ్వు మాకు ఏమీ నేర్పకపోబట్టి నీకీ భయం - ఒక్కసారి మమ్మల్ని ఒదిలిపెట్టు - అన్నీ పనులు నేర్చేసుకుంటామ్.' రఘు రేడియో చెవి దగ్గర పెట్టుకునే తల్లితో అంటున్నాడు.

'మమ్మీ! నువ్వు గనక ఊరెడితే నేను నాన్నకి హాయిగా అన్నం వండి పెట్టగలను తెలుసా?' పుస్తకాలు సద్దుకుంటూ చిట్టితల్లి.

'నేను లేకపోతే ఈ ఇల్లు ఎలా గడుస్తుంది? చెట్టుకొకరు, పుట్టకొకరు అయిపోతారు అని ప్రతి ఇల్లాలు సహజంగా భావిస్తుంది. కానీ

తను లేనంతమాత్రాన ప్రపంచం ఆగి పోదని, అన్నీ యథా విధిగా సాగి పోతాయని తెలిసినప్పుడు ఆ ఇల్లాలి మనసుగతేమిటి - లలితమ్మ ఆలోచిస్తోంది.

'అమ్మా! నా కోసం నువ్వేమీ భయపడకు. నువ్వు ఊరెళ్ళితే వచ్చే వరకు ఎవరింటికి వెళ్ళి అల్లరి చేయను చెట్లెక్కను, ఐరన్ బాక్స్ పెట్టి బట్టలు ఇస్త్రీ చేసుకోను. చాలా బుద్ధిగా ఉంటాలే - వెళ్ళు నువు.' చిన్నాడు ఉత్సాహంగా మాట్లాడుతుంటే అందరికీ నవ్వొచ్చింది.

క్షణంలో అంతా మళ్ళా ఎవరి పనులలోకి వారు వెళ్ళిపోయారు. పిల్లలు, భర్త అంతా వెళ్ళిపోయాక, 'పనులన్నీ అయ్యాక లలితమ్మ కాసేపు నడుం వాల్చింది. మనసు పరిపరి విధాలపోతోంది. ఇందాకటి మాటలు లలితమ్మ గుండెల్లో గుచ్చుకున్నాయి. ఇంట్లో అందరూ 'నువ్వెళ్ళు, నువ్వెళ్ళు' అనే అంటారు కాని ఒక్కరయినా 'అమ్మా వెళ్ళద్దే- మేము ఒక్కళ్ళం ఉండలేం అనరేం?' నువ్వెళ్ళు, మేము హాయిగా ఉంటాం అంటారు పిల్లలు. నువ్వెళ్ళు నేను ఇల్లు చూసుకుంటాలే అంటాడు భర్త. అంతే-అంతే, తనెవరికీ అక్కర్లేదా? తనెంత పిచ్చిది! ఇంత కాలంగా ఇల్లు వదిలి వెళ్ళడానికి ఎంత వెనకాడింది తను. అందరూ తనని వదిలేసినట్లు, తను ఉన్నా లేకపోయినా ఎవరికీ ఏ బాధ లేనట్లు, తను ఒంటరిదయిపోయినట్లు అనిపించగానే పెద్దగా ఏడుపొచ్చింది లలితమ్మకి. ఎవరికీ తనక్కర్లేదు. లలితమ్మకి కన్నీళ్ళు ఆగలేదు. ఆ క్షణంలోనే లలితమ్మ నిశ్చయించుకుంది - అన్నయ్యకు ఉత్తరం వ్రాస్తాను బయల్దేరుతున్నానని. వారం రోజులు కాదు,ఆర్నెల్లు లేకపోయినా నా కోసం ఏడ్చేవాళ్ళెవరు?!

* * *

లలితమ్మ ప్రయాణం నిశ్చయమైంది. స్టేషనుకి గం
ముందే వెళ్ళారు మంచి సమయం చూసి. ఎంత వద్దనుకున్నా చెప్పకుండ
ఉండలేకపోయింది లలితమ్మ.

'నీకు జడవేసుకోటం రాదు - పక్క పిన్నిగారిచేత వేయించుకో
చిట్టితల్లి నవ్వి 'ఊరుకో అమ్మా! అందరూ నవ్వుతారు మా క్లాసు' పి
లందరూ ఎప్పట్నుంచో వాళ్ళే వేసుకుంటారు తెలుసా?' దీర్ఘం తీసిం
చిట్టితల్లి.

'ఒరేయ్ పెద్దాడు! తలుపులు జాగ్రత్తగా వేసుకోండి. చిన్నా
దీపాలు పెట్టగానే నిద్రపోతాడు, కాస్త పెందరాళే వాడికి అన్నం పెట్టు
రఘు మేగజైన్ తిరగేస్తూ 'ఊ' అన్నాడు అసలు వినిపించుకోకుండ

'పనిమనిషిని ఓకంట కనిపెట్టండి-తెలిసిందా?' అబ్బ ఏమి
ఛాదస్తం మేము అన్నీ చూసుకుంటాంగా విసుక్కున్నాడు భర్త.

లోపలకెళ్ళు టైమవుతోందని భర్త హెచ్చరిస్తుంటే లలితమ
పెట్టెలోకెళ్ళి కూర్చుంది. ప్రాణాలన్నీ ఇంటిమీదే ఉన్నాయి.

రైలు పరిగెడుతోంది. ఎదురు సీటులో కూచున్నావిడ లలితమ్మ
కబుర్లకు దిగింది.

'ఇంట్లో కుక్కపిల్ల ఉందండి. నేనులేకపోతే అది బెంగపె
కుంటుంది. మొన్న మా చెల్లెలి ఊరు వరంగల్ వెళ్ళి ఒక్కరోజు ఉ
వచ్చేసరికి పాపం బెంగపడి కాళ్ళకు చుట్టేసుకుంది.' లలితమ్మ వింట
కూచుంది.

'మావారికి మొక్కలంటే సరదా. వద్దంటే వినకుండా ఇంటినిం
కొనిపెట్టారు. నీళ్ళు పొయ్యాలంటే ఇంట్లో అందరికీ విసుగే - నే
పొయ్యాలి. తిరిగి వచ్చేసరికి ఎలా ఉంటాయో మరి.

మా పెద్దాడు అంటాడు - 'అమ్మా! అంతా నీ వెర్రికాని - నువ్వు లేనంతమాత్రాన ఏమీ ఎక్కడా ఆగిపోదు. ఇల్లు ఏమీ అయిపోదు. హాయిగా వెళ్ళిరా అంటూ బలవంతంగా రైలెక్కించాడనుకోండి. నిజంగా నాకిష్టంలేదు ఇప్పుడు బయలు దేరడం.' ఆవిడ అలా చెప్పుకుపోతుంటే లలితమ్మకి నోటిదాకా వచ్చింది - 'మావాళ్ళూ నన్ను బలవంతంగానే పంపిస్తున్నారు' అందామని. కాని, ఏమీ అనకుండా విని ఊరుకుంది. మమకారాలు పెంచుకోకూడదు - మనసులో అనుకుంది లలితమ్మ.

* * *

ఊరెళ్ళి నాలుగు రోజులు కాకుండా ఉత్తరం వచ్చింది లలితమ్మ దగ్గిరనుంచి. ఆ ఉత్తరం నిండా విశేషాలే "డబ్బా మూతలు జాగ్రత్తగా పెట్టండి. ఎలకలు తిరుగుతున్నాయి చిట్టి తల్లి పెంకితనం చేసినా కాస్త చూసీచూడనట్లు ఊరుకోండి, అది నాకోసం బెంగపడితే కష్టం. నాన్న గారి ఆరోగ్యం జాగ్రత్త. విసుక్కోకుండా నాన్నకి కావలసినవి చూడండి. నేను తొందరగా వచ్చేస్తాను' లలితమ్మ ఉత్తరం చదువుకొని పెద్దాడు నవ్వుకున్నాడు. పిల్లలిద్దరూ అమ్మ మంచిది కదూ అనుకున్నారు ఒకళ్ళతో ఒకళ్ళు.

ఉత్తరం రాసి పడేసిన తర్వాత లలితమ్మ ఓవారం రోజులుంది. ఒక్క ఉత్తరం కూడా రాలేదు. 'నువ్వు తొందరగా వచ్చేయి అమ్మా' అని చిట్టితల్లి రాస్తుందనుకుంది. పిల్లలు ఇబ్బంది పడుతున్నారు వెంటనే రమ్మని భర్త ఓ వైర్ చేస్తే ఎంత బావుంటుంది! ఆ, ఎందుకు చేస్తారూ తను లేకపోతే ఎవరికేమి లోటుందని అర్జెల్లున్నా రమ్మని రాయరేమో! తమ లేనిలోటు గుర్తించే వాళ్ళెవరూ లేరు. దీర్ఘంగా నిట్టూర్చింది లలితమ్మ. ఓ వెచ్చని కన్నీటి బొట్టు ఒళ్ళో వచ్చి పడింది.

* * *

లలితమ్మ ఇంట్లో అడుగు పెట్టే సరికి ఏదో తెలియని ఆనందంతో మనసు పులకరించిపోయింది. కాని, మరుక్షణంలో ఆనందం మాయ మయింది. 'మమ్మీ, మొన్న నేను కారంబూంది చేసాను. రోజూ జడలు నేనే వేసుకుంటున్నాను' పరిగెత్తి వచ్చింది చిట్టితల్లి తల్లికి ఎదురుగా.

'మమ్మీ - నిన్న నేను, స్నేహితులు పిక్నిక్‌కి వెళ్ళాం ఏం దెబ్బలు అనీ ఎక్కడా లేవులే!' చిన్నవాడు నవ్వుతూ తల్లితో అంటున్నాడు.

లలితమ్మ అలా చూస్తూ నిలబడింది. ఇదేమిటి పిల్లలంతా ఎంతో కొత్తగా కనిపిస్తున్నారు. నిజంగా చిట్టి తల్లికి చక్కగా బుగ్గలొచ్చాయి చిన్నవాడికి ఒక్కరవ్వ ఒంగొచ్చి నట్టుందేమిటి.

అవును . వాళ్ళంతా ముందే చెప్పారుగా - అమ్మా నువ్వెళ్ళు మేము హాయిగా వుంటామని.

"నీ పిల్లలంతా క్షేమంగా ఉన్నారా? వాళ్ళే వండుకు తింటున్నారు పాపం, అని రోజూ సాయంత్రం స్వీట్సు, రాత్రి అన్నం తిన్నాక ఫ్రూట్స్, పడుకునేటప్పుడు మిల్కు - చూశావా? ఎన్ని ఏర్పాట్లు చేసానో' రాజశేఖరం నవ్వుతుంటే ఎవరైనా పిల్లల్ని చూస్తే దిష్టితగులు తుందేమో ఇప్పుడు అనుకుంటోంది లలితమ్మ మనసులో.

* * *

లలితమ్మ తెల్లవారకుండా ఇంటి పనులలో మునిగిపోయింది. కాని, మనసు మందంగానే పని చేస్తోంది. 'ఫరవాలేదు నేను లేకపోయినా వీళ్ళంతా హాయిగా బతికేయగలరు.' దీర్ఘంగా నిట్టూర్చి వంటిల్లంతా సర్దడంలో మునిగిపోయింది.

'మా అమ్మ వచ్చిందిగా - నేను స్కూలుకిరాను ఇవ్వాళ' పిన్ని గారి పిల్లడితో చెప్తున్నాడు చిన్నాడు. 'మమ్మీ జడ కుదరటంలేదు వెయ్యవే!' జుట్టు విప్పుకుని రిబ్బన్లు, దువ్వెన పట్టుకు నిల్చుంది చిట్టితల్లి.

'ఈ పది రోజుల్నించి ఇంట్లో అడుగుపెట్టాలంటే చిరాకేసింది. ఇవాళ హాయిగా వుంది ప్రాణం. ఆఁ - మా ఆవిడ ఊర్నించి వచ్చేసింది. ఇవాళ ఆఫీసుకి సెలవు పంపిస్తున్నాను.' రాజశేఖరం నవ్వుతూ ఫోన్లో మాట్లాడుతున్నాడు.

'గబగబా చెయ్యి చపాతీలు - కాలేజీకి టైమయిపోతుంది.' పెద్ద వాడు రఘు తల్లిని తొందర పెడుతున్నాడు.

ఇల్లంతా తనే అయి ఆ పని ఈ పని చేస్తున్న లలితమ్మ మనస్సు ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయింది. *

# ఓ ఇల్లాలు కావాలి

"నాన్నా...."

విశ్వనాథం తలెత్తాడు పేపర్లోంచి.

లలిత క్షణం మాట్లాడలేదు.

"నాకు పెళ్ళి చేయరా ఇంక-"

విశ్వనాథం నెత్తిన పిడుగు పడ్డట్టయింది.

"చెప్పండి నాన్నా. నా పెళ్ళి గురించి మీకెలాంటి తొందర లేదుగా...."

"ఏమిటమ్మా, నీకు పెళ్ళి చేయాలన్న విషయం నాకు తెలియదూ—"

"తెలియదు నాన్నా - నిజంగా తెలియదు. తెలిస్తే—" లలితమ్మ ఏదో అనబోయింది. ఇంతలో జారిపోతున్న సిగపిన్నులు సరిచేసుకుంటూ ఇందిరమ్మ లోపలకొచ్చింది.

"దీనికేదో పిచ్చిపుట్టింది - ఇందాక నన్నూ యిలాగే అడిగింది. రెండు తిట్టి నోరు మూయించాను-" దీర్ఘాలు తీస్తూ మాట్లాడుతుంటే లలితమ్మ నవ్వుతుంటే అనుకోని ఈ సంఘటనకి విశ్వనాథం ముఖం వెలవెల బోయింది.

"నీకు పెళ్ళిచేయనని ఎందుకనుకుంటున్నావు? ఏ తల్లిదండ్రులైనా ఆడపిల్లకి పెళ్ళి చేయకుండా ఊరుకుంటారా?" విశ్వనాథం నెమ్మదిగా అంటున్నాడు. "నీ మనసులో యెవరైనా వుంటే - అదే, ప్రేమించి పెళ్ళి చేసుకుందా మనుకుంటుంటే-" విశ్వనాథం నసిగాడు.

"ఆ....అంత తెలివి కూడా వుందా" ఇందిరమ్మ మూతి విరిచింది. వంటింట్లో కెళ్ళిపోయింది.

"అది తెలివే అయితే ఎప్పుడో ఎవర్నో పెళ్ళి చేసుకొనేదాన్నేమొ -కానీ" లలిత మాట్లాడలేదు.

"అమ్మా!" లలిత ఓ కేక వేసింది.

"నీకు ఎన్నేళ్ళప్పుడు పెళ్ళయింది?"

"ఏమొ—"

"కాదు, చెప్పాలి-"

"పన్నెండో ఏట. పన్నెండెక్కడ - పదకొండునిండి వారం రోజు లైందంతే."

"ఊఁ-" లలిత నవ్వింది.

"అప్పటికే నాయనమ్మగోల - పెళ్ళి ఆలస్యమయిందని-" ఇందిరమ్మకి పెళ్ళి ముచ్చట వచ్చేసరికి ఎన్నో విశేషాలు గుర్తుకొచ్చాయి. తను కాపరానికొచ్చిన కొత్తరోజులు, తొలి చూలుకు చేసిన సూడిదల పేరంటం, పిల్ల పుట్టినప్పుడు పేరు పెట్టడం విషయంలో జరిగిన రభస ఎన్నో విశేషాలు ఇందిరమ్మ చెప్తుంటే లలిత వింటూంది.

"అమ్మా!" గర్జించింది లలిత ఒక్కసారి.

ఉలిక్కిపడింది ఇందిరమ్మ.

"ఇప్పుడు నా కెన్నేళ్ళు?"

"ఏమొ-"

"నేనే చెప్తా, ఇరవై తొమ్మిది నిండి ముప్పై ఏళ్ళు వచ్చాయి-"

"ఆ - ఏళ్ళకేం బాగానే వస్తాయి-" ఇందిరమ్మ వెక్కిరింపుగా అంది.

"ఈ వయసుకి నీకు ఐదుగురు పిల్లలు-" లలిత మాట పూ
చేయలేదు.

"ఐతే ఏమంటావు?" ఐదుగురు పిల్లలని లలిత అనేసరికి ఇందిరమ్మ
ముఖం ఎర్రబడింది. చటుక్కున అక్కడనుంచి వెళ్ళిపోయింది.

"అంటే నీకు ఎంత చిన్నతనంలో నీది అనే ఓ యిల్లు, నీవాడ
అనే ఒక మగవాడు, నీది అనే సంతానం! విన్నావా అమ్మా, ఎన్నెన్నో
మరి నాకో?- ఒక్కటయినావుందా? " లలితగొంతు దుఃఖంతో నిండింది
విశ్వనాథం కుర్చీలోంచి లేచి కిటికీ దగ్గర నిలబడి ఆకాశాన్ని
చూస్తున్నాడు.

"ఇటు తిరగండి నాన్నా....నాకు సమాధానం చెప్పరేం?- మీరంత
స్వార్థపరులు నాన్నా! మీ గురించే ఆలోచిస్తారు. కానీ నేనూ ఓ ఇల్లాల
కావాలి. నా గుండెల్లో దాచుకుందుకు నాది అనే సంతానం కావాలి
నాన్నా....నన్ను ప్రేమించి నాకోసమే బతుకుతున్నాననే ఒక వ్యక్తి
కావాలి! నేనూ ఓ యిల్లాలు కావాలి-"........లలిత కళ్ళు గట్టిగా మూసు
కుంది.

కాళ్ళ దగ్గరున్న బల్లను ఒక్క తన్ను తన్నింది. చిన్న బల్ల
మీదున్న గాజు గ్లాసు కిందపడి పగిలిపోయింది. లలిత గబగబా కుర్చీ
లోంచి లేచింది. ఎంత చీకటి పడిపోయింది....అప్పటికి లలిత 4 గంటల
పైనుంచి ఆ కుర్చీలో కూచునేవుంది - తను తలితండ్రులతో ఎలాగ పెళ్ళి
విషయం మాట్లాడుతుందో, తల్లిదండ్రులు తనకి ఎలాటి సమాధానం
యిస్తారో - అంతా ఊహించుకున్న సంభాషణా ప్రపంచంలోంచి బయట
పడేసరికి రాత్రి ఎనిమిది గంటలయిందని గుర్తించిన లలిత నీరసంగా
నిట్టూర్చింది........ఎదురుపడి తను ఏమీ చెప్పలేనప్పుడు ఎంతగా మన
సులో మథనపడితే ఏంలాభం?

రాత్రంతా నిద్రపట్టని లలిత అటు ఇటు ఒత్తిగిల్లుతూ కాలం గడిపింది. తెల్లవారినా లలిత మనసు చీకట్లోనే కొట్టుమిట్టాడుతోంది. తన సమస్య తనే తీర్చుకోవాలి. పేపర్లోవేసి మ్యాట్రిమోనియల్స్ ఎందుకు తను చూడకూడదు - అవును, ఎందుకు అప్లైచేయకూడదూ7

*　　　*　　　*

రోజులు గడుస్తున్నాయి. ఆ రోజు లలిత గబగబా వంటింట్లోకి రాబోయింది. గుమ్మంలో పేపరు చదువుకుంటున్న తండ్రి, కూర తరుగుతూ కబుర్లు చెప్తున్న తల్లి - లలిత రెండడుగులు వెనక్కి వేసింది - ఏమిటది నేనేదో కొత్తచోటుకి వచ్చినట్టు అనుకుంటున్నానేమిటి - లలిత మళ్లా గబగబా ముందుకొచ్చింది. తండ్రి ప్రక్కన కుర్చీవేసుకు కూర్చుంది.

లలిత ఎందుకొచ్చిందో తెలుసు విశ్వనాధానికి.

"తొందరపడరాదు తల్లీ-దేనికైనా టైము రావాలి-మంచిసంబంధం చూసి-" విశ్వనాథం మాట్లాడిన తక్కిన మాటలు లలితకి వినిపించలేదు. వినాల్సింది కూడా ఏమీలేదు. ఈ మాటలే గత పదేళ్ళుగా తండ్రి నుంచి వింటోంది.

"సరే నాన్నా....ఆఁ....రిప్లై వచ్చిందా?"

రిప్లయ్యా - ఎక్కణ్ణుంచి....ఆఁ ఇంకా రాలేదమ్మా!" విశ్వనాథం తడబడ్డాడు.

"ఇంకా రాలేదా - అదేమిటి?" అంది లలిత.

వెంటనే ఇందిరమ్మ "చాల్లెద్దురూ - ఊరికే అదేదో పిచ్చిగా మాట్లాడితే, మనమూ మాట్లాడుతామా? ఇదిగో అంతా ఒత్తిది - మీ నాన్నఎవరికీ, అదే ఏ పేపరుకిరాయనేలేదు - ఇంక రిప్లై ఏమిటి"-పకపకా నవ్వింది.

"నిజంగానా నాన్నా?" నివ్వెరపోయింది లలిత. తండ్రి మాట్లాడ లేదు. లలిత విసురుగా లేచి వెళ్ళిపోయింది.

* * *

లలిత గదిలో మంచంపైన పడుకుందన్నమాటేగాని, గతమే కళ్ల ముందు కదలాడుతుంటే కన్నుమూత పడనేలేదు.

లలిత పదిహేనేళ్ళ వయస్సప్పుడు రాజును పెళ్ళిచేసుకుందామను కుంది. రాజుబావ కూడా తప్పకుండా తననే పెళ్ళి చేసుకుంటానన్నాడు. కానీ అత్తయ్య తనతోనే అంది- "మీ నాన్న అడక్కుండా నేనేంచేస్తాను. నా కొడుక్కి పెళ్ళి కాదా?" అని.

అక్కడక్కడ ఆ మాట విన్న నాన్న "అదెందుకు నా కూతుర్ని తన కొడుక్కి చేసుకుంటా ననదూ - నేనే దానివెంటపడి అడగాలా-ఎంత ఆడపిల్ల తండ్రినయితేమాత్రం - వాడు కాకపోతే నాకు అల్లుడే దొరకడా-" ఈ మాటలన్నీ విన్న లలిత "అదికాదు నాన్నా - నాకు బావంటే ఇష్టమే- బావకి నేనంటే ఇష్టమే - నువ్వు ఒక్కసారి అత్తయ్యని అడుగకూడదూ" అని చెప్పాలనుకొని తండ్రి వున్న గది గుమ్మందాకా వచ్చింది కానీ, నాన్నంటే భయం. తనే తన పెళ్ళి విషయం మాట్లాడటం ఎంతో తప్పు. అంతే. లలిత నోరు మెదపలేకపోయింది - ఆ తర్వాత బావ పెళ్ళయి పోయింది. చక్కని పిల్లలు, సంసారం!—తనో?

ఇంటరు పాసయి, టైపు నేర్చుకుని స్కూల్లో టైపిస్టుగా చేరిన లలితకి బాబాయి ఓ సంబంధం తెచ్చాడు. అప్పటికి ఎన్నేళ్ళు తనకి - ఏమో - ఆఁ పద్దెనిమిది - లలిత ఆవులించింది. ఆ రోజు తండ్రి, బాబా యిల సంభాషణ ఇప్పటికి చెవులలో మారుమ్రోగుతోంది.

"బుద్ధిమంతుడు. ఎలక్ట్రిసిటీబోర్డులో గుమాస్తా. వాళ్ళకి కట్నకాను కలకన్నా పిల్ల చక్కగా వుండాలట. పనిమంతురాలు కావాలట" బాబాయి.

మాటలు పూర్తి కాకుండానే కుటుంబ వివరాలు అడిగాడు విశ్వనాథం.. నలుగురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు అంతే. విశ్వనాథం అంగీక రించలేదు.

"నలుగురు ఆడపిల్లలా........అంటే అతడి సంపాదనంతా వాళ్ళకే పెట్టాలా - తండ్రి కూడా లేడంటున్నావు - ఆ పిల్లలందరికి చాకిరిచేస్తూ అది పడుండాలా? వీల్లేదు. ఇలాటి సంబంధాలు చెప్పకు" బాబాయి చిన్న బుచ్చుకు వెళ్ళిపోయాడు. బయటకెళ్ళిపోతున్న బాబాయి దగ్గరకి పరిగెత్తి వెళ్ళింది లలిత. బాబాయి అప్పటికే వీధిగుమ్మం దాటాడు. దొడ్లో పచార్లు చేస్తున్న తండ్రి దగ్గరకెళ్ళి నిలబడింది చాలా సేపు.

"నాన్నా, నాకీ సంబంధం యిష్టమే. పెద్ద కుటుంబం అయితేనే మంచిది. కష్టసుఖాలకి ఆదుకుంటారు. అయినా అలా అంటే ఎలా నాన్నా! మన కుటుంబంలో అన్నయ్యకి పెళ్ళికాలేదు. బాధ్యతలంటే నాకు భయం లేదు. నాకు పెళ్ళి ఇష్టమే" లలిత దొడ్లో గన్నేరుచెట్టుదగ్గర నిలబడింది. తండ్రితో ఈ మాట చెప్పాలని ఎన్నోసార్లు నోట్లో మననం చేసుకుంది. కాని ధైర్యం చాలలేదు. ఇలా మాట్లాడితే నాన్న ఏమనుకుంటాడు? ఛ, ఓ ఆడపిల్ల ఇలా మాట్లాడకూడదు! లలిత లోపలకొచ్చేసింది తండ్రితో మాట్లాడకుండానే.

కాలం గడుస్తోంది. లలిత ఉద్యోగంలో స్థిరపడిపోయింది. అక్క పురిటికొచ్చి పసిపిల్ల నెత్తుకువెళ్ళింది. అన్నయ్య, ఒదిన పిల్లాడికి అక్షరా భ్యాసం చేయించడానికొచ్చారు. ఇల్లంతా కలకల్లాడుతోంది. చెల్లెళ్ళు, తమ్ముడు కాలేజీలకి సెలవులని ఇంట్లోనే ఉన్నారు. ఆ రోజు అన్నయ్య, నాన్న ఘర్షణపడుతున్నారు. ఇంకేముంది తన విషయమే- "రెండో పెళ్ళి వాడంటే, వాడేమీ ముసలాడు కాడు పిల్లల్లేరు. ఏమిటి మీ అభ్యంతరం? ఇలా ఎన్ని సంబంధాలు మీరు తిప్పేస్తుంటారు - దాన్నడుగుతాను ఏమం టుందో. దాని అభిప్రాయం ముఖ్యం."

విశ్వనాధం గొంతు చించుకుంటున్నాడు - "అది ఒప్పుకున్నా నేను ఒప్పుకోను. అయినా దానికన్నా పెద్దవాళ్ళు పెళ్ళికాకుండా లేరూ? స్నేహితుడు కదా అని పెళ్ళి చేసుకోమంటున్నావా—వీల్లేదు. దానికి పెద్ద ఆఫీసర్ని చూసి చేస్తాను." అన్నయ్య విసుక్కుంటూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు. రెండు రోజుల తర్వాత అన్నయ్య, ఒదిన పిల్లలు ఊరెళ్ళిపోయారు.

లలిత మనసు చాలా చికాకుగా వుంది. రాత్రి అంతా ఆలోచించి అన్నయ్యకి ఉత్తరం రాసింది. ''అన్నయ్యా! ఈ సంబంధం నాకు ఇష్టమే. రెండో పెళ్ళివాడనే అభ్యంతరం నాకు లేదు. కాకపోతే నాన్న ఒప్పుకోడు. నువ్వు ఒక్కపని చెయ్యాలి. నీ స్నేహితుణ్ణి రిజిష్టరు పెళ్ళికి ఒప్పించు. ఈ విషయం నాన్నకి తెలియకుండా, నేను మీ ఊరు వస్తాను. పెళ్ళి జరిపించేయి. ఈ ఉద్యోగం చేసుకుంటూ ఇలా ఎంతకాలం బతకాలో చెప్పు. నాది అన్నది నాకు లేకపోయాక వీటన్నిటికి ఏం రాణింపో చెప్పు? నాకూ ఓ యిల్లు కావాలి, నేనూ ఓ యిల్లాలు కావాలి. ఒరేయ్ అన్నయ్యా! ఇలా సిగ్గువిడిచి రాస్తున్నందుకు నన్ను అర్థం చేసుకుంటావు కదూ?'' లలిత ఆ ఉత్తరాన్ని ఎన్నోసార్లు చదువుకుంది. కవరు మడిచి పెట్టింది. ఎడ్రసు రాసింది. క్షణంలో లలిత ముఖం నిండా చెమటలు, ఒళ్ళంతా చెమటలు. ఏదో నీరసం, నిస్పృహ. తనకేనా ఇంత ధైర్యం - నాన్నకి విషయం తెలిస్తే? హమ్మో! తనేదో పెళ్ళికోసం ఉబలాట పడిపోతోందనుకుంటాడు. ఒదిన నవ్వితే-ఏమో. లలిత ఉత్తరాన్ని చింపి గబగబా కిటికీలోంచి బయటకి విసిరేసింది. అబ్బ. ఇలా ఎన్నెన్ని. ఇప్పుడు తనకి ముప్పై. ఇంకా తను నాన్నకి అమ్మకి భయపడాల్సిన అవసరం వుందా! భయంతో తను జీవితంలో ఇప్పటికి ఎన్నో పోగొట్టుకుంది.

లలిత మనసులో మెరుపులాటి ఆలోచన ఒకటి ప్రవేశించింది.

తను చేస్తున్న ఉద్యోగమే తల్లిదండ్రులు తన వివాహాన్ని నిర్లక్ష్యం చేయడానికి కారణం. తన సంపాదనపై తండ్రికి; తన సంపాదనపైన, తన చాకిరీపైన తల్లికి ఎంతో ఆశవుంది."మా అమ్మాయి మాకు అబ్బాయి లాగే వుంది" అంటారు అమ్మ, నాన్న అందరితో, తనే ఇంటి బాధ్యతంతా చూస్తుంది. తను పెళ్ళిచేసుకు వెళ్ళిపోతే? అందుకే తన పెళ్ళిని గురించి వాళ్ళేమీ ఆలోచించటంలేదు. ఇంక వాళ్ల తనకి పెళ్లి చేయరు. లోకమంతా లలితకి పెళ్ళి కాలేదు పాపం, అని "ఇంకేం అవుతుంది" అని అనుకుంటు న్నారు. అందరకి చెప్పాలి లలితకీ పెళ్ళవుతుంది, లలితా ఓ ఇల్లాలవు తుంది, తల్లి అవుతుంది అని అలా చెప్పాలి. లలిత కళ్లనిండా నీళ్ళు.

గుండె నిండా బరువు.

ఆడపిల్లకి పెళ్ళే అవసరమా?

"ఆ" ఒక్కటే సమాధానం-అక్కర్లేదు అనుకొనే వాళ్ల విషయం వేరు. పెళ్లి కావాలనుకునే లలితమ్మ విషయం వేరు.

"ఓ లలితమ్మా, నీకు ఇంకా ధైర్యం కావాలి. నీ విషయాలు నువ్వే నిర్ణయించుకునే శక్తి కావాలి. నీ మంచి భవిష్యత్తు నువ్వే చూసు కోవాలి. నీకెవరూ చూడరు. గతించినవన్నీ చాలు! వయసు, అందం, ఓర్పు, ఆరోగ్యం అన్నీ చాలావరకు తగ్గిపోయినా చివరవరకూ మిగులు తున్న ఆశ ఒకటి. దాన్ని తుంచకు-" లలితమ్మని అంతరాత్మ ప్రబోధిం చింది - మేలుకొలిపింది.

* * *

ఆ తెల్లవారి లలితమ్మ ధైర్యంగా అనుకున్న మాట్రిమోనియల్స్‌లో ఒక దానికి అప్లై చేసింది.

వారం రోజులు దాటకుండా లలితమ్మకి జవాబు వచ్చింది. ఉత్తరం పూర్తిగా చదివింది ఇప్పుడూ ఒక నిర్ణయం తీసుకోలేకపోతే ఏమవుతుందో, భవిష్యత్తు భయంకరంగా కళ్ల ముందు నిలిచింది.

ఉత్తరం మళ్లా చదివింది లలితమ్మ క్షణం మనసు కొట్టుమిట్టాడింది. నాన్నతో చెబితే - ఇంకా తను ఇలాగే వుండిపోవల్సివస్తుంది-

అయినా ఎందుకు చెప్పాలి?

ఇది నా విషయం!

లలితమ్మ సమాధానం రాసింది తన అంగీకారాన్ని తెల్పుతూ!

తను రాసిన ఉత్తరం పోస్టుడబ్బాలో పడేసి వస్తున్న లలితమ్మ కాళ్లు వణికాయి. గుండె దడ దడ లాడింది. గబగబా లోపలికొచ్చి గదిలోకెళ్లి తలుపులేసుకుంది. లలితమ్మ తనకు వచ్చిన ఉత్తరాన్ని విప్పి మళ్లా చదవటం మొదలుపెట్టింది:

"నాకు ఇద్దరబ్బాయిలు, ఒక అమ్మాయి. అమ్మాయి ఆఖరిది పదేళ్ళు - నా వయస్సు నలభైఆరు - నా భార్య ఏడాది క్రితం కేన్సరుతో మరణించింది. అయితే నేనెందుకు ఇప్పుడు పెళ్లి చేసుకోవాలనుకుంటున్నానో అర్థమయిందనుకుంటాను. నా యింటిని, నా పిల్లల్ని, నన్ను చూసుకునేందుకు ఓ ఇల్లాలు కావాలి! ఇల్లాలు మాత్రమే అయితే అనుబంధంతో ఆప్యాయతలు పెంచుకోవచ్చనే ఆశ ఒకటుంది. చాలా ముఖ్యమయిన, మీ జీవితానికి సంబంధించిన విషయం, నేను వాసక్టమీ చేయించుకున్నాను.... దీనికి మీ అభ్యంతరం లేకపోతే మీ అంగీకారం తెలియ జేయండి".

ఉత్తరం పక్కమీద పడేసి దీర్ఘంగా నిట్టూర్చింది లలిత.

అవును నాకూ ఒక మగవాడి అండదండలు కావాలి. నాది అనే ఓ యిల్లు కావాలి-కాకపోతే ఇక్కడ వీళ్లకి చాకిరీ చేస్తున్నాను. అక్కడి వాళ్లకి చేస్తాను. ప్రతి ఆడది కోరుకునే మాతృత్వాన్ని గురించి తను ఆలోచించేందుకు కూడా అవకాశంలేదు ఇక. సరే, తను గొడ్రాలు

లలితమ్మ పెదాలపై చిన్న నవ్వు, కదిలింది.

అతనికి ఓ ఇల్లాలు కావాలి!

తనూ ఓ ఇల్లాలు కావాలి- అంతే!!

*　　　*　　　*

మాధవరావు పిల్లలు ముగ్గురిలోనూ లలితమ్మను అసలు పట్టించుకోని, గుర్తించని వాడు పెద్దబ్బాయి రవి. అన్నం పెడుతూ, టీ యిస్తూ ఏదో పల్కరించాలని, చనువు చేసుకోవాలని ఎంతో ప్రయత్నం చేసింది లలితమ్మ. "మీ అమ్మని కాకపోయినా అమ్మలాటిదాన్నే" అందామనుకుంది. కాని రవి ఏ మాటకి అవకాశం యివ్వకుండా భోజనం చేసి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం రవి స్నేహితుడు వచ్చాడు. ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. ఇద్దరికీ టీ తెచ్చి యిస్తున్న లలితమ్మకి వాళ్ళ మాటలు బాగానే వినిపిస్తున్నాయి.

"మీ కొత్త అమ్మ ఈవిడేనా" అన్నాడు స్నేహితుడు.

"వాట్ నాన్సెన్స్ - షి ఈజ్ మై ఫాదర్స్ వైఫ్ - దట్సాల్" రవి సమాధానం.

మాటలు చెవినిబడ్డ లలితమ్మ ముఖం క్షణంలో పాలిపోయింది. వెంటనే తేరుకుంది. ఆలస్యంగా చేసుకొనే నిర్ణయాలలో ఇలాంటివి తప్పవు. రవి మాటల్లో ఎంత నిజం వుంది! నిజం ఎంత చేదుగా వున్నా నిజం నిజమే- కిటికీ దగ్గర నిలబడి శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది ఇల్లాలు లలితమ్మ.

*

# పులిగోరు పతకం

"ఇలారా"- నెమ్మదిగా పిలిచింది రాధికని రాజ్యలక్ష్మమ్మగారు. 'వెళ్ళు'- గుమ్మం దగ్గరే నిలబడ్డ రామం నవ్వుతూ అన్నాడు.

వేలికున్న మట్టెలు ఇంకా అలవాటు పడలేదు. నడుస్తుంటే కొత్తగా అనిపిస్తోంది రాధికకి. మెడలో వున్న చంద్రహారంతో కలిసిపోయిన పసుపుతాడు సరిచేసుకుంటూ గుమ్మం దగ్గరే నిలబడింది కొత్త పెళ్ళి కూతురు రాధిక.

"పద, నేనూ వస్తా" రాధిక భుజం మీద చేయి వేసి గదిలో కొచ్చాడు రామం.

రాజ్యలక్ష్మమ్మకి డెభ్భై ఏళ్ళు నిండాయి. రెండు రోజుల నుంచి ఆవిడకి కాస్త జ్వరంగా వుంది. అమ్మమ్మ వంకే చూస్తున్నాడు రామం కన్నార్పకుండా.

చదువుకునే రోజుల్లో సెలవులు ఇవ్వటంతోనే అమ్మమ్మ ఊరు వెళ్ళేవాడు రామం. పెద్దమ్మ పిల్లలు, మామయ్య పిల్లలు అంతా సెలవులకి అక్కడే చేరేవారు. పిల్లలందరూ తినడానికి అరిసెలు, జంతికలు చేసి డబ్బాల నిండా నింపేది అమ్మమ్మ. ఎవరూ తీసుకు తినడానికి వీల్లేదు. అమ్మమ్మే పెట్టాలి. కానీ తనంటే మాత్రం అమ్మమ్మకి ప్రత్యేకమైన ఇష్టం. ఎవరూ చూడకుండా రహస్యంగా పిలిచి జంతికలు ఇచ్చి, ఎవరికీ చెప్పకు అనేది. అది ఎంతో గొప్పగా అనిపించిందానాడు. ఇప్పుడు తల్చుకుంటే నవ్వొస్తోంది. రామం అమ్మమ్మ వంక అలానే చూస్తున్నాడు. పాపం, ఎంతో పెద్దదయిపోయింది. జుట్టు ముగ్గుబుట్టలా అయిపోయింది.

అమ్మమ్మకి తనంటే ఎంతో ఇష్టంకదా- మరి తనేం చేసాడు అమ్మమ్మకి? అమ్మమ్మ దగ్గర కూచుని ఎక్కువసేపు కబుర్లు చెప్పాలంటే తను బోరింగ్ అనుకుంటున్నాడు - అమ్మమ్మ వంకే చూస్తున్నాడు రామం. పక్కనే రాధిక నిలబడి వుంది.

"వంగి నమస్కారం పెట్టు మా అమ్మమ్మ పాదాలకి" ఆజ్ఞాపిస్తున్నట్లుగా అన్నాడు రామం.

"అదే- సాష్టాంగ దండ ప్రయాణమా" రాధిక చిలిపిగా నవ్వుతూ అంది.

"ప్రణామం, ప్రయాణం కాదు"

"ఒకే"- రాధిక అమ్మమ్మ పాదాలకి నమస్కారం పెట్టింది.

'తలుపు దగ్గరగా వేయి' అమ్మమ్మ నెమ్మదిగా అంది.

"ఆ మంచం కింద పెట్టి బయటికి లాగు-'

రామం మంచం కిందకి దూరాడు. ఆ పెట్టి మంచం కింద లోపలగా వుంది. ఆ మంచం కింద నుంచి పెట్టి తీస్తుంటే, రాధిక నవ్వు ఆగలేదు.

"యాంటిక్"- నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుంది.

"మా అమ్మమ్మకి ఇంగ్లిషు వచ్చు, నెమ్మదిగా మాట్లాడు"- పెట్టి ముందుకు జరుపుతూ రామం అన్నాడు.

"అవును, ఈ పాతకాలపు పెట్టిని చూస్తే అమ్మాయికి నవ్వు వస్తుంది మరి- నాలాగే అదీ యాంటిక్"- పాతది కదూ అమ్మమ్మ మంచం మీది నుంచి లేచి కిందకూచుంది.

అమ్మమ్మ మెడలో ఆరు వరసల చంద్రహారం మెరుస్తోంది. చంద్రహారానికి ఓ చిన్న పిన్నుతో తాళంచెవి కదులుతోంది. కళ్ళజోడు సరిచేసుకుంటూ తాళం తీసే ప్రయత్నం చేస్తోంది అమ్మమ్మ.

"నేను తియ్యనా-" రాధిక అంది.

"ఎందుకూ- నేను తియ్యగలను"- కళ్ళజోడు మరోసారి సరిచేసు కుంది అమ్మమ్మ.

పెట్టి తాళం వచ్చింది. దాంట్లో ఓ చిన్న గుడ్డసంచి బట్టల మధ్య దాచింది. పైకి తీసింది. ఆ సంచికి వేసిన ముళ్ళు విప్పుతుంటే రాధిక రామం వంక నవ్వుతూ చూసింది. చూపులతోనే హెచ్చరిక చేసాడు నవ్వొద్దని.

"ఈ మధ్య పెట్టి తీయటం లేదుగా. ఇందులోవన్నీ అలానే పడు న్నాయి....ఇలారా...."

రామం అమ్మమ్మ దగ్గరగా జరిగాడు.

"నీకోసం దాచిన జంతికలు వస్తాయి చూడు ఇప్పుడు బయటకి"

రామం చెవిలో రహస్యంగా అంది వచ్చే నవ్వు అపుకుంటూ రాధిక.

"దగ్గరగా రా- ఇది నీ మెళ్ళో పెట్టుకో" పులిగోరు పతకంతో వున్న బంగారు గొలుసు!! రాధిక కళ్ళప్పగించి చూస్తోంది.

"దీన్ని నువ్వే మెళ్ళోవేసుకో-ఆ పెద్దాడికి ఇవ్వనన్నానని వాడికి నా మీద కోపం- వస్తే రానీ, నాకేం? ఆ జుట్టు కత్తిరించుకున్న పిల్ల, అదే వాడి భార్యకిది నచ్చుతుందా- అందుకే నీ కోసమే ఇది దాచాను" అమ్మమ్మ అంటుంటే రాధిక తన పొడుగాటి జడను ముందుకు వేసుకుంది.

పెళ్ళి కూతురుగా పదహారు రోజుల పండుగ వరకైనా చేతుల నిండా గాజులు వుంచుకోమని, నుదుట చక్కటి కుంకుమ బొట్టు పెట్టు

కోమని, స్టిక్కరు బొట్టు పెట్టుకోవద్దని, జడకుచ్చులతో పొడుగ్గా జడవేసు కోమని, నైటీలు వేసుకు పగలంతా తిరక్కుండా లక్షణంగా చీర కట్టుకో మని, బయట కెళ్ళేప్పుడు పాంటు చొక్కా వేసుకోవద్దని తనకి తల్లి మరీ మరీ చెప్పటం గుర్తుంచుకుంది రాధిక. అయితే పదహారురోజుల పండగ ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తోంది. అది అయిపోతే తను ఉద్యోగంలో చేరిపోవచ్చు. ఇంట్లో వున్నప్పుడల్లా నైటీతోనే తిరగచ్చు. జుట్టు చక్కగా బ్యూటీ పార్లర్‌లో సెట్ చేయించుకుని, భుజాల వరకు వేలాడేసుకోవచ్చు, హాయిగా పెదాలకి రంగు వేసుకోవచ్చు, టి.వి.యస్. మీద ఎక్కడికైనా వెళ్ళచ్చు. అందుకే రాధిక జడకుచ్చులు సరిచేసు కుంటూ అమ్మమ్మ వంక చూసింది.

''అమ్మాయ్''-

"చెప్పండి అమ్మమ్మగారూ" - అమ్మమ్మ గారి పాదాల దగ్గర కూచుంది రాధిక.

"ఇది ఇప్పుడెంతో ఖరీదు, వీడి కోసం జాగ్రత్తగా దాచి పెట్టాను. దీన్ని లాకర్లలో పెట్టి దాచుకోకుండా హాయిగా మెళ్ళో వేసుకోనియ్యి."

"ఒరేయ్- ఆ పెద్దాడికి అప్పుడే చెప్పకు"

"సరే, సరే" రామం చేతిలో గొలుసు కదులుతోంది. ఆ గొలుసు కున్న పులిగోరు వంకే చూస్తోంది రాధిక.

''ఇవి నిజంగా పులిగోర్లేనా'' పరీక్షగా చూస్తూ అంది.

"అవును. మా తాతయ్య వేటకెళ్ళి పులిని చంపి, వాటి గోళ్ళు తెచ్చాడు. మా అమ్మమ్మ ఇలా పతకంలో వాటిని అమర్చి నా కోసం దాచి వుంచింది - సరేనా"-

''నిజం పులి'' - ఆశ్చర్యంగా రాధిక అంటుంటే రామానికి అమ్మమ్మకి కూడా నవ్వొచ్చింది.

"అదేమిటే అమ్మా - అంత చదువుకున్నావే - ఆ మాత్రం తె యదూ - తాతగారేమిటి - వేటకెళ్ళటమేమిటి - ఆ రోజుల్లో కోయవాళ తెచ్చి అమ్మేవాళ్ళు. చిన్నప్పుడు పిల్లలందరికీ మెళ్ళో వేసేవాళ్ళం గొలుస చేయించి అమ్మాయ్. వీడికి చిన్నప్పుడు కాళ్ళకి గజ్జెలు, చేతులకి మురు గులు, మొలలో బంగారు మామిడి పిందెలు-"

-రాధిక నవ్వు ఆపుకోలేక పైకే నవ్వేసింది.

''ఏమిటలా నవ్వుతావు ఆ ఫోటో నాదగ్గరే వుంది.'' రామాని ఒక్కసారి భయమేసిపోయింది. ఇప్పుడా పెట్టిలోంచి ఫోటో బయటి తీస్తుందేమో అమ్మమ్మ అని.

''అది అన్నింటికీ అలాగే నవ్వుతుందిలే- అయినా అమ్మమ్మా బంగారాన్ని, వెండివీ చిన్నప్పట్నుంచీ వేసుకోటానికి ఎంతో పెట్టి పుట్ట లిలే- దీనికేం తెలుసు- చేతులకి ప్లాస్టిక్ గాజులు, మెళ్ళో పూసల గొలుస లూనూ''- వెక్కిరింపుగా అంటూ రాధిక వంక చూసాడు.

''పోన్లే వాడి మాటలకేం కానీ, ఇది వాడు మెళ్ళో వేసుకొనేల చూసే బాధ్యత నీకప్పగిస్తున్నా"

రామం మెడలో పులిగోరు పతకం గొలుసు మెరిసింది. ఇద్దరూ అమ్మమ్మ పాదాలకి నమస్కరించారు. అమ్మమ్మ పెట్టికి తాళం వేసి, మంచం కిందికి తోసేసింది.

*   *   *

అప్పటి నుంచీ మొదలయింది రాధికకి భయం - ఈ పులిగోరు పతకంతో గొలుసు నిజంగానే డాక్టరు రామం మెళ్ళో వేసుకుని హాస్పి టల్‌కి వెడతాడేమోనని.

''మీ అమ్మమ్మ మరీనూ- ఆ పులిగోళ్ళు, సింహపు గోళ్ళు ఏమిటీ ఆవిడ మెడలో వున్న చంద్రహారం మీకిస్తే ఎంత బావుండేదో- నేను ఏ

పండగనాడో పెళ్ళినాడో చక్కగా వేసుకునేదాన్ని-" కాఫీ బల్లమీద పెడుతూ రామం వంక చూసింది.

లోపల బనీనులో వున్న గొలుసు పైకి తీసుకున్నాడు రామం.

''ఇది మా అమ్మమ్మ నాకిచ్చింది-నేను వేసుకుంటాను హాయిగా''

''రేపు డ్యూటీకి వెడతాను ఇది మెళ్ళో వేసుకుని''-

''నిజంగా వెడతారా''

''ఆ''-

ఖచ్చితంగా''-

''అనవసరమైన విషయాలు కల్పించుకోకు. మా అమ్మమ్మకి నామీద ఎంత ప్రేమ లేకపోతే దాచి దాచి నాకిస్తుందో చెప్పు-

''నా మాట వినండి- ఇది మెళ్ళో వేసుకుని హాస్పటల్‌కి వెడితే అందరూ నవ్వుతారండి- దీన్ని చెరిపించి, సన్నగా, నాజూగ్గా ధగ ధగ మెరిసే గొలుసు చేయిస్తాను.... అది మీ మెళ్ళో ఎంతో బావుంటుంది. తెల్లగా వుండే మీ మెడలో ఈ బంగారపు సన్నని గొలుసు ఎంత అందాన్నిస్తుందో!" రాధిక రామం మెడలో వున్న పులిగోరు పతకాన్ని అటు ఇటు తిప్పిచూస్తూ అంది.

''అమ్మమ్మ ఇచ్చిన గొలుసు- నాకు కొన్ని సెంటిమెంట్లున్నాయి. వాట్ ఎ గ్రేట్ లేడీ షీ ఈజ్!" ఆ గొలుసుని కళ్ళకద్దుకున్నాడు రామం.

రాధికకి కోపంతో బుగ్గలెర్రబడ్డాయి. డైనింగ్ టేబుల్ మీద వున్న పత్రిక తిరగేసింది కాసేపు. రామం కొంటెగా ఆమెకేసి చూసి మరీ నవ్వుతున్నాడు.

''అలా నవ్వక్కర్లేదు- నాకూ వున్నాయి సెంటిమెంట్లు''

"ఉండనీ- మంచిదేగా" రామం రాధికకేసి చూసాడు రాధిక క్షణం మాట్లాడలేదు.

''సరే వినండి- మా నాయనమ్మ తీసికెళ్ళమంది- ఈ మాటు వచ్చి నపుడు తీసుకొస్తానన్నాను.''

భుజాల మీదుగా వేలాడుతున్న జుట్టును ముందు కేసుకుంది రాధిక.

''తెచ్చుకో''- రామం ఈలవేస్తూ, అద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటున్నాడు.

''అది ఎంత పెద్దదో తెలుసా''

''పెద్ద వస్తువయితే మరీ మంచిది- మనకే లాభం''

''మన రెండు బెడ్ రూములూ కలిపినా నడవటానికి చోటుండదు''

''పోనీ నడవద్దు'' రామం రాధిక బుగ్గమీద చిటికేసాడు.

''వినండి- ఇలా హాయిగా వచ్చిపడుకోటానికి వీల్లేదు. వింటున్నారా! ఎత్తయిన పీట వేసుకుని దానిమీదకి ఎక్కాలి- దాని చుట్టూ గిలకలు వుంటాయి. అటు ఇటు అద్దాలు అమర్చి వుంటాయి. దానికి పందిరి వుంటుంది. ఇంకా''

''ఊఁ సరే''- రామం కిటికీ వంక చూస్తున్నాడు.

''ఏమిటి సరే- అది పెద్ద పందిరి పట్టె మంచం-'' రాధిక గొంతు హెచ్చించింది.

''రాధీ. నీకు తీసుకురావాలనిపిస్తే తెచ్చుకో, అక్కర్లేదనుకుంటే మానేయ్''

''నేనే తెచ్చుకోవాలి దాన్ని- అక్కకి వద్దంది, ఇల్లు చిన్నదని. ఒదినకి అక్కర్లేదట, డబుల్ కాట్స్ అందమైనవి చేయించుకుంటుందిట. నేనే తెచ్చుకోవాలి.... పైగా మా నాయనమ్మది అది- నాకూ సెంటిమెంటు మరి''

అలాంటి పట్టెమంచం తాతగారింట్లో వుండటం రామానికి గుర్తొచ్చింది. ఒక్కసారి రామానికి రాధికపై కోపం కూడా వచ్చింది. తన మెడలో పులిగోరు పతకానికి, ఆ పందిరి మంచానికి ఏమిటి సంబంధం?

''ఈ రెంటికి సంబంధమేమిటి'' కోపంగా అరిచాడు రామం.

''రెండూ యాంటిక్స్ - అదే సంబంధం'' రాధిక ఎర్రటి రంగుతో మెరుస్తున్న పొడుగైన గోళ్ళవంక చూసుకుంటూ అంది.

''ఆ పులిగోర్లని చూస్తే భయమేస్తోంది బాబూ ఇటివ్వండి చెరిపించి సన్నని గొలుసు'' - రాధిక బతిమాలింది.

''నో - ఇది నాది అంతే'' రామం మెళ్ళో గొలుసు వంక మరొక్కసారి గర్వంగా చూసుకుంటూ పేపరు తిరగేయటం మొదలుపెట్టాడు - రాధికకి ఏంచేయాలో తోచక అలాగే రామంవంక చూస్తూ కూర్చుంది

* * *

వారం రోజులు గడిచాయి. పెళ్ళికోసం పెట్టిన సెలవు ఇద్దరిదీ రేపటితో అయిపోతుంది. రామం వంక చూసినపుడల్లా ఆ పతకం ధగధగ మెరుస్తూ రాధికకి కోపాన్ని తెప్పిస్తోంది.

ఆరోజు ఆదివారం. త్వరగా భోజనంచేసి ఇద్దరూ రామం స్నేహితుడింటికెళ్ళటం ఆ రోజు ప్రోగ్రాము.

కాలింగ్ బెల్ మ్యూజికల్‌గా మోగింది.

''ఓ - మర్చిపోయా - ఈ రోజు మా లలిత వస్తానంది'' రాధిక హడావిడిగా లేచి వెళ్ళి తలుపు తీసింది.

న్యూయార్కులో వుంటున్న లలిత హైదరాబాద్ వచ్చి వారం రోజులయింది. లలిత, రాధిక చిన్నప్పట్నుంచీ స్నేహితులు. స్నేహితు

రాళ్ళిద్దరూ ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. ఉన్నట్టుండి లలిత మెడవైపు చూస్తూ కన్నార్పకుండా వుండిపోయింది రాధిక.

ఏమిటే అలా చూస్తున్నావు - బాగా లావయి, మెడ నిండుగా -" లలిత ఏదో అనబోయింది.

"ఆదికాదు, నీ మెడలో" రాధిక అలానే చూస్తోంది.

"ఓ - ఇదా - ఇది ఇప్పుడక్కడ ఫేషన్ - అంతేకాదు, నా ఫ్రెండు ఇండియా వచ్చినప్పుడు నాకోసం కొనితెచ్చింది. దీన్ని చూసి ఇలాటిదే కావాలని నా ఫ్రెండ్సు ఎందరో అడిగారు. నేను వెళ్ళేప్పుడు కొనుక్కెళ్ళాలి....!"

లలిత మాటలేవీ వినిపించుకోటం లేదు రాధిక. మెళ్ళోనించి తీసి రాధిక చేతిలో పెట్టింది లలిత. పులిగోరు పతకం సన్నని గొలుసుకి లాకెట్టులా వేలాడుతోంది!

"ఇని నిజంగా పులిగోళ్ళా-" రాధిక ఆ గొలుసు చేతిలో అటు ఇటు తిప్పుతూ అంది.

లలిత గలగల నవ్వింది. "నిజంగా పులిగోళ్ళు ఎక్కడ దొరుకుతాయి ఇప్పుడు - పులిగోళ్ళే అయితే ఆ హారం ఎంత అందంగా వుంటుందో నేను ఊహించగలను - ఎక్కడున్నాయిప్పుడు అలాంటివి? ఇవి ప్లాస్టిక్‌వి - ఒసేయ్ రాధీ - నిజంగా పులిగోరు పతకం ఎక్కడైనా దొరుకుతుందంటే చెప్పు - ఎన్ని డాలర్సు ఇచ్చేనా ఇప్పుడే కొనుక్కుంటా - అబ్బ, ఎంత ఫాషనో తెలుసా!" లలిత మాటలకి కళ్ళు పెద్దవి చేసింది రాధిక.

"బాలకృష్ణుడి పటంలో చూసారట. అది కాలండర్ బొమ్మ. నా మెడలో వున్న దీన్ని చూసి ఇదే కావాలని పట్టుపట్టారు అక్కడ నా స్నేహితులు."

స్నేహితురాళ్ళిద్దరి మాటలు వింటున్న రామానికి నవ్వు ఆగలేదు.

''కృష్ణుడి ఫింఛం కూడా చూడలేదా మీ ఫ్రెండ్సు - లేకపోతే నెమలిఫించాలు తెమ్మనేవారే మిమ్మల్ని" - ముందు గదిలో నుంచే గట్టిగా అన్నాడు రామం.

లలిత, రాధిక కూడా పకపకా నవ్వుకున్నారు.

"ఫాషన్ ఎంత త్వరగా మారిపోతుందో చెప్పలేం."

"అక్కడెందుకు, ఇప్పుడిక్కడా పులిగోరు పతకం ఫాషనే" అంది లలిత.

ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పుకున్నాక లలిత వెళ్ళిపోయింది. రాధిక ఏదో ఆలోచిస్తూ సోఫాలో అలానే కూచుండిపోయింది. రామం చదువు తున్న పుస్తకం పక్కన పడేసి నిద్రలోకి జారుకున్నాడు.

* * *

తెల్లవారగానే లేచి ఇంట్లో పనులన్నీ పూర్తిచేసేసుకుంది రాధిక. రామం ఈ రోజు నుంచీ హాస్పిటల్‌కి వెళ్ళిపోవాలి ... రాధిక ఆఫీసుకి వెళ్ళిపోవాలి.

గాడ్రెజ్ తీసి హాఫ్ వాయిల్ జరీ చీర పైకి తీసింది రాధిక. రామం వైపు చూస్తూ ''ఇదే మాచింగ్" అనుకుంది మనసులో.

బూట్లు తొడుక్కుంటున్నాడు రామం. అద్దంలో మరొక్కసారి చూసుకుని జారే అంచులు సరిచేసుకుంది రాధిక.

''బయల్దేరుదామా'' - రామం పెన్ జేబులో పెట్టుకున్నాడు. రాధిక రామం దగ్గరకొచ్చి నిలబడి రామం మెడలో వున్న గొలుసు గబుక్కుని తీసుకుని తన మెడలో వేసుకుంది. గబగబా డ్రెస్సింగ్ టేబుల్ దగ్గరకెళ్ళి నిలబడి మెళ్ళో వేసుకున్న పులిగోరు పతకాన్ని సరిచేసుకుంటోంది.

"ఇది ఫాషన్ కదూ" రామం రాధిక వంక తిరిగాడు.

"అవును-అమ్మమ్మగారు బలే మంచిదిచ్చారు నాకు."

''నీక్కాదు-నాకు-''

''అదేలెండి - ఎవరికైతేనేం - మనిద్దరిలో తేడాలేమిటి? ఎంతో బావుంది!'' మెడలో వున్న పులిగోరు పతకం గొలుసు చూసుకు మురిసి పోతున్న రాధికను చూస్తూ నవ్వుకున్నాడు రామం.

*

# పరమార్థం

శాంతమ్మ మనసుని సమాధాన పరచుకోడానికి ప్రయత్నిస్తోంది. ఎంత ప్రయత్నించినా మనసుని వేధిస్తున్నదొక్కటే, జీవిత పరమార్థం ఇదికాదని.

శాంతమ్మ తులసి తోట గుమ్మంలో కూచుని పత్తి విప్పుతోంది. ఉయ్యాలలో పిల్లాడు గుక్కపెట్టి ఏడుస్తున్నాడు. విసుక్కుంటూ లేచే పిల్లాడి నోట్లో పాలసీసా వుంచింది. 'ఇప్పటికి వినిపించిందా' రాఘవయ్య గదిలోనించి ముందు గదిలోకొచ్చాడు. 'ఆ-వినిపించింది. ఓ రామా లేదు. కృష్ణా లేదు' విసుగ్గా అంది శాంతమ్మ.

అప్పుడే గడపలో అడుగు పెట్టిన కోడల్ని చూసి 'అప్పుడే వచ్చేవేమిటి?' అడిగాడు రాఘవయ్య

'ఇంకా ముందు రావాల్సినదాన్ని, బస్సు అందక' ఉయ్యాల్లో పిల్లాడి దగ్గర కెళ్ళింది రాధ.

'పిల్లాడికి బాగాలేదనే మధ్యాహ్నం సెలవు యిచ్చి వచ్చేసాను' ఉయ్యాల ఊపుతూ అత్త వినేలా అంది రాధ.

*　　　*　　　*

రాధంటే శాంతమ్మకి చాలా యిష్టం. కూతురు ఫారిన్‌లో ఉంది. ఏ నాలుగేళ్ళకో ఓసారి వచ్చి వెళ్ళిపోతుంది. తన ఇంట్లో లక్షణంగా తిరిగే కోడలును ఏనాడూ కోడలులా చూడలేదు శాంతమ్మ నిజానికి. కొడుకు కోడలు నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటుంటే. కలసి సినిమాలకెడుతుంటే ఎంతో ఆనందపడేది శాంతమ్మ. రాధ స్నేహితులంతా అనేవారు 'ఒసేయ్

రాధా, అదృష్టం అంటే నీదేనే - భర్త ప్రేమగా చూడటంలో గొప్ప విశే
షేముంది? అత్తగారు ప్రేమగా చూడటంలోనే గొప్పంతా' అని. తల్లికి
దూరంగా వున్నానని అనుకునేదేకాదు రాధ. కానీ ఈ మధ్య పాలల్లో
ఉప్పురాయి పడ్డట్టు నిర్మలమైన శాంతమ్మ మనసు ఎందుకో కలతచెందు
లోంది.

ఆ రోజు రాత్రి రాధకి ఎంతకీ నిద్రపట్టలేదు. అటు ఇటు ఒత్తి
గిల్లింది. చివరికి 'ఏమండీ' అని భర్తను లేపింది. 'ఊ' పక్కకు ఒత్తి
గిల్లాడు రామం.

'అత్తగారెందుకో అదివరకులాలేదు - గిట్టని వాళ్ళు నాపైనా చెప్పా
రేమో - పిల్లాడిని కూడా అదివరకంత లాలనగా చూడడం లేదు.'

రామం నవ్వాడు. 'అర్థలేని ఆలోచనలతో' మనసు పాడుచేసుకొకు.
అమ్మ చాలా మంచిది. చెప్పుడు మాటలకి మారిపోదు' - రామం క్షణంలో
మళ్ళా నిద్రలో మునిగిపోయాడు.

*  *  *

పక్కింటి పార్వతమ్మతో కలిసి పొద్దున్న ఎనిమిదయ్యేసరికి గుడికి
బయలుదేరింది శాంతమ్మ ఆ రోజు. 'అమ్మవారి ఉత్సవాలు జరుగుతు
న్నాయి వెడుతున్నాను' గదిలో ముసలాయనకి, వంటింట్లో వున్న కోడ
లుకి వినబడేలా ఓ కేక పెట్టింది.

రాధకి ఏం చేయాలో తోచలేదు. తను ఆఫీసు కెళ్ళితే పిల్లాణ్ణి
ఎవరు చూస్తారు? పాలు కలపడం, పట్టడం మామగారికి రావు. తనకి
ఇంక సెలవులు కూడా లేవు. రాధ మనసులో కొన్ని వందల సమస్యలు
తల ఎత్తి నాట్యమాడాయి ఆ క్షణంలో.

*  *  *

గుళ్ళో కూచున్న శాంతమ్మ అమ్మవారి విగ్రహంకేసే చూస్తోంది. ఎంత చక్కగా అలంకరించారు! ఇంతకాలం దైవచింతనకి తావులేకుండా గడిపేసింది. ఓ వ్రతాలు, తీర్థయాత్రలు ఏవీ లేవు. కాని తను ఏ క్షణంలో కన్ను మూస్తుందో- అప్పుడు తనవెంట వచ్చేవి ఏవీ - ఈ ఇల్లు, పిల్లలు, మేడలు, మిద్దెలూనా? కావే - తను చేసుకున్న పుణ్యమేదో అదే! శాంతమ్మ గడిచిపోయిన కాలాన్ని తల్చుకుని పశ్చాత్తాప పడింది. శాంతమ్మ అమ్మ వారి విగ్రహాన్ని చూస్తూనే వుంది - కానీ నిశ్చలత కుదరటం లేదు - రాధమ్మ ఆఫీసుకి వెళ్ళి వుంటుంది. పసివాడు ఇప్పుడిప్పుడే పాకుతున్నాడు- గడపదాటి బయటికొచ్చేస్తే? ముసలాయన నిద్రపోతుంటే? శాంతమ్మ గుండె ఝల్లుమంది. ఇక గుడిలో కూచోలేక పోయింది. అయినా ఇంత నిశ్చలత లేకపోతే ఎలా? సమాధానపరచుకుని మళ్ళీ కూచుంది.

* * *

రాధ ఓ వారం రోజులు నానా ఇబ్బందిపడి పనిపిల్లని కుదిర్చింది- పిల్లాడిని ఎత్తుకోటానికి, ఆడించటానికి, పాలు పట్టడానికి, నిద్ర పుచ్చ టానికీ. కాని ఇంట్లో రాధ, భర్త ఏదో చిరాకుగానే వుంటున్నారు - విసుగ్గా వుంటున్నారు. ఇంట్లో పనులన్నీ యాంత్రికంగానే జరిగిపోతున్నాయి. భోజనాల దగ్గర గంటలు గంటలు కబుర్లు చెప్పుకోటాలు, సినిమాలు, షికార్లు అన్నీ ఇంచుమించుగా తగ్గిపోయాయి. శాంతమ్మ అంతా గమ నిస్తూనే వుంది. తను ఇంటి బాధ్యత పట్టించుకోడం పూర్తిగా తగ్గించే సింది - ఉంటే దేవాలయంలో, లేకపోతే చేతిలో భాగవతంతో మాత్రమే కనిపిస్తోందీ మధ్య. అవును మరి - తన పరమార్థం తను చూసుకోవద్దూ!

కాని, శాంతమ్మ విషయం ఎవరూ ఇంట్లో పట్టించుకోటం లేదు. పిల్లాడిని ఎంత పనిలో వున్నా అత్తగారికి అందివ్వడం మానేసింది రాధ.

ఆఫీసు విశేషాలు రకరకాలుగా రోజూ అమ్మకు చెప్పే రామం చాలా ముభావంగా వుంటున్నాడు. ముసలాయన హనుమడి సేవలో మునిగిపోయాడు. శాంతమ్మ ఆ రోజు తను ఆ ఇంట్లో ఒంటరయి పోయినట్లు బాధపడింది మొదటిసారిగా. అయినా గుళ్ళు గోపురాలు తిరిగివస్తేనేనా వుంది భక్తి! ఏమో - ఇల్లంతా తనే అయి భర్తని. పిల్లల్ని సంతోషపరుస్తూ గడిపిన రోజుకన్నా ఇప్పుడు సాధించినదేమిటి? ఏమో - మానసిక సంఘర్షణలో పడి నలిగిపోయింది శాంతమ్మ. భాగవతంలో రెండు కన్నీటి బిందువులు జారిపడ్డాయి.

'శాంతమ్మా, శాంతమ్మా! బయలుదేరు - ఊరేగింపు వస్తోంది - వెళ్ళాలనుకున్నాం కదూ' గోడవతల నుంచి పార్వతమ్మ కేక పెడుతోంది.

"ఒంట్లో బాగా లేదు - రాలేను ఒదినా" - శాంతమ్మ భాగవతం మూసేసి గదిలోకొచ్చింది.

ఆ రాత్రి శాంతమ్మకి ఎంతకీ నిద్రపట్టలేదు - లేచి మంచం మీద కూచుంది. ఏదో అశాంతి. తనకు తెలియకుండానే తన నుంచి ఏదో దూరమయిపోయినట్లు ఆవేదన. "ఏమండీ" నిద్రపోతున్న రాఘవయ్యను కదిపించింది. "ఏమిటీ" రాఘవయ్య లేచి కూచున్నాడు. భార్య కళ్ళలోకి చూచాడు. కళ్ళలో ఎంతో దిగులు - పాపం, అనుకున్నాడు మనసులో - భార్యను చూస్తూ.

'మనసేమీ బాగాలేదండీ' శాంతమ్మ కన్నీళ్ళు ఆపుకోలేక పోయింది. రాఘవయ్య క్షణం ఆగి —

'అదేమిటి - మనసు బాగుండకపోడం అంటే - అయినా శాంతా నీకేం బోల్డుపుణ్యం సంపాదిస్తున్నావుగా'-నెమ్మదిగా నవ్వాడు రాఘవయ్య.

ఆ నవ్వు శాంతమ్మ గుండెల్ని పిండివేసింది. ఇంత మందిని క్షోభ పెడుతూ తను మూటకట్టే పుణ్యం ఎంతటిది? శాంతమ్మ శూన్యంలోకి చూస్తూ వుండిపోయింది.

*　　　　*　　　　*

గుడిలో దేవుడి ఉత్సవాలు జరుగుతున్నాయని చెప్దామనీ, పది రోజులుగా ఇల్లు కదలని శాంతమ్మని చూద్దామని వచ్చిన పార్వతమ్మ, ముందు గదిలో నవ్వుకుంటూ కబుర్లాడుకుంటున్న రాధని, రామాన్ని, దొడ్డి గుమ్మంలో మనుమణ్ణి ఒళ్ళో కూచోపెట్టుకుని ముసలాయనతో ముచ్చట్లాడుతున్న శాంతమ్మనీ చూసి 'ఎన్ని జన్మలెత్తినా ఈ శాంతమ్మకికి ముక్తిలేదు' అని గొణుక్కుంటూ వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది మరు క్షణంలో.

"నాకు ఏ గుళ్ళూ, గోపురాలు అక్కర్లేదు బాబూ, ఈ పసివాడే పరమాత్మ" పసివాడి పాల పెదాలు చీర కొంగుతో తుడుస్తూ మురిసిపోయింది శాంతమ్మ.

*

# పడగనీడ

వెంకట్రావు వాలు కుర్చీలో కూచుని పేపరు తిరగేస్తున్నాడు. ఆ కుర్చీ వాలు ఎలాటిదంటే, పీఠినవచ్చేపోయే వాళ్ళని చూడగలడు. కాని అతనెవరికీ కనబడకుండా ఉండగలిగినటువంటిది.

"ఆ చదువుఆపి లోపలికి రండి.... కాఫీ" గుమ్మంలోంచి కేక పెట్టింది వెంకటరామ సుబ్బలక్ష్మి. అంతే ఒక్క రెప్పపాటు కాలంలో లోపలికి కుర్చీతో సహా వెళ్ళిపోయాడు శ్రేయోభిలాషి వెంకట్రావు.

భార్యంటే చాలా భయభక్తులున్నాయంటే నమ్మడం ఆశ్చర్యంగా ఉండవచ్చు. అది పచ్చినిజం. వెంకట్రావుకి ఇంగ్లీషు సినిమాలు చాలా ఇష్టం. అయినా పెళ్ళయ్యాక ఒక్కటికూడా చూడ్డం మానేశాడు....అతని భార్యకి ఇంగ్లీషు సినిమా అర్థంకాదు కనుక. స్నేహితుల యింటికి ఎప్పుడైనా వెడితే ఖచ్చితంగా చెప్పాలి- ఎప్పుడు ఎన్ని గంటలకి వస్తాడో - అనుకున్న టైముకి రాలేకపోతే అతని పాట్లు అన్నీ ఇన్నీ కావు. నిద్రలోవున్న భార్యని లేపకూడదు. అతనికోసం వుంచిన భోజనం చేసి తీరాలి....అయితే వెంకట్రావు భార్యా విధేయుడేకాకుండా, చాలా తెలివైన వాడుకూడా. అలాంటి క్లిష్ట పరిస్థితి వస్తే, చాలా ఉపాయంగా ఆపద నుంచి తప్పించుకోగలడు. చదువుకుంటున్న కొడుకుని లేపి ప్రవేశిస్తాడు ఇంట్లోకి. బల్లమీదున్న భోజనాన్ని నిశ్శబ్దంగా దొడ్డి గుమ్మం తలుపు తెరిచి కుక్కకి పడేస్తాడు. అలాటప్పుడే అతని మనసు క్షోభిస్తుంది. స్వర్గంలో వున్న మామగారు క్షణక్షణం తనని శపిస్తున్నట్టు అనిపించి భయమేస్తుంది. వెంటనే తన కిష్టమైన దైవ ప్రార్థన చేసుకుంటాడు మనసులో.

పక్షవాతంతో మంచాన పడివున్న వెంకటరామ జోగయ్య కూతురి మెడలో తాళికట్టాడో, ఆ క్షణంనుంచే గతాన్ని మరిచిపోవాలని ప్రతిజ్ఞ పూనాడు. అప్పట్నుంచే, అంటే, డబ్బున్న వెంకట్రామ జోగయ్యకి అల్లుడయినప్పట్నుంచే గొప్పవాళ్ళ జాబితాలో చేరిపోయాడు వెంకట్రావు.

గొప్పగా ఉపన్యాసాలియ్యటం, లోకోద్ధరణకే తను జన్మించానని విశ్వసించటం, పరమ వికారంగా వుండే వెంకటరామ సుబ్బలక్ష్మిని చేపట్టడంలో పరమార్థముందని, ఆత్మ సౌందర్యానికే తను విలువనిస్తానసటం, అసలు ఆడవాళ్ళు అందంగా వుండకూడదనడం - ఇలాంటి వెన్నెన్నో విషయాలు ఎన్నుకొని అనర్గళంగా, అనంతంగా, గంభీరంగా ఉపన్యసించటం ఈ మధ్య మరీ ఎక్కువై, ఊపిరి సలపనంతగా కాలం గడిపేస్తున్నాడు మహాత్ముడు వెంకట్రావు!

ఇంతవరకు తెలిస్తే చాలదు వెంకట్రావు గురించి. అసలు తెలియాల్సింది చాలావుంది నిజానికి. అతను శ్రేయోభిలాషి - ఎవరు, ఎక్కడ, ఏపని, ఎప్పుడు చేస్తున్నారో, ఎవరింటికి ఏచుట్టం ఎప్పుడొచ్చి ఎప్పుడెళ్లాడో, పక్కింటి కుర్రాడు కాలేజినుంచి ఎందుకాలస్యంగా వచ్చాడో, ఎదురింటి వారి అమ్మాయి ఐదుగంటలయినా ఇంకా ఎందుకు ఇంటికి రాలేదో - అబ్బో- ఇలాంటి వెన్నెన్నో వివరంగా క్షణాలమీద చెప్పేయగల సమర్థత వుంది. ఇవన్నీ ఎందుకూ అని ఎవరూ అనడానికి వీలులేదు.

'నా ఇరుగు పొరుగుల క్షేమసమాచారాలు, బాగోగులు తెల్సుకోవలసిన బాధ్యత నాకుంది.... ఈ సంఘం బాగుపడాలంటే, ఎవరికి వారే నాకేమని ఊరుకుంటే ఎలా....' అంటాడు - విజయగర్వంతో, ఓ నవ్వు విసురుతాడు - వెంకట్రావు సంఘశ్రేయోభిలాషి!

ఈమధ్య వెంకట్రావుకి ఎందుకో చిరాగ్గా అనిపిస్తోంది. బాబాయి గారూ అని, మామయ్యగారూ అని తన చుట్టూ తిరుగుతూ వుండే మనుష్యుల సంఖ్య తగ్గింది - అందుకే అతనికి కోపం - అరే! వెంకట్రావు కుర్చీలో కూచుని తల ఎత్తేసరికీ - ఇంకేముంది- తలకొట్టేసినంత పనైంది. ఎదురింటి మేడమీద భాగంలోకి ఎవరో వచ్చారే - ఇది ఎలా జరిగిందబ్బా! ఈ మేడ రాజయ్య తనని సంప్రదించకుండా - తనకి చెప్పకుండా - తనకి తెలియకుండా....వెంకట్రావుకి తను బతికుండగానే తన పెద్దరికానికి ఈ వీథిలో ఇంత పెద్ద దెబ్బా?! రాజుగారికి ఉన్నట్టుండి కిరీటం పడిపోతే, సింహాసనం కదిలిపోతే ఎలావుంటుంది? వామ్మో!! వెంకట్రావు చెప్పులు తొడుక్కుని గబగబా ఎదురింటి మేడ మెట్లెక్కాడు.

"రండిబాబూ - రండి" రాజయ్య కుర్చీ చూపించాడు. "రాత్రే ఈ వాటాలోకి వచ్చారండి - మా అల్లుడిగారి స్నేహితుడట ఆయన - నాకూ చెప్పలేదు బాబూ...." ఏదో తప్పు చేసిన వాని ధోరణి రాజయ్య గొంతులో ధ్వనించింది. వెంకట్రావు మాట్లాడలేదు.... ఒక్క నిముషం ఆలోచించాడు.... వ్యవహారం మొత్తం చేయిజారిపోకూడదు. రాజయ్య ఆ ఊళ్ళో పేరుపొందిన కలప వ్యాపారి. బాగా డబ్బున్నవాడు.... వెంకట్రావులాటి శ్రేయోభిలాషులంటే భయం ఉన్నవాడు.

వెంకట్రావు ముందు నడుస్తుంటే, వెనక నడిచాడు రాజయ్య మేడ మీదకి.

''ఇంటి ఎదురుగా వుంటారు - వెంకట్రావు గారని'' రాజయ్య అంటుంటే కుర్చీ జరుపుకు కూచున్నాడు వెంకట్రావు. ఆ భాగంలోకి కొత్తగా వచ్చిన జ్యోతికి నచ్చలేదా పద్ధతి. స్నానానికెళ్ళిన రామం ఇంకా రాలేదు.

జ్యోతిని నఖశిఖపర్యంతరం పరీక్షగా చూసాడు వెంకట్రావు. ఆమె చేస్తున్న ఉద్యోగం, వచ్చే జీతం, రామం చేస్తున్న ఉద్యోగం, అతని జీతం, ఇంటి పేరు - ఒకటేమిటి అన్నీ వివరాలు అడిగి తెలుసుకున్నాడు. జ్యోతికి మహా చిరాగ్గా వుంది. "వస్తానమ్మా -" ఇల్లాంతా పరిశీలనగా చూస్తూ లేచాడు వెంకట్రావు.

'తమాషా మనిషి' నవ్వుకొందిజ్యోతి.

'మరేం లేదయ్యా - ఇందులో ఎన్నిరకాలు - అసలు ఈ రోజుల్లో భార్యభర్తలో కారో చెప్పటానికి కూడా కష్టమే, తీరా ఇల్లు ఇచ్చుకుని ఇబ్బంది పడిపోతావని నీమీదవుండే అభిమానం కొద్దీ నేను ఇలా రావడం కానీ' వెంకట్రావు ఆగాడు. 'ఫరవాలేదండి - తమరు పెద్దలు - ఎన్నైనా అడగచ్చు' రాజయ్య నెమ్మదిగా దిగాడు. బాత్‌రూమ్ నుంచి వచ్చిన రామం మెట్ల దగ్గర వెంకట్రావుని చూసి, లోపలికెళ్ళిపోయాడు.

ఆ తర్వాత అవసరముండి, లేక వెంకట్రావు జ్యోతి మేడమీది కొస్తూనే వున్నాడు. కాసేపు పేపరు తిరగేసి, కాఫీ తాగేసి వెళ్ళిపోడం అలవాటు చేసుకున్నాడు. అయితే సాధారణంగా రామం బయటకి వెడుతుండగానో, పడుకున్నప్పుడో రావడం జరుగుతోంది. అంతేకాకుండా, సోది కబుర్లు చెప్పడం, ఇరుగుపొరుగుతో బాతాఖానీ చేయడం, అందర్నీ పలకరించడం ఇష్టం వుండదు రామానికి.

ఇదే నచ్చలేదు వెంకట్రావుకి. అమ్మాయి ఫరవాలేదు కానీ, ఇతనికె కాస్త గర్వం - గర్వమేమిటి - అందగత్తె భార్య, సంపాదనాపరులు భార్య - తెలివైన భార్య వుందిగా వీడికి - వెంకట్రావుకి ఉన్నట్లుండి వెంకట రామ సుబ్బలక్ష్మి కేక వినిపించింది. "లోపలికి రండి - భోజనం." లోపలికి వెళ్ళిపోయినా రామం తనని గౌరవంగా చూడలేదని, తనకి వినయంగా నమస్కారం పెట్టడం లేదని - ఏదో ఏదో కోపం ఒక్క

సారిగా గుండెల్లో దాగి కూర్చుంది - వెంకట్రావు కింద పెదవి కొరుక్కున్నాడు.

"ఏమిటా పరధ్యానం" అరిచింది పద్దన చేస్తున్న అర్ధాంగి. "ఆ. ఏం లేదు" మంచినీళ్ళు గబగబా తాగాడు.

ఆరోజు ఆఫీసుకి సెలవు. జ్యోతి తీరిగ్గా తలదువ్వుకుంటోంది. ఒకసారి ఉలిక్కిపడింది - అద్దంలో కనిపించిన రూపం చూసి.

"మీ ఆయన కనపడడేం ."

"ఆయన - సినిమాకెళ్ళారు -" జ్యోతి జుట్టు ముడివేసుకుంది. ఈ రాజయ్యతో చెప్పి ఈ పీడ వదలించమనాలి. లేకపోతే ఈ వాటా ఖాళీ చెయ్యాలి - జ్యోతికి చాలా కోపం వచ్చింది. సమయాసమయాలు లేకుండా ఇంట్లో జొరపడేవాళ్ళంటే చాలా అసహ్యం తనకి!!

వెంకట్రావు పకపకా నవ్వాడు -

"అదేమిటమ్మా - నిన్ను తీసుకెళ్ళకుండా ఒక్కడూ వెళ్ళటమేమిటి - నాకు నచ్చలేదు."

"ఓ అదా - నేను ఆసినిమా ఇంతకు ముందే చూసాను."

"ఏమో - ఏమిటో - సరే వస్తానమ్మా"

'హమ్మయ్య' - ఊపిరి తీసుకుంది జ్యోతి.

మెదడుకి ఈ రోజుకి మంచి మేత దొరికింది - ఒక్కడూ సినిమాకెళ్ళటం - ఆ అమ్మాయి బిక్కు బిక్కుమంటూ ఒక్కర్తే ఉండటం - ఒక్కడూ వెళ్ళాడో, ఎవరినైనా వెంటబెట్టుకెళ్ళాడో - ఏదయినా ఇందులో ఏదో వుంది, 'సమ్‌థింగ్ ఫిషి' - వెంకట్రావుకి విజయోత్సాహమొచ్చింది. 'యురేకా' అని కేక పెట్టాలనుకున్నాడు. గొప్ప రహస్యాన్ని, తనే

కనుకున్నానన్న గర్వంతో రాజయ్య గుమ్మం దగ్గరకొచ్చాడు. స్కూటర్ లోపల పెట్టి, జుట్టు పైకి తోసుకుంటూ రామం మెట్లెక్కుతూ కనిపించాడు.

'ఏమిటి వీళ్ళ కథ' కళ్ళెగరేస్తూ వెంకట్రావు రాజయ్యతో రహస్యంగా అన్నాడు.

"మంచివాళ్ళండి - రెండో తారీఖుకల్లా నాకు అద్దె ఇచ్చేస్తున్నారు."

"అబ్బ, అద్దె గురించి కాదయ్యా - ఆ కుర్రాడు కిందికొచ్చి నీతో కబుర్లు చెప్తాడా-"

"అదా, అండీ - అబ్బే - ముభావం మనిషి - ఆయన పనేదో ఆయనంది - మంచి వారండి.''

ఈమాటు వెంకట్రావుకి రాజయ్య మీద కోపం వచ్చింది.

ఆ రాస్కెల్‌ని వీడు మంచివాడంటాడేమిటి - పెద్దవాళ్ళంటే గౌరవం లేదు వాడికి - ఒకసారీ నాకు నమస్కారం చెయ్యడు - ఏమిటి వీడి పొగరు - వెంకట్రావు ఎన్నో విషయాలు పోగుచేయాలనుకుంటుంటే, రాజయ్య దారిప్వడం లేదే.

"ఏమోనయ్యా, ఆ బొమ్మల చొక్కాలు, ఆ జులపాలు ఏమిటా వేషం - మర్యాదస్థునిలా కనిపించడేం-''

''అయ్యో అదేమిటండీ - ఇవాళ రేపు కుర్రాళ్ళంతా ఇంతేకదండి- మా అల్లుడుగారయితే మెడలో గొలుసు కూడా వేసుకున్నారండి - ఫేషనట'' వెంకట్రామయ్యకి రాజయ్య గొంతు నులిమేయాలనిపించింది - శ్రేయోభిలాషిత్వం తల్చుకు గర్వపడిపోతున్న వెంకట్రావుకి రామం విషయం పెద్ద గొడ్డలి పోటులా అనిపించింది.

అసలు రాజయ్యకు బుద్ధిలేదు - నాకు చెప్పకుండా ఈ భాగం ఎందుకియ్యాలి - ఈ రామంగాడు నన్ను లెక్కపెట్టడేం - 'రండి

బాబాయిగారూ అనడేం' - వెంకట్రావు పళ్ళు కొరికాడు, కోపం పొమ్ము
పగ్గైంది. ఎన్ని చేపలు తన వలలోపడి గిలగిల తన్నుకోలేదు, వీడో
లెక్కా తనకి?! వెంకట్రావు బుసకొడుతూ మేడపైకి చూసాడు.

కాలం గడుస్తోంది. మళ్ళా డల్‌గా వుంది వెంకట్రావుకి. తనేదో
చేయాలి - వెంకటరామ సుబ్బలక్ష్మి ఊరెళ్ళి వారం రోజులుండి రాత్రే
వచ్చింది.... అన్నీ గమనిస్తూనే వుంటాడు అలస్యం కాకుండా, పొరపాటు
లేకుండా వెంకట్రావు!

స్కూటర్ స్టార్టు చేసిన రామం ఎదురుగా నిల్చున్న వెంకట్రావుని
చూస్తూ, 'నమస్కారం - తీరిగ్గా వున్నారివాళ' - ఉలిక్కిపడ్డాడు
వెంకట్రావు.

''అంటే?''

''అదే - పేపరు చేతిలో లేదు - అందుకని'' నవ్వుతూ అంటూనే
వెళ్ళిపోయాడు రామం.

"ఓహో - నన్ను మంచి చేసుకోవాలనా ఈ దారికొస్తున్నాడు .
ఈ వెంకట్రావు అలాటి ఇలాటి వాడు కాడు-' గర్వంగా నవ్వుకున్నాడు
తనలోతాను!

రాత్రే ఊరినుంచి వచ్చిన జ్యోతి, భర్త ఆఫీసుకెళ్ళిన తర్వాత తలు
పేసుకు బడలికగా పుండి పడుకొంది.

తలుపు చప్పుడు....చిరాగ్గానే లేచింది.

"ఒంట్లో బాగా లేదా" వెంకట్రావు గుమ్మంలో ప్రత్యక్షం.

"ఏం లేదు-రెండు రాత్రులనించి చెప్పాలనుకుంటున్నాను-మీవాళ్ళు
దూరంగావున్నా, ఎదురుగుండా వున్నందుకు తండ్రిలాటి బాధ్యత నాకుం
టుంది తప్పదుమరి" జ్యోతి ముఖంకేసి చూస్తున్నాడు.

ఏవిషయమో అర్థంకావటంలా....

"అదేనమ్మా - నువ్వు ఒట్టి మనిషివికాదు - రాత్రిళ్ళు చలిగాలిలో మేడమీద నువ్వూ, మీ ఆయన తిరుగుతూ కబుర్లు చెప్పుకుంటుంటే చూస్తు న్నాను. మొన్న అర్ధరాత్రి దాటిందా - గాలిలేక, నిద్ర పట్టక బయట కొచ్చాను. వచ్చేసరికి మీరిద్దరూ మేడపైన కనిపించారు- మరేంలేదు, చలి గాలిలో తిరిగితే ఆరోగ్యం పాడవుతుంది - అది ఎలా చెప్పాలా అని తిక మకపడ్డాను. చిలకా గోరింకల్లా ఇద్దరూ మేడమీద ముచ్చటగానే వుంది కానీ-నీది-అదే నీ ఆరోగ్యం జాగ్రత్త" వెంకట్రావు పేపరులో ముఖం ఉంచుకొనే జ్యోతిని జాగ్రత్తగా పరిశీలిస్తునే ఉన్నాడు.

ఏమీ అర్థంకాలేను - దీనికి మొదలు తుది తెలియలేదు. వెళ్ళి పోతున్న వెంకట్రావు వైపు చూస్తూ నిలుచుంది, తను ఊరినుంచి వచ్చిందే రాత్రి....మేడమీద చల్లగాలికి తను, భర్త మొన్న కనిపించడమేమిటి - పైగా చిలకా గోరింకల్లాగానా - చేతిలో దువ్వెన అలానే వుంది. మనసు ఎటో ఎటో పరిగెత్తింది. తల తోకలేని ఆలోచనలు ఉక్కిరి బిక్కిరి చేస్తు న్నాయి - అయినా నిప్పులేందే పొగరాదుగా - నిజనిజాలు ఎలా తెలు స్తాయి? జ్యోతి తలవేడెక్కింది. భార్యాభర్తల్లో అనుమానాలు భయంకర పిశాచాలు.

కాలం గడుస్తోంది. నాలుగు రోజులయింది. ఏమో మరి - భార్య ఉండగానే మరో పెళ్ళి చేసుకున్న భర్తలు, భార్యని హత్య చేసి పెళ్ళి చేసుకున్న భర్తలు - ఎందరెందరో - జ్యోతి కళ్ళలో నీళ్ళు నిలిచాయి. తన రామాన్ని తనే శంకిస్తుందా - ఏ ఆధారంతో - వెంకట్రావు పెను భూతంలా కళ్ళముందు కనిపిస్తుంటే అప్రయత్నంగా కళ్ళు మూసుకుంది.

తలుపు దబదబా బాదుతున్నారు - జ్యోతికి భయం వేస్తోంది తలుపు తియ్యాలంటే - వెంకట్రావు ఇంకేమి చెప్పడానికి వస్తున్నాడో-

ధన, ధన, ధన - తలుపు విరిగిపోతుందేమో! జ్యోతి గబగబా లేచింది.

ఆశ్చర్యం - రాధారాణి!! ప్రాణస్నేహితురాలు!!

"ఏమిటి చెముడా - లేకపోతే పుట్టబోయే బిడ్డ గురించి తియ్యటి కలలా-"

"ఏమిటి - అలా ఏడుపుగొట్టు ముఖం నువ్వూనూ, నేనెళ్ళిపోనా -"

తేరుకుంది జ్యోతి.

"ఒక్క నిముషం - వస్తాను" గబగబా లోపలికెళ్ళింది. ముఖం కడుక్కుంది. బొట్టు దిద్దుకుంది.

"చెప్పు" స్నేహితురాళ్ళిద్దరూ కబుర్లలోకి దిగారు.

"ఏమిటలా అయిపోయావు" పరీక్షగా చూస్తూ అంది రాధారాణి.

"అదా - ఒంట్లో బాగాలేదు" పేలవంగా నవ్వింది.

రాధారాణి గలగలా మాట్లాడుతుంది. మద్రాసులో వుంటూ భర్త ట్రయినింగ్‌కి వెళ్ళాడని పుట్టింటికొచ్చింది.

ఇల్లంతా కలయచూస్తూ, "ఇక్కడ నుంచుంటే చాలు - హాయిగా కాలక్షేపమవుతుంది కదూ-" మేడమీద నుంచి కిందికి చూస్తూ అంది.

"హమ్మ బాబోయ్ - ఈ వీధిలో ఎలా ఉండగలుగుతున్నావ్ బాబూ"

"ఏం" కంగారుపడింది జ్యోతి.

"అటుచూడు - శ్రేయోభిలాషి వున్న వీధిలో వుండటమంత నరకం మరోటి లేదు"

"అంటే"

"అదే - వాడే-"

జ్యోతి అటు చూసింది - వెంకట్రావు!

"జ్యోతీ - ఈ ఇంట్లో కాపురం నీకు పడగ నీడలాటిది - నామాట విని ఇల్లు ఖాళీ చెయ్యి."

"అదేమిటి"

"అది అంతే - లేకపోతే, ఈ శ్రేయోభిలాషి కాపురాలు కూల్చేయ గలడు - వీడి అహం ముందు ఎన్ని కొంపలు కూలిపోయాయో నీకేం తెలుసు? అన్నట్టు నీకు గుర్తులేదూ - నా పెళ్ళి ముందు ఒక సంబంధం చూసారు మావాళ్ళు - ఆ పెళ్ళి కొడుకు గురించి అబద్ధాలు చెప్పి, లేని ఉద్యోగం కల్పించి చెప్పాడు ఈ పెద్ద మనిషి. తీరా, ఆరాలు తీస్తే అంతా అబద్ధమే - ఆ సంబంధం మావాళ్ళు వదులుకున్నారు-ఆ కోపంతో ఈ పెద్ద మనిషి నా పెళ్ళయ్యాక మావారికి నామీద ఎన్నో కల్పించి ఉత్తరం రాసాడు - నేను పెళ్ళికాక ముందు లేచిపోయానని, ఇంకా ఎన్నెన్నోలే - నీకు గుర్తులేదూ నేనొకసారి చెప్పాను-ఆ మహాత్ముడు వీడే! థూ!!థూ!!"

జ్యోతి విస్తుపోయి వింటోంది. "అందరిలో తప్పులు వెదుకుచూ, పెద్ద మనిషిలా చెలామణి అయిపోయే వీడు - ఎంత దుర్మార్గుడో అనుభవానికొస్తే కానీ ఎవరూ నమ్మరు."

"అవునవును" జ్యోతి నెమ్మదిగా నసిగింది! హాయిగా నవ్వింది!

* * *

ఆర్నెల్లు గడిచాయి. రాజయ్య మేడపై భాగం ఖాళీ అయిపోయిందని తెలిసిన వెంకట్రావు చిరాగ్గా కుర్చీతో సహా లోపలికెళ్ళిపోయాడు వెంకటరామ సుబ్బలక్ష్మి పిలవకుండానే!!! *

# ఆకసాన హరివిల్లు విరిస్తే....

"ఊ.... వెళ్లు"

"వెళ్ళనండి...."

"అంటే?"

"మీరు అన్నం తినేవరకూ ఇక్కడే నిలబడమన్నారండి. ఈ సీసాలో నీళ్ళు గ్లాసులో నన్నే పొయ్యమన్నారండి- ఆపిలు పండుకోసి పళ్ళెంలో పెట్టమన్నారండి- మరేమో-" రంగయ్య మూడు గిన్నెల కారియర్ పక్కనపెట్టి, బుట్టలో వస్తువులు బయటకు తీస్తూ చెప్తున్నాడు.

"చాల్లే ఆపు. సీసాలో నీళ్ళు నేను గ్లాసులో పోసుకోలేనా? ఛో. నే పిలిచేవరకూ రాకు. అమ్మకి చెప్పావో చూసుకో- వెళ్ళు" కసిరాడు రవి. రంగయ్య కదిలాడు. గేటు దగ్గర బీడీ కాలుస్తూ కూచున్నాడు. నిజానికి ఇదే బావుంది 'యాపిల్ కొరుక్కు తినలేవా?' నవ్వాడు విజయ్. రవి మాటాడలేదు.

అసలు ఎందుకు కొరుక్కుతినలేడూ- తనని తిననిస్తేగా. అసలు మూడు గిన్నెల కారియర్ ఏమిటి- బోర్- హాయిగా చిన్న టిఫిన్ బాక్సే తెచ్చుకుంటే గబగబా తినేసి ఆడుకోవచ్చు. పనిమనిషి ఓ గిన్నె ఇందులోది పారేస్తే ఎంత బావుంటుంది. ఛ, ఏమిటో- ఆ కారియర్‌లోది ఏదీ తినాలని పించలేదు ఆ రోజు రవికి- కాస్తకాస్త తిని నెమ్మదిగా దూరంగా ఉన్న చెత్తబుట్టలో పోసేశాడు.

లంచ్ టైము అయేసరికి మూడు గిన్నెల కారియర్ సద్ది, బుట్టలో సీసాతో నీళ్ళు, ఓమూల ఏదో ఒక పండు, ఒక్కోసారి ఏదన్నా స్వీటు, లేకపోతే కాడ్‌బరీ చాక్లెట్సు, ఇలా బుట్ట నిండుగా పంపడం రాధారాణికి అలవాటు. అవన్నీ తినేలా చూడ్డానికి రంగయ్య పక్కన నుంచోవాలి.

ఈమధ్య రవి ఒక ఉపాయం కనిపెట్టాడు, రంగయ్యని దగ్గర నుంచోకుండా పొమ్మనడం.

విజయ్ టిఫిన్ బాక్సు, రవి కారియర్ మూతలు తీసి ఎవరికిష్ట మైనవి వాళ్ళు తినడం మొదలుపెట్టారు. ఇద్దరికీ ఎక్కువై మిగిలినవి చెత్త బుట్టలో గుమ్మరించి ఒత్తి కారియర్ రంగయ్య చేతికియ్యడం అలవాటయి పోయింది రవికి.

గేటు దగ్గర కూచుని బీడీ కాలుస్తున్నా, అమ్మగారి పురమాయింపు గుర్తుంది రంగయ్యకి!

కారియర్ ఓ మూలపెట్టి "ఇయ్యాల చినబాబుగోరు పెరుగన్నం తిననని పేచీ పెట్టారండి- నేను బతిమాలి తినిపించానండి" అంటాడు అమ్మగారికేసి చూస్తూ.

"మంచిపని చేశావు" మెచ్చుకుంటుంది రాధారాణి.

మరోరోజు "చినబాబుగోరు ఆపిలు ముక్కలు కొయ్యద్దు అంటా రండి...."

"వాడికేమి వస్తుంది పండు కొయ్యటం- వేలు కోసుకుంటే!"

"అదేనండి.... ఇసరండి- పైగా ఆ బాబుగోరి దోస్తండి- ఆపిలు కొయ్యకూడదటండి- కొరుక్కుతినాలట."

"ఇంతకీ తిన్నాడా- ఆ దోస్తుకి పెట్టేశాడా?"

"అమ్మా! నేను తేనటండి. అంతా మన బాబే తినేలా, ఆ దోస్తు తినకుండా ఆడ నిలబడ్డానండీ...." ఇలా రంగయ్య చెప్తుంటే రాధారాణికి ఆనందంగానే వుంది. కాని మధ్యలో రంగయ్య "ఆ మూడు గిన్నెల్లో అన్నం బాబే తినేశారండి" అన్నాడు.

"ఊరుకో, అస్తమానం. మూడు గిన్నెలు, మూడు గిన్నెలు అనకు. కారియర్ అను చాలు" విసుక్కుంది రంగయ్యపై రాధారాణి.

ఈ రంగయ్య దగ్గర నిలబడి తినేట్టు చేస్తున్నాడు కనక పిల్లాడు ఒక్కరవ్వ బాగున్నాడు. నిజానికి ఈ రంగయ్య మధ్య దారిలో కారియర్ తెరిచి తింటేనో! అనే అనుమానం మొదట్లో రాధారాణికి కలగకపోలేదు. ఊం ఏదో ఒకటి. రంగయ్య మంచివాడే, పిల్లలవాడు అని సర్దుకుంది మనసులో.

షాపింగ్ పూర్తి చేసుకుని స్కూలు ముందు ఆగింది రాధారాణి ఆరోజు. లోపల కాంపౌండులో పిల్లలు కొందరు సందడిగా అటు ఇటు తిరుగుతున్నారు. ఇంకొందరు ఆడుకుంటున్నారు. కొందరు పిల్లలు గుంపులు గుంపులుగా కూచుని లంచ్ తింటున్నారు. చెట్టుకింద కూచుని తింటున్న రవి, ఎదురుగా మరో అబ్బాయి కనిపించారు రాధారాణికి. అక్కడే అలాగే నిలబడిపోయింది. గిన్నెలో పాయసం పక్కవాడి టిఫిన్ బాక్స్‌లో కొంతపోసి, కొంత ఆ గిన్నెతోనే తాగుతున్నాడు రవి. రాధారాణి పంపిన చిన్నగ్లాసు బుట్టలోనే వుంది. "రవీ, ఏమిటా తాగడం" గొంతు పైకిలేవబోయింది. వెంటనే నోటికి చెయ్యడ్డం పెట్టుకుంది.

కారియర్‌లో మిగిలిన అన్నం, కూర, మిగిలిన పాయసం అన్నీ కలిపి ఓ గిన్నెలోపోసి చెత్తబుట్టలో దిమ్మరించి వచ్చాడు రవి. రాధారాణి ఒళ్ళు మండిపోతోంది. ఇద్దరూ నీళ్ళపంపు దగ్గరకెళ్ళి నీళ్ళు తాగారు. రవి బట్టలు తడిసిపోయాయి. "తను ఫ్రిజ్‌లో నీళ్ళు పంపినవి

ఏమయ్యాయి" రాధారాణి కోపంగా చూస్తోంది. బుట్టలోంచి కాడ్బరీ తీసాడు రవి. సగం తుంచి పక్కవాడి చేతిలో పెట్టాడు. ఇంతలో మరో కుర్రాడు పరుగెత్తుకుంటూ వచ్చి పల్లీలు రవి చేతినిండా పోశాడు. కాడ్బరీ ముక్క ఆ పిల్లాడి నోట్లో పెట్టాడు రవి. రాధారాణి కళ్ళు నిప్పులు కురిశాయి. రంగయ్య ఏమయినట్టు? రంగయ్య చెట్టుకింద కునికి పాట్లు పడుతున్నాడు. ఇంక అక్కడ క్షణం నిలవబుద్ధి పుట్టలేదు రాధా రాణికి. మరు నిముషంలో కారు స్టార్టయింది. ఛా, వీణ్ణి స్కూలయినా మాన్పించాలి, లేకపోతే ఈ స్నేహాలయినా మాన్పించాలి. పంపు దగ్గర నీళ్ళు తాగటం, పల్లీలు తినటం, తను పంపే ఖరీదయిన పదార్థాలన్నీ అందరికీ పంచిపెట్టడం! పిల్లాడిని ఎంత ప్రత్యేకంగా పెంచాలనుకుందో వాడంత యిదిగా తయారవుతున్నాడు. దీర్ఘంగా నిట్టూర్చింది రాధారాణి.

ఉన్నట్టుండి రాధారాణికి ఓ మంచి ఆలోచన వచ్చింది. ఫస్టురాంక్ అబ్బాయితో వీడికి స్నేహం చేయించాలి- చదువన్నా వస్తుంది. ఎన్నెన్ని ట్యూషన్లు పెట్టించింది? అయితే మాత్రం, ఇరవై రాంక్‌కి తక్కువ ఎప్పుడూ రాడే? చూద్దాం- రాధారాణి పరిపరివిధాల ఆలోచించింది. ఆ సాయంత్రం భర్తతో ఈ విషయం మాట్లాడింది.

"స్కూలుకి వెళ్ళే పిల్లాడు పల్లీలూ తినక, గోళీలు ఆడక ఏం చేస్తాడూ? అసలు నువ్వేందుకెళ్ళావ్" రాధారాణి భర్త ఒక్క నిముషంలో ఆ విషయం తేల్చేసి పేపరు తిరగేయటం మొదలు పెట్టాడు.

* * *

ఆ పెద్ద హాలు, సోఫాలు, గోడల పెయింటింగ్స్ చూసి విస్తు పోయాడు విజయ్. ఇలాటివి కొనమని డాడీకి రాయాలి అనుకున్నాడు మనసులో! 'కూచో' రవి సోఫా చూపించాడు. "మమ్మీ, మా ఫ్రెండు వచ్చాడు" గదిలోకి పరిగెత్తాడు రవి. హాల్లోకి వొచ్చి చూసి "ఏడా" అంది

వెంటనే. తెల్లని యూనిఫాం, పాలిష్‌తో ధగధగలాడే బూట్లు, పాలు వెన్నతో నిగనిగలాడే బుగ్గలు - విజయ్ మహాముద్దుగా ఉన్నాడు. కానీ ఆనాడు వీడి గిన్నెలో పాయసం తాగిందీ, బహుశా రోజూ వీడి యాపిల్ తింటున్నదీ, కేడ్‌బరీ తింటున్నది వీడేనా-ఏ బీద పిల్లాడో రవిని కబుర్లతో మోసంచేసి, బెల్లించి తను పంపించేవన్నీ తినేస్తున్నాడనుకుంటోంది- కానీ ఏమిటో....రాధారాణి లోపలకొచ్చి ఇద్దరికీ బిస్కట్లు, కాఫీ పంపింది.

రాధారాణి వచ్చి సోఫాలో కూచుంది. విజయ్‌ని చూస్తోంది - తను పంపే ఖరీదయిన తిండి వీడే తిని ఇలా నిగనిగలాడుతున్నాడన్నమాట!

ఫోన్ మోగింది- రవి లోపల కెళ్లాడు- అంతలోనే వచ్చి "వీడు ఎప్పుడూ ఫస్టురాంక్ వస్తాడు మమ్మీ!"

"నేను కిందటేడు కూడా ఎప్పుడూ ఫస్టురాంక్‌లోనే వచ్చానండి!" రాధారాణి ఏమీ పట్టించుకోలేదు.

"అవునబ్బాయ్, మీ బళ్లో ఎవరి లంచ్ బాక్సులు వారు తెచ్చుకోరా?"

"తెచ్చుకుంటామండీ" వెంటనే విన్నాడు.

"మరి మావాడి కారియర్‌లోవి ఎవరికో ఒకళ్ళకి పెట్టేస్తుంటాడుట కదా" రాధారాణి మాట పూర్తికాలేదు.

"నేను వీడికేం పెట్టడం లేదు, నేనే తింటున్నాను" అన్నాడు వెంటనే రవి. రాధారాణి నవ్వింది. విజయ్ ముఖం ముడుచుకున్నాడు. ఈ మాటలు మహా చిరాగ్గా అనిపించాయి రవికి. లోపలికెళ్ళిపోయాడు. ఎన్నెన్నో ప్రశ్నలు వేసింది రాధారాణి విజయ్‌ని.

విజయ్ నడుస్తున్నాడు. ఫ్రిజ్‌లోంచి యాపిల్ తీసి చొక్కాకింద దాచుకొని గబగబా వీధిలోనికి నడిచాడు రవి. 'ఇది తీసుకో' రవి బలవంతంచేసి విజయ్ సంచిలో పడేశాడు. విజయ్ వెళ్ళిపోయాడు.

ఆ రోజు విజయ్ ఇంటికి తను వెళ్ళినపుడు విజయ్ నానమ్మ తనకి యాపిల్ జూస్ యివ్వలేదూ. ఎంతోసేపు నేను, విజయ్ కారమ్స్ ఆడుకోలేదూ? మరి ఈ రోజు విజయ్ వస్తే వాడికి యాపిల్ ఇయ్యటానికి తనెందుకంత భయపడుతున్నాడు! కొంచెం సేపు క్రికెట్ ఆడుకుందామని కూడా అనుకున్నాడు. కానీ అమ్మకి కోపం వస్తుంది, స్కూలు నుంచి రాగానే ఆడుకుంటే. తను వాళ్ళింట్లో అన్ని గదులు తిరిగి కబుర్లు చెప్పి వచ్చాడు. ఈ రోజు విజయ్‌ని ముందుగది నుంచే పంపించేశాడే! అమ్మకి ఇలాటివి ఏమీ ఇష్టం వుండవు. స్నేహితులు ఎవరూ ఇంటికి రాకూడదు. ఎవరిళ్ళకీ తను వెళ్ళకూడదు. అందుకేగా అమ్మతో అబద్ధంచెప్పి ప్రయివేటు క్లాసుందని తను విజయ్ ఇంటికి వెళ్ళింది! రవికి తల్లి మీద చాలా కోప మొచ్చింది.

రవి ఇంట్లో అడుగు పెట్టగానే అడిగింది రాధారాణి-

"రవీ-మీ ఫ్రెండు నాన్న ఏంచేస్తాడు?"

"ఏమో!"

"వాళ్ళ అమ్మ?"

"ఆ....ఇంజనీరు,"

"ఏమిటీ-ఇంజనీరా" నవ్వింది రాధారాణి.

"ఏమో నాకు తెలియదు."

"నాకు చెప్పాడులే.

రవి బొమ్మల పుస్తకంలోంచి తలెత్తలేదు. వాడికి తల్లి మాటలేవీ పట్టలేదు మనసుకి, 'స్టేట్సులో ఉంటున్నారట వాళ్ళనాన్న' ఇంకా దొంగ

కబుర్లు. మొగుడొదిలేసి ఉంటాడు. తల్లీ కొడుకూ మేనమామ దగ్గరపడి ఉన్నారంటే,'' రాధారాణి తనంతతాను అనుకుంటూ సోఫాలోంచి లేచింది. ఆరోజు పాయసం తాగిన విజయ్ రూపం మాత్రమే ఆమె కళ్ళకి కనిపిస్తూ క్షణక్షణం వాడిమీద దురభిప్రాయాన్ని పెంచింది.

స్కూలుకి సెలవలిచ్చేశారు. రెండురోజుల తర్వాత రవి పుట్టిం రోజు. ముందే చెప్పింది "వాడింటికెళ్ళి వాణ్ణి పిలుచుకు రానక్కర్లేదు" అని రాధారాణి. చుట్టాలతో, స్నేహితులతో పుట్టినరోజు బాగా గడిచినా విజయ్‌ని పిలిస్తే బావుండేదని చాలాసార్లు అనుకున్నాడు రవి మనసులో!

రాత్రి భోజనాలు చేస్తూ, కబుర్లు చెప్పుకుంటుంటే గుర్తొచ్చిందె ఇందిర రాలేనని ఫోన్ చేసిన విషయం! "ఇందిర రాత్రి ట్రైన్‌లో ఊరెడుతోంది - రాలేనని ఫోన్ చేసింది" రాధారాణి భర్తకేసి చూసింది.

"నన్నేంచేయమంటావ్?"

"మిమ్మల్నేమీ చెయ్యమనను. ఈ స్వీట్సు అవి దానికి రంగయ్యచేత పంపించాలని" రాధారాణి అంటూనే లోపలికెళ్ళింది. రంగయ్యని కేకేసి ఇందిరింటికి పంపింది.

* * *

సెలవల్లో మద్రాసు వెళ్ళి వచ్చాడు రవి. ఇన్ని రోజుల తర్వాత స్కూలుకి వెళ్ళాలంటే భలేసరదాగా వుంది. ఇంచుమించు నెలా పదిహేను రోజులు దాటి పోయింది. ఆరోజే స్కూలు తెరిచారు.

"ఒరేయ్ రవీ కారియర్ ఏదిరా. ఆరోజు స్కూలు నించి తెచ్చావా అసలు" వంటింట్లోంచి కేక పెట్టింది తల్లి.

"ఆ" రవి, పుస్తకాలు సర్దుతూ.

"గుర్తు తెచ్చుకో."

"ఆ రోజు రంగయ్య జ్వరమొచ్చి రాలేదు. నేనే తీసుకెళ్లాను, తీసుకొచ్చాను." రాధారాణికి నమ్మకం కుదరలేదు వీడు స్కూల్లో మరిచి పోయి వుంటాడు. లేకపోతే-

"ఒకవేళ వాడేమన్నా"

"ఎవడమ్మా"

"నీ ఫ్రెండురా"

"ఛీ వాడికెందుకు. అయినా వాడికి చిన్న టిఫిన్ బాక్సు ఉందిగా. వాడు చాలా మంచి వాడమ్మా."

"మంచివాడే. ఆ రోజే అనుకున్నాను వాడి నాన్న స్టేట్సులో ఉన్నాడన్నప్పుడే. ఇలాటివాళ్లు చాలామంది ఉంటారులే, నీకేం తెలుసు" రాధారాణి విజయ్‌ని దొంగగా నిరూపిస్తుంటే రవికి ఎక్కడలేని కోపం వచ్చింది.

*　　　*　　　*

స్కూళ్ళ ఆయాలతో, టీచర్లతో మాట్లాడి రాధారాణి తిన్నగా పిల్లలున్న చోటికి వచ్చింది. పిల్లలంతా చుట్టూ మూగారు. విజయ్ గట్టిగా మాట్లాడుతున్నాడు. కొందరు పిల్లలు రవి కేసి చూస్తూ గుసగుసలు చెప్పు కుంటుంటే రవికి చాలా సిగ్గనిపించింది. ఆ నిముషంలో అమ్మంటే అసహ్యం కలిగింది. రాధారాణి కారు స్టార్టు చేసి వెళ్ళిపోయింది. హమ్మయ్య అనుకున్నాడు రవి.

క్లాసులో విజయ్ తనని చూడనట్టే ఊరుకున్నాడు. అమ్మ చెప్పింది నిజమేనేమో అనిపించింది ఓ క్షణం రవి చిన్న మనసుకి.

"నిజంగా నేను తీయలేదురా" అని చెప్పడేం మరి? అమ్మ మాటలు రవి మనసులో ప్రతిధ్వనించాయి. ఆరోజు ఐదు రూపాయలు పుస్తకం లోంచి కిందపడి పోయాయి. ఎక్కడో పడిపోయా యనుకున్నాడు, అవి విజయ్ కాజేశాడేమో!! మామయ్య తెచ్చిన ఫారిన్ పెన్ అమ్మవద్దంటున్నా స్కూలుకి తెచ్చాడు. ఆరోజే అది పోయింది. ఇదీ విజయ్....రవి పుస్తకం మూసేసి విజయ్ ముఖంలోకి చూశాడు. విజయ్ పుస్తకంలోకి దీక్షగా చూస్తున్నాడు. రోజూ వీడికి నా భోజనం, నా కాడ్‌బరీలు- ఎన్నెన్ని పెట్టాను. ఎక్కడో దాగివున్న అహం ఒక్కసారి తలెత్తింది ఓనిముషం ఆ పసిమనసులో!

రోజూ మామూలుగా ఒకళ్ళ పక్కన ఒకళ్ళు కూచుని లంచ్ తింటున్నా ఏదో నిశ్శబ్దం ఇద్దరి మధ్య....నిర్మలమైన ఇద్దరి మనసు ల్లోనూ కలత చెలరేగుతోంది....అద్దంలాంటి ఇద్దరి మనసులూ మసక బెందుతున్నాయి. "వీడి కారియర్ నాకో లెక్కా! మా నాన్నకి ఒక్క ఉత్తరం రాస్తే ఇలాటి కారియర్లు వందలు కొనగల డబ్బు పంపగలడు. ఈ ఏడాది గడిస్తే నేను, మమ్మీ అక్కడి కెళ్ళిపోతాము హాయిగా" అను కున్నాడు విజయ్.

"వాడి పిచ్చి. టిఫిన్ బాక్సు బాగాలేదని నాది కొట్టేసుంటాడు. మళ్ళా నేను చూస్తానేమోనని, అమ్మ చెప్పినట్టుగా అమ్మేసివుంటాడు. వీడి అమ్మ ఇంజనీరు, వీడి నాన్న స్టేట్సులో ఉండటం, వీడు ఓ ఏడాదిలో ఫారెన్ వెళ్ళిపోడం, అన్నీ అన్నీ అబద్ధాలే అయి వుంటాయి" అను కున్నాడు రవి.

పక్క పక్కనే కూచుంటున్నారు క్లాసులో. పక్కపక్కనే కూచుని లంచ్ తింటున్నారు. రోజులు గడిచిపోతున్నాయి.

*           *           *

ఆ రాత్రి భోజనాలు చేస్తున్నారు రవి, తల్లి, తండ్రి. లేడీస్ క్లబ్బు విశేషాలు చెప్తోంది రాధారాణి ఉత్సాహంగా. కాలింగ్ బెల్ మోగడంతో రంగయ్య తలుపు తెరిచాడు.

"హాయ్ - ఎప్పుడు రావటం" రాధారాణి కుర్చీ చూపించింది.

"నిన్ననే వచ్చా.... చూసారా - మీరు పంపిన స్వీట్సు తినేశాం.... మీ వస్తువు పంపించటం మరిచిపోయాం. వెంటనే మీకు పంపేయ మన్నాను. అమ్మ ఆ విషయమే మర్చిపోయింది. ఒక్కోసారి తమాషాగా మర్చిపోతాం కదూ" ఇందిర గలగలా మాట్లాడుతూ బుట్టలోంచి తీసి పైన పెట్టింది.

రాధారాణి గుండె ఆగినంత పనైంది.

అన్నం కలపడం ఆపేసి మూర్తి భార్యకేసి చూశాడు.

రెప్ప వాల్చకుండా అలా చూస్తూ ఉండిపోయాడు రవి.

ధగధగా మెరుస్తున్న మూడు గిన్నెల కారియర్!

"అదేమిట్రా అంత విస్తుపోతున్నారు- అది మీదే- ఆరోజు నాకు స్వీట్సు పంపలేదూ" ఇందిర మాటలేవీ వినిపించటం లేదు రాధారాణికి. ఏదో చెప్పాలని నోరు తెరిచి, తల్లి కళ్ళని చూసి వెంటనే నోరు మూసేసు కున్నాడు రవి.

*    *    *

ఆరోజు ఎంతో ఉత్సాహంగా వుంది రవికి. స్కూలుకి రోజుకన్నా చాలా ముందు వచ్చేసాడు. స్కూల్లోకి అడుగు పెడుతున్న విజయ్‌కి ఎదురెళ్ళాడు.

"ఒరేయ్, మా కారియర్ దొరికింది - మా ఇందిర అత్తయ్య...." ఏదో ఉత్సాహంగా రవి చెప్తుంటే, వినిపించుకోకుండా ముందుకి నడిచాడు విజయ్.

పక్కన కూచుని "ఆ రోజు మా అమ్మ నిన్ను" చెప్పబోయాడు రవి. "సరేలే" విజయ్ నోట్సు రాసుకుంటూ తలెత్తలేదు.

"ఎలా దొరికిందిరా - మీ అమ్మ నన్ను దొంగ అందిగా" అంటూ ఏమీ అనకపోయేసరికి, రవికి భోరున ఏడ్వాలనిపించిది.

ఇంక ఈ విజయ్‌కి, నాకు స్నేహం ఉండదు. రవి పుస్తకంలో తల దాచుకున్నాడు.

యధాప్రకారంగా లంచ్ టైము అయింది. విజయ్ టిఫిన్ బాక్సు తెరిచాడు. రవి కారియర్ తెరవలేదు. కొన్ని నిముషాలు గడిచాయి.

'తిను' విజయ్ రవికేసి చూసాడు.

రవి మాట్లాడలేదు. విజయ్ మళ్ళీ మాట్లాడించలేదు. అంతే - లంచ్ బెల్ అయిపోయింది. ఎవరి చోట్లో వారు కూచున్నారు. విరిగిన గాజు ముక్కలు అతకడం కష్టం. ఆ రోజు నిండుగా ఉన్న కారియర్ వెనక్కి తీసుకెళ్ళాడు రంగయ్య! ఆకసాన హరివిల్లు విరిస్తే అది మా కేనని ఆనందించే పసి మనసుల్ని తేలిగ్గా దూరం చేసేయగల రాధారాణులెందరో మరి!! ఇదేం తెలుసు రవికి?!! ఆ రోజు నుంచీ 'లంచ్ బెల్' ఇద్దరినీ మరీ దూరం చేసింది.

స్కూలుకి వెళ్ళే టైమవుతుంటే యధాప్రకారం కారియర్ సర్దింది రాధారాణి. బుట్ట నిండుగా వుంది. పైన చిన్న అందమైన నాప్‌కిన్ కప్పింది. కాని ఆ కారియర్ స్కూలు ఆవరణతో అడుగు పెట్టే భాగ్యం ఆ నిముషంలోనే కోల్పోయింది.

వంటింట్లో కొచ్చాడు రవి, మూల దాచిన చిన్న టిఫిన్ బాక్సు తీసుకున్నాడు. శుభ్రంగా కడుక్కుని. నాలుగు పూరీలు దాంట్లో సర్దు

కున్నాడు. కాడ్‌బరీ చేత్తో పట్టుకుని నిలబడ్డ రాధారాణి కొడుకుని చూస్తూ,

"అదేమిటి" అంది ఆశ్చర్యంగా.

అంతే - "స్కూల్లో ఏం తినాలో నాకు తెలుసు మమ్మీ" చకచకా నడిచి ముందుకెళ్ళిపోతున్న కొడుకుని చూస్తూ అలానే నిలబడిపోయింది.

మూడు గిన్నెల కారియర్, ఫ్లాస్క్, యాపిల్, కాడ్‌బరీ - అన్నీ అన్నీ, బుట్టలోంచి తొంగి తొంగి తన్నే చూసి నవ్వుతున్నట్టనిపించిం దా క్షణంలో రాధారాణికి. పేవరులో ముఖం దాచుకుని ఉద్ధృతంగా ఏడుస్తుంటే, సోఫాలో కూలబడింది.

*

# చిగిర్చిన వసంతం

ఈరోజు తన పుట్టినరోజు. ఆ విషయం భోజనం వడ్డిస్తూ అతనితో అంది రాధారాణి. 'ఓహో అలాగా' అన్నాడతను.

తన ఉత్సాహం ఒక్కసారిగా నీరు కారిపోయింది. అతనెంతో వింతగా కనిపిస్తాడు తనకు. అతన్నర్థం చేసుకోలేదు తను.

తన పుట్టినరోజు పండగలా చేసుకోవటం అలవాటు తనకు. ఈ రోజు సినిమాకు వెడదామనీ, కొత్తచీర కొనుక్కోమని ఎన్నో అంటాడని ఆశించింది తను. కానీ, భోజనంచేసి వెళ్ళిపోయాడు అతను. తన మనసు ఒక్కసారి చిన్నబోయింది.

అతనికి ఇష్టం లేదులా వుంది - అతనికి ఇష్టంలేని సరదాలు తనకెందుకు? సరదాకి ఒక్కమాట అంటే తనకెంత గర్వంగా, సంతోషంగా ఉండేది! మాటలురాని వాడు కాదుకదా? ఇంతకీ అతనికి తనమీద ప్రేమలేదు అంతే.

పోస్టుమాన్ పడేసిన కవరులో గ్రీటింగ్ కార్డు పలకరించింది. అన్నయ్య మరచిపోలేదు ఈ రోజు. అన్నయ్య పెట్టిన నీలిరంగు జరీచీర పెట్టెలోనే వుంది. తనీరోజు ఎందుకు ఆ కొత్తచీర కట్టడం మానేయాలి? కానీ ఆ చీర అతనికిష్టమనేగా కొన్నది - ఈ రోజు ఆ చీర కడితే ఆనందించి, అభినందించే వ్యక్తి ఏడీ - తన భర్తకు తనమీద ప్రేమ లేదు! ప్రేమెరుగని జీవితంలో కూడా ఈ పెరుగుదల దేనికి?! జానకి చాల నిరాశగా, నిస్పృహగా ఆ గ్రీటింగ్ కార్డు బల్లమీద ఉంచి లేచింది -

అద్దం ముందు కూచుంది ఆమె.తన అన్నను, ఒదినను చూచింది. వాళ్ళ అనురాగాన్ని, అన్యోన్యతను చూచి మురిసిపోయింది——

ఇలా చాలా సేపు ఆలోచించాక, మెఱపులాటి ఆలోచన కలిగిందామెకు.

——నిజానికి అతని స్వభావమే ఇదేమో!!

ఇంట్లో కావలసిన వన్నీ చూస్తున్నాడు. తను చేసినవన్నీ తింటున్నాడు - తనను ఏనాడూ కొట్టలేదు, తిట్టలేదు .... తనే పొరబాటు పడుతున్నదేమో .... తనమీద ప్రేమలేదని ఎందు కనుకోవాలి?!

——సముద్రపు ఆటూ పోటూలా వుంది ఆమె మనసు. భార్యను ప్రేమించలేకపోవటం స్వభావమెట్లాగ? నిజంగానే అతనికి ప్రేమలేదు. ఆ రోజు అన్నయ్య ఇంటికి వెళ్ళినపుడు, నువ్వు లేకపోతే ఇల్లు చిన్నబోయింది. రమ్మ'ని వ్రాస్తాడనుకుంది. నువ్వు లేకపోతే బ్రతకలేను అనే వ్యక్తి కావాలని ఆమె కోరిక, ఆ కోరిక తీరనేలేదు.——

చివరకు తనే వచ్చేసింది, అలాంటి ఉత్తరం అతని దగ్గరనుంచి రాదని తెలిసి. ఈ విధంగా ఆమె ఆలోచనలు విపరీతంగా పెడత్రోవలు త్రొక్కి వెఱ్ఱితలలు వేసాయి. ఆమె ఆవేశం కట్టలు తెంచుకుంది.

తన బాధ ఒకరితో పంచుకుంటే కాని తనకు శాంతి ఉండదు. నా ఆవేదన ఎందుకు దాచుకోవాలి? శారద నా ప్రాణ స్నేహితురాలు.

ఉత్తరం పూర్తయింది. హృదయంలో ప్రతి ఒక్క-భావం, ఆవేశం, ఉత్తరంలో రూపం దాల్చి పరవళ్ళు త్రొక్కింది. అతనికి నేనంటే ప్రేమ లేదు .. అతను నా కర్థంకాడు....నా ఆశలు, ఆశయాలు అన్నీ చంపుకుని ఇలా అసంతృప్తితో ఎంతకాలం బ్రతకటం? ఈ జీవితం ఇలాగే మరుగున

పడి ప్రమగ్గిపోతుంది. ఓరోజు నువ్వే వింటావు- నీ స్నేహితురాలు ఆత్మ హత్య చేసుకుందని - ఈ ధోరణిలో జరిగింది ఉత్తరం ముందుకి.

గడియారం అతను వచ్చేవేళను చెప్పింది. ప్రాణంలేని ప్రతిమలా కూర్చునిపోయింది జానకి. తన ఉనికి గుర్తించి, తను లేకపోతే బ్రతకలేననే వ్యక్తి కావాలని కోరింది తను - కానీ....

అతను వచ్చేస్తాడు. ఆమె గబగబా లేచి ఉత్తరాన్ని గదిలో పరుపుకింద పడేసింది.

అతను ఆఫీసునించి వచ్చాడు. ఆమె కాఫీ తెచ్చి ఇచ్చింది. ఆమె ముఖంలోకి చూచాడు.

'అట్లావున్నావేమీ' అన్నాడతను. ఆమె మాట్లాడలేదు.

"తలనొప్పిగా వుందా" అన్నాడు.

అవును అంది ఆమె ఎటో చూస్తూ, అంతే!

పరుపుకింద దాచిఉంచిన ఉత్తరం ఒకసారి గుర్తొచ్చింది. ఎందుకో భయమేసింది. ఒక్కసారి మళ్ళా చదవాలనుకుంది. కానీ ఆ పరుపుకింద రోజూ ఉండే డైరీ ఆమెను ఎక్కువగా ఆకర్షించింది. అది రోజూ అక్కడే వుంటుంది. కానీ ఏనాడూ ఆమె దాన్ని చదవలేదు.

ఏముంటుంది దానిలో, అతనికి తనంటే వున్న అయిష్టతను పేజీల్లో నింపుకుని వుంటాడు. ఇతరులతో చెప్పకోడంకన్నా డైరీలో రాసుకుంటే బాగుంటుందేమో మరి! తనకన్నా తెలివైనవాడు - కవరు పక్కనపడేసి, డైరీ తిరగేయటం మొదలెట్టిందామె.

ఆవేశంలో పేజీలు బాగానే ముందుకు జరిగాయి. ఒక్క పేజీ మాత్రం ఆమె కళ్ళనుండి తప్పించుకుపోలేదు.

'రోజూకన్నా ఈరోజు బావుంది. రోజూకన్నా ఈరోజు బావున్నావు. నా కిష్టమని తెలిసినిలా వుంది నీలం జరీచీరా కట్టుకున్నావు. నాకు కవిత్వం మొస్తే, నీ అందాన్ని, నా అదృష్టాన్ని ఎన్ని పద్యాలలో రాసేవాణ్ణో!

నన్ను అమ్మ నీకు ఇచ్చేసింది ....' జానకి కళ్ళను నమ్మలేక పోయింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలచాయి. ఒక్క క్షణం ఆమె స్తంభించి పోయింది. ఆవేశంతో చదువుతున్న పేజీ సగంలో ఆపేసి మళ్ళీ వెనక్కు తిప్పింది పేజీలు. 'ఒక్కరోజు నువ్వు లేకపోతే నాకు గడవదు. ఇన్ని రోజులు మీ అన్నదగ్గర ఉండిపోతే నేనేమవాలి? నేనూ మీ అన్నయ్య ఇంటికి రావాలని అనుకున్నాను, ఒక్కడినీ ఉండలేక. కానీ మీరంతా నవ్వుతారని మానేశాను. నాకు తెలుసు నువ్వూ అక్కడ నేను లేకుండా ఉండలేవని' - బల్లమీద ఉంచి లేచింది.

అద్దం ముందు కూచుంది ఆమె. ఆమె రూపం ఆమెకే గర్వం కలిగించింది. పచ్చని ఒంటిమీద నీలం జరీచీర మహానప్పింది. తన పెద్ద కళ్ళు నొక్కుల జుట్టు.... ఇంత అందమయిన భార్య వున్నందుకు ఎంత గర్వపడాలి....కానీ జానకి ముఖంలో విషాద ఛాయలు క్రమ్ముకున్నాయి అంతలోనే.

ఆమె అద్దం ముందునించి లేచింది.

ఈ రోజయినా ఒక్క పది నిముషాలు ముందు ఇంటికి రాకూడదూ!

అతనికి తనమీద ప్రేమలేదు అసలు! అది నిజం!

ఆఫీసు నించి వచ్చి బూట్లు విప్పాడతను. కాఫీ తెచ్చి బల్లమీదుంచింది ఆమె. ఉత్తరాలు వచ్చాయా అన్నాడు అతను. గ్రీటింగ్ కార్డు చూపింది ఆమె. అతను చూసాడు అంతే. ఆమె మాట్లాడకుండా కాఫీ గ్లాసు తీసుకు వెళ్ళిపోయింది. వెనక్కు తిరిగిపోతున్న ఆమెను ఒక్కసారి చూసి పేపరు చదువుతూ కూర్చున్నాడతను.

ప్రేమించలేని వ్యక్తితో బ్రతకటమెలా? ఇష్టంలేకుండా చేశారేమో పెళ్ళి; అతని మనసు ఎవరికోసమో దాచుకున్నాడు, అందుకే తన ఉనికి గమనించినట్లుండడు, ఇక తన ఆశలు, ఆశయాలు చంపుకు బ్రతక వలసిందే తను.

తన బాధ ఒకరితో పంచుకుంటే కాని తనకు శాంతి ఉండదు తన బాధ గుండెల్లో దాచుకుని కృంగిపోవటం రాదు తనకి. ఇరుగుపొరుగులతో భర్తను గురించి చెప్పుకుని వాళ్ళ సానుభూతి పొందడం అవివేకమవుతుంది. జానకి అంతరాత్మలో వుండి, తనను పెంచి పెద్ద చేసిన అన్నయ్య ఒక్కసారి కళ్ళముందు నిలచాడు. అన్నయ్య మూర్తీభవించిన అనురాగం! తనను, తన ఆవేదనను గుర్తించి కడుపులో పెట్టుకోగల వాడు అన్నయ్య!

జానకి నాలుగు వాక్యాలు అన్నయ్యకు వ్రాసింది. కానీ, తనూ, తన భర్త అన్యోన్యంగా వున్నామని తలుచుకొని మురిసిపోతున్న అన్నయ్యకు, ఈ ఉత్తరం అగ్ని వర్షించిన మేఘమవుతుంది రాసిన కాగితం చించివేసింది జానకి.

శారదకు తనకు మధ్య రహస్యాలు లేవు. తనకు, చిన్ననాటి స్నేహితురాలు. ఎన్నో విశేషాలతో ఉత్తరాలు వ్రాస్తుంది ఈ రోజుకీ శారద. ఈ మధ్య వ్రాసిన ఉత్తరంలో, మీ ఆయన విశేషాలేమిటి అని వ్రాసింది—ఏం వ్రాయాలి, జానకి కళ్ళలో నీళ్ళు నిలచాయి. ఒక్కక్షణంలో ఆమె మనసులో ఆవేదన గోరంత. కొండంత అయింది.

తలనొప్పిగా వుందా అన్నాడు.

అవును, అంది ఆమె ఎటో చూస్తూ, అంతే!

అతను కాసేపు పేపరు చదివాడు మళ్ళా.

కాసేపు పక్కవాటా ఆయనతో రాజకీయాలు మాట్లాడాడు.

కాసేపు భోజనం చేసాడు.

కాసేపు వెన్నెట్లో చల్లగాలిలో పడుకున్నాడు.

అంతే.... కాసేపట్లో రాత్రి, తెల్లవారింది హాయిగా.

ఆమెకు!!?—

మనసు విరిగితే మళ్ళా అతకదంటారు. గాజు ముక్కలాటిది మనసు. మల్లెపూవు లాటిది మనసు. సున్నితంగా చూచుకోవాలి—

ఇంతకీ అతనికి తనమీద ప్రేమలేదు - కలత నిద్రలో తెల్లవారిందామెకు.

ఆ రోజు ఆదివారం. అతను భోజనం చేసి పుస్తకం చదువుకుంటూ నిద్రపోయాడు.

మూడు గంటలకి కాఫీ తాగి స్నేహితుడింటికి వెళ్ళిపోయాడు. ఆ రోజు ఆదివారం మరి! సెలవు దినం!

జానకి విసుగ్గా లేచి మంచం మీద పడుకుంది. ఆమెకు ప్రపంచం గాఢాంధకారంలా అనిపించింది. బ్రతుకు శూన్యంగా అనిపించింది. అంతలోనే మళ్ళ ఆ డైరీ తీసి పేజీలు తిప్పింది. "నాకు తెలుసు నువ్వూ అక్కడ నేను లేకుండా వుండలేవని "- జానకి ముఖం పాలిపోయింది. ఎవరో వీపుమీద చరచినట్లయింది.

ఆ సగం చదివిన పేజీ చదవటం మొదలెట్టింది.'నాకు పదిమందిలా మాటలు చెప్పటం రాదు, అది నా స్వభావం.... నువ్వు లేకపోతే ఒక్క

రోజు ఉండలేను....నీ పుట్టినరోజు రాని సంవత్సరం ఒక్కటీ నా కళ్ళ పడనీయకు జానకీ!—'

అది విచారమో, సంతోషమో చెప్పలేని స్థితికి వచ్చేసింది ఆమె. కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. ఏదో విజయగర్వం ఆమె కళ్ళళ్లో మెరిసింది.

అతనికి తనంటే అంత ప్రేమ ఉందా! తను లేకపోతే బ్రతకలేని వ్యక్తి ఒకడున్నాడీ ప్రపంచంలో తనకు! చాలు. అదిచాలు!! మేఘాలు పోయిన వినిర్మలాకాశంలా అయింది ఆమె మనసు. డైరీ పరుపు కింద దాస్తుంటే, ఆనాటి ఉత్తరం వెక్కిరించింది. జానకి ఒళ్ళు భయంతో ఒక్కసారి కంపించి పోయింది.

అతను ఆ ఉత్తరం చూసాడేమో! ఏమో!!

ముక్కముక్కలై నలిగి కింద పడింది ఉత్తరం.

గడియారం వంక చూసింది ఆమె. అతను వస్తాడిక........

ఏదో తెలియని ఆనందంతో ఆమె ఒళ్ళు పరవశించింది.

ఏదో తృప్తి ఆమె కళ్ళల్లో దాగి కూచుంది.

'అతనెంతో మంచివాడు నిజంగా' అనుకుంది అద్దంలోకి చూస్తూ, ఎవరు కాదన్నారు?— ఎదురు ప్రశ్న వెక్కిరించింది జానకి.

ఆమె బుగ్గల్లో సిగ్గు మొగ్గలు తొడిగింది. ఆమె అద్దంముందు నుంచి లేచింది. అలంకరణ పూర్తయింది.

రోజూలాగా అతడు ఆఫీసునించి వచ్చాడు.

ఆమె తలుపు తీసింది.

ఈ రోజు కొత్తగా కనిపించిందతనికి.

'ఎక్కడికైనా వెడుతున్నావా?' అన్నాడు ఆమెను చూస్తూ.

'లేదు' అంది నవ్వుతూ ఆమె.

ఆ నవ్వులో దాగివున్న అనంతార్థాలు అతనికేమి ఎరుక!

ఆ నవ్వులో చందమామ చోటు చేసుకున్నాడని అతనికేమి తెలుసు!

ఆ నవ్వు అమృతాన్ని గుమ్మరించిదని అతనెట్లా గ్రహించ గలడు? కానీ-

ఆమె నవ్వింది. అతనూ నవ్వాడు ఎందుకో!

అతడు పెదవి విప్పాడు'ఈ రోజు పోయిన బంగారం దొరికి నట్లుందే నీకు' అన్నాడు.ఆమె ముఖంలో హద్దులు దాటిన ఆనందాన్ని ఆస్వాదిస్తూ.

'అవును దొరికింది' - అతని కళ్ళల్లోకి చూస్తూ ఆమె నవ్వింది- చిగిర్చిన వసంతంలో కోటిమల్లెలు విరసినట్లు. *

# అయ్యగారికి దణ్ణం పెట్టు

రాజారావు ఈరోజు చాలా తీరిగ్గా వున్నాడు. ఈ మధ్యకాలంలో ఇంత శ్రద్ధగా పేపరు చదవలేదెప్పుడూ. మొదటి పేజీనుంచి చివరి పేజీ దాకా చదవటం అయిపోయింది .... ఇంకేం చేయాలీ! - పేపరు పక్కన పడేసి పైప్‌నోట్లో పెట్టుకున్నాడు - బెడ్‌రూములో వున్న అద్దం శుభ్రంగా నిగనిగలాడుతోంది - నిజంగానే తను అందంగా, ఠీవిగా వుంటాడు - రాజారావు అద్దంలోకి మరోసారి చూసుకున్నాడు. దట్టమైన మీసాలు సరి చేసుకున్నాడు. ఒత్తుగావున్న రింగురింగుల జుట్టు ముఖంపై పడకపోయినా, అలవాటుగా వెనక్కి తోసుకున్నాడు. చిత్రం ఏమిటో కాని, గొప్పజాత కుడు తను అని అందరూ అనుకోటం మాత్రం ఎక్కువైంది - అయినా తను ఎంత కష్టపడితే ఇంతవాడయ్యాడో ఎందరికి తెలుసు?!

ఇతరుల దయాధర్మాలపైన ఆధారపడి రోజూ ఒక రింట్లో తిండి తిన్నాడు కొన్నేళ్ళు. ఒకరు కొనిపెట్టిన పుస్తకాలు చదువుకున్నాడు, మరొకరు కట్టిన పరీక్షఫీజుతో పరీక్ష రాశాడు- ఆ రోజులు ఇప్పుడు తల్చు కోడు తను. తల్చుకుంటే భయం!! - నిజానికి తనకెన్ని భయాలుండేవి ఒకప్పుడు - పెళ్ళిచేసుకోవాలంటే, పెళ్ళాం పిల్లల్ని పోషించలేననే భయం, ఆరోగ్యం ఎందుకయినా పాడయితే డబ్బు ఖర్చుచేసి వైద్యం చేయించుకోలేనుకదా అని భయం, చుట్టాలు తనని హేళన చేస్తున్నారనే భయం, తన పాతబడ్డ చెప్పులు, వెలిసిపోయిన చొక్కాలు చూసి అమ్మాయిలు నవ్వుతున్నారనే భయం....అబ్బో! ఎన్నెన్ని భయాలను తట్టుకు తను నిలబడ్డాడూ?!—

రాజారావు అలా అద్దంలో చూసుకుంటుండగానే - భయం, బాబోయ్-నల్లని జుట్టులో ఎక్కడో రెండు తెల్లవెంట్రుకలు మెరిసాయి - తక్కున పీకిపారేశాడు. రాజారావుకి ఒక్కసారి నవ్వొచ్చింది. ఫోను మోగింది - 'హలో, ఆ - మరిచిపోలేదు. సాయంత్రం పంపించేస్తాను' - రిసీవర్ పెట్టేశాడు....ఓ సాంస్కృతిక సంస్థకి పదివేలు విరాళం ఇస్తా నన్నాడు తను - అదీ ఆ ఫోను!! - రాజారావు ఎన్నో సంస్థలలో జీవిత సభ్యుడు....కొన్నిటికి పోషకుడు - ఎందరికో,ఎన్నో సందర్భాలలో డబ్బు సాయం ఏదో విధంగా చేస్తూనే వుంటాడు - తనని చూసుకుని తనే గర్వ పడే సంఘటనలు ఎన్నో తన జీవితంలో - అన్నిటికీ మూలం డబ్బేనా?! ఆ, ఖచ్చితంగా - రాజారావు నోట్లో వున్న పైపు పక్కన పెట్టాడు.

''ఊఁ, రా - ఏమిటి సంగతి" ఎదురుగా వున్న నవీన్‌వైపు చూస్తూ అన్నాడు.

"డాడీ - " - అలా తండ్రి గదిలోకి వచ్చి, తండ్రితో ఏదైనా చెప్పటం, తండ్రిని అడగటం చాలా తక్కువసార్లు చేస్తాడు ఆ అబ్బాయి.

"కారులో పెట్రోలుకి డబ్బు-" నసిగాడు నూనుగు మీసాల నవీన్, రాజారావు ఏకైక కుమారుడు.

"అమ్మనడిగి తీసుకో-"

"అమ్మ నిద్రపోతోంది-"

"లేస్తుందిగా, వెయిట్ చెయ్యి-"

నవీన్ వెంటనే వెళ్ళిపోయాడు గదిలోనించి.

నల్లటిమీసాలు, గుండ్రటి బుగ్గలు, ముద్దుగా, బొద్దుగా వున్నాడు అబ్బాయి. రాజారావు ఆ అబ్బాయి వెళ్ళినవైపే చూస్తున్నాడు - కారు, పెట్రోలు - పాకెట్‌మనీ, - ఐదువందలు ఖరీదుచేసే చొక్కా, వెయ్యి

రూపాయిల పాంటు - ఇంకా-ఏమేమిటో, - "ఈ బెల్టు" ఎంతరా, నవీన్? ఓ రోజు అడిగాడు, 'మూడువందల యాభై' అన్నాడు అబ్బాయి. అది గుర్తొచ్చింది రాజారావుకి ఇప్పుడు - మూడువందల యాభై రూపాయలతో తను ఎన్నెన్ని నెలలు గడిపాడు!! మూడువందల యాభై రూపాయలతో తను కొత్త సంసారం పెట్టుకున్నాడు కాదూ - మూడువందల యాభై రూపాయల బెల్టు తన కొడుకు కొనుక్కున్నాడు ఈ రోజు - రాజారావుకి ఒక్కసారి అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు తిరిగాయి - ఇప్పుడు తన జాతకం తిరిగిందని, తను గొప్పవాడనీ సంఘం అంటోంది - నిజమే!! తన సంపాదనపై ఎంతమంది ఆధారపడ్డారో తెల్సుకుంటే ఆనందమే కాదు, గర్వంగా లేదూ?!

"మీ చేత్తో బోణీ చేయండి సార్" అంటాడు దణ్ణం పెట్టి పాన్ దుకాణం తెరుస్తున్న వెంకటయ్య. దణ్ణం పెట్టడం ఆలస్యం, తను జేబు లోంచి డబ్బు తీసిస్తాడు.

"మీ పేరే మొదట రాస్తాం సార్, మీరెక్కువ చందా యివ్వాలి" - దణ్ణంపెట్టి, పుస్తకం ముందు పెడతాడు దసరానవరాత్రులు జరిపే లీడరు రాజయ్య. వెంటనే తను చెక్కు రాసి యిచ్చేస్తాడు.

ఇంతెందుకు, నాలుగురోజులనాడు "నాన్నగారి కాళ్ళకి దణ్ణం పెట్టు" అంది ఇందిర నవీన్ పుట్టినరోజునాడు. వంగి దణ్ణం పెట్టడం ఇష్టంలేదు అబ్బాయికి. పాంటు నలిగిపోతుంది మరి!

రెండు రోజులనాడు, బోనాల పండుగనాడు, "అయ్య కాలికి మొక్కు" నాలుగేళ్ళ పిల్లని పాదాలపై పడేసింది బాలమ్మ, పనిమనిషి.

ఈ దణ్ణాలలో ఇంత ఆనందం వుందా?! వుండేవుంటుంది - లేక పోతే, - రాజారావు మెదడులో ఉన్నట్టుండి ఒక మెరుపు మెరిసినట్ట యింది - పెదాలపై చిన్న నవ్వు విరిసింది - అవును, ఎందరో నాకు దణ్ణం

పెట్టాలి - ఎందుకు పెట్టరూ - పెడతారు - అలాటి వాళ్ళుండబట్టే ఇలాటి తను గొప్పవాడయిపోయాడు - రాజారావు గుండెల్లో గర్వం ఒక్క నిమిషంలో నిండిపోయింది - సంపాదిస్తున్నాడు తను!! విపరీతంగా, అతిగా, పిచ్చిగా - అవును, తనకి ఎందుకు దణ్ణం పెట్టరూ!! - రాజారావు పడగ్గదిలోంచి బయటకొచ్చాడు - అప్పుడే ఆ గదిలోకొస్తోంది ఇందిర. "ఇందూ"....ఎంతో ఆప్యాయంగా అన్నాడు.

"ఉండండి - అసలే టైము అయిపోయింది" - ఇందిర లిప్‌స్టిక్ టచ్ చేసుకుంటోంది.

"ఈరోజు ఎక్కడికీ వెళ్ళద్దు ఇందూ - హాయిగా ఇంట్లో కబుర్లు చెప్పుకుందాం" - రాజారావు ఇందిర చీరకొంగు చేత్తో పట్టుకున్నాడు.

"వెంకటగిరి చీర - ఊరికే నలిగిపోతుంది - ప్లీజ్ - మీరు కూడ రండి, ఫిలిమ్ ఫెస్టివల్‌కి" - ఇందిర సిగపిన్నులు సరిచేసుకుంటూ అంది.

"ఈరోజు మానేయ్"-

ఇందిర రాజారావు కౌగిలి వదిలించుకుంది. కదలిపోతున్న కారు కేసి చూస్తూ, బాల్కనీలో నిలబడ్డాడు రాజారావు.

ఇందిర - పదోక్లాసు పాసుకాలేదు - కేవలం అందంగా వుందని తను అడిగి మరీ పెళ్ళి చేసుకున్నాడు. ఇందిర తండ్రి బట్టలకొట్లో పద్దు రాసేవాడు. రెండు గదుల ఇంట్లో కాపురముండేవాడు - ఆ ఇందిరేనా ఈ ఇందిర! - కారులేకపోతే కూరలు కొనటానికి వెళ్ళదు - ఏరోజూ ఐదారువందలు తక్కువ కాని చీర తప్ప మరోటి కట్టదు - కాలం ఎంత చిత్రమైందో! - రాజారావు ఇరవై యేళ్ళనాటి గతంలోకి పూర్తిగా వెళ్ళి

పోయాడు - ఆ బాల్కనీలో అలానే నిలబడ్డాడు - ఎంతోసేపు - ఎంత సేపో! గడియారం పదకొండు గంటలు కొట్టింది - ఎండగానే వుంది బయట.

సందుచివర పిల్లలందరూ మూగి ఏదో అల్లరి చేస్తున్నారు - కోతి పిల్లని ఆడిస్తున్నారు - పిల్లలు కోతిపిల్లచుట్టు మూగారు. "అయ్యగారికి దణ్ణంపెట్టు" అరుస్తున్నాడు కోతి యజమాని. దణ్ణాలు పెడుతోంది. పైసలు వాడు ఏరుకుంటున్నాడు - పల్లీలు, బిస్కట్లు, జామకాయలు కోతిపిల్లపైకి విసురుతున్నారు పిల్లలు. కోతి గబగబా ఏరుకుతింటోంది-

రాజారావు చూస్తున్నాడు....'అయ్యగారికి దణ్ణంపెట్టు' పైకి చూసి అన్నాడు కోతి యజమాని.

'పైకి తీసుకురా'-

ఆమాట అనటమే ఆలస్యంగా మెట్లమీద నుంచి పైకి వచ్చాడు కోతి యజమాని వీరాసామి.

"కిందయితే బాగా ఆడుతుందయ్యా" అన్నాడు. 'ఫరవాలేదులే - ఇక్కడే ఆడించు' - రాజారావు కోతి పిల్లవంకే చూస్తున్నాడు.

అయ్యగారికి మళ్ళీ మళ్ళీ దణ్ణం పెట్టింది కోతిపిల్ల. కర్ర భుజాన వేసుకుని గొడ్డుకాసింది. మొగ్గలేసింది. వీరాసామి భుజమెక్కి కూచుని తలలో పేలు తీసింది. రాజారావుకి చాలా నవ్వొచ్చింది- ఎన్ని ఆటలు చేస్తుందో.

వీరాసామి వంక చూసాడు రాజారావు - మాసిపోయిన గడ్డం, లోతుకుపోయిన కళ్ళు, మాసిపోయిన చొక్కా....

వీడు దీన్ని పోషిస్తున్నాడా?!

దాని సంపాదనంతా అది తింటుందా? దాని కడుపునిండాక, అంతా వీడికేనా - దాని సంపాదన వెనక స్వార్థం, అహం, గర్వం ఇవేమైనా

వున్నాయా!! - రాజారావు జేబులోంచి డబ్బు తీసి వీరాసామి చేతిలో పెట్టాడు. అయ్యగారికి దణ్ణం పెట్టింది కోతిపిల్ల. వీరాసామి వంగి వంగి దణ్ణాలు పెట్టాడు.

ఎండ చాలా తీక్షణంగా వుంది. రాజారావు అన్నాడు:

''ఈరోజు ఇంక ఎక్కడా తిరగకు - చాలా ఎండగా వుంది - ఆ మెట్లగదిలో పడుకో - ఇది వుంచుకో'' - వీరాసామి నోటు చూసి విస్తుపోతూ, మెట్లగదిలోకి కోతిపిల్లతో వెళ్ళిపోయాడు.

తన డబ్బుకోసం తనని ప్రేమించేవాళ్ళు, గౌరవించేవాళ్ళు, అభిమానించేవాళ్ళు, బెదిరించేవాళ్ళు ఎందరో వున్నారు....ఈ వృద్ధుడు వీరాసామి ఈ కోతిపిల్లనాడిస్తూ ఎంతకాలం పొట్ట పోషించుకుంటాడు? తనే వాడికి, వాడి కోతిపిల్లకి కూడా తిండిపెట్టగలడు, వసతి యియ్యగలడు, ఒక ప్రాణి తన డబ్బువలన నిజంగా సంతోషపడితే తనకు ఎంత తృప్తి!! - రాజారావు మనసులో నిశ్చయించుకున్నాడు,

ఈ వీరాసామిని ఇక్కడే వుండమంటాను .... అంతేకాదు, ఊరికే అన్నం పెడతాను, బట్టలిస్తాను, కావాలంటే ఆ చిన్న గదిలో ఫాను బిగిస్తాను....చల్లని మంచి నీళ్ళకి ఏర్పాటు చేస్తాను. అన్నీ ఊరికేనే! మంచి భోజనం, మంచి వసతి .... ఇంకేం కావాలి ఎవరికైనా .... అయినా ఎవరిస్తారు వాడికి గది ఊరికే, తను కనక ఇస్తానంటున్నాడు....అయితే ఒక్క షరతు పెడతాను ... ఆ కోతిపిల్లని తన కోసమే ఆడించాలి. ఎక్కడా తిప్పకూడదు. ఎవరింటికీ తీసికెళ్ళకూడదు .... నా డబ్బు .... నా కోతి.... వీరాసామి ఒప్పుకుంటాడు.... ఎవడికోసం ఒప్పుకుంటాడు డబ్బు!డబ్బు!! రాజారావు భోజనం చేయటానికి కిందికి దిగాడు.

వీరాసామి కోతిపిల్లని గుండెపై పడుకోబెట్టుకుని హాయిగా నిద్రపోయాడు ఓ అరగంట. ఠక్కున మెలకువ వచ్చింది....ఇలా నిద్రపోతే ఎలా?! నాలుగు డబ్బులు సంపాదించుకుని సాయంత్రానికి ఇల్లు చేరితే

కదా.... నాకు, నా ముసల్దానికి, ఈ నా చిన్న భీమునికి గంజినీళ్ళు.... అయినా ఈ గొప్పోళ్ళ ఇళ్ళు నాకొద్దు....ఎండ అయితేనేం....ఎండ నన్నేం చేస్తుందీ.... రేపట్నుంచీ ఈ యజమాని నన్ను ఇక్కడే వుండమంటే.... అమ్మ బాబోయ్! నాకది.... దానికి నేను.... చాలు, భగవంతుడి దయ చాలు.... వీరాసామి అలాఅనుకుంటూ లేచేసరికి, పళ్ళికిలిస్తూ సంచీలోంచి జామపండు తీస్తోంది కోతిపిల్ల. వీరాసామి సంచీ భుజాన వేసుకున్నాడు. కోతిపిల్ల చేయిపట్టుకు, రోడ్డుమీద ఎండలో నడక సాగించాడు. ఏభై రూపాయలనోటు గూట్లోనే పెట్టాడు వీరాసామి!

రాజారావు నిశ్చయించుకున్నాడు, వీరాసామిని, కోతిని తన మెట్లగదిలో వుంచేయాలని. కోతికి ఎర్రటి సాటిన్ బట్టతో చొక్కా కుట్టించాలని రెండు చొక్కాలు, పంచలు వెంటనే వీరాసామికి కొనాలని. అయితే ఒక్క విషయం మొహమాటం లేకుండా చెప్పేయ్యాలని. ..అదే, కోతిపిల్ల ఎక్కడికీ వెళ్ళకూడదు, ఎక్కడా దాన్ని ఆడించకూడదు.... తను అడిగినప్పుడు ఆడించాలి. ఈ మాట వీరాసామికి ఇప్పుడే చెప్పేస్తా! రాజారావు అనుకుంటూ మెట్లగదిలో కొచ్చాడు. ఖాళీగావున్న మెట్లగదిని చూసి క్షణం విస్తుపోయాడు. "నువ్వు ఏదో ఆశించి యిచ్చే ఏ ఒక్కరూపాయికి ప్రతిఫలం వుంటుందని ఎప్పుడూ అనుకోకు.... ఆశించకుండా ఇస్తేనే ఆనందం వుంటుంది''.... ఎప్పటి మాటలో ఇవి- ఆనాడు, వారాల అబ్బాయిగా భోజనం చేస్తుంటే, రామం మేష్టారన్న మాటలు గుండెల్లో ప్రతిధ్వనించాయి రాజారావుకి. గూట్లోంచి ఏభైరూపాయల నోటు గాలికి కొట్టుకొచ్చి రాజారావు పాదాల ముందు పడింది.

''అయ్యగారికి దణ్ణం పెట్టు''.... సందు చివర వీరాసామి గొంతు మారుమ్రోగుతుంటే, గబగబా మెట్లెక్కి బాల్కనీలో నిలబడి వీధి వంక చూస్తున్నాడు రాజారావు.

*

# మనసుతీరని మాతృత్వం

శారద ఎంతసేపని అలా ఆ గదిలో కూచోగలదు? నూతి దగ్గర వనుంది. దొడ్డిగుమ్మంలో పని చూసుకోవాలి. బట్టలు ఆరవేయాలి.

అతను అలాగే చూస్తున్నాడు కన్నార్పకుండా!

ఇది ఈరోజు విషయం కాదు. ఇప్పటికి వారం రోజులుగా అనుభవిస్తోంది శారద.

అతను ఇంటివాళ్ళబ్బాయి స్నేహితుడు. ఆ గదిలోకి అద్దెకు వచ్చాడు. శారద నూతిదగ్గర ఏ పనికి వెళ్ళాలన్నా అతని గది ముందు నుంచే వెళ్ళాలి. అతనక్కడున్నాడని తప్పించుకు తిరగటమెట్లా? అయినా ఎందుకు తిరగాలి?

అసలా చూపేమిటి, ఏదో వెతుక్కుంటున్నట్లు! చిన్నవాడే అయినా పోకిరి వేషాలు!! - శారద గది తలుపు దభీమని వేసి వచ్చింది లోపలికి.

ఆవేశంలో, కోపంలో ఎన్నో చేయాలనుకుంటాం , కానీ చివరికి ఒక్కటీ కార్యరూపం దాల్చదు.అంతే! తప్పు చేసిన దానిలా వెనక్కితిరిగి వచ్చేసింది శారద.

'ఛీ, దిక్కుమాలిన తిరుగుడు ఉద్యోగం, నెలకు ఇరవై రోజులు కొంపలోనే వుండరు'- భర్త చేస్తున్న 'టూరు' ఉద్యోగం, నెలలో ఇరవై రోజులు తన ఒంటరితనం, శూన్యంగా ఉండే ఆ యిల్లు - ఏమిటో అన్నీ ఒక్కసారి ఆమె మనసుని కలచివైచాయి. ఆమె కళ్ళల్లో నీరు నిండింది. కాని, అతని-చూపు, ఆమె కళ్ళముందు నుంచి కదలనే లేదు.

ఆయన రాగానే ఆ అబ్బాయి సంగతి చెప్పాలి. వీలయితే ఆ గది ఖాళీ చేయించాలి!

రామారావు భోజనం పూర్తి చేశాడు. తువ్వాలుతో చేయి తుడుచుకుంటూ ఆ గదిలోకి వెళ్ళాడు.

వాణ్ణి పలకరించి రాకపోతే యేమి శారద ననుకుంటూ, పళ్ళు కొరుక్కుంటూ, కోపంగా పనంతా పూర్తి చేసేసింది.

'అతను ఉద్యోగ ప్రయత్నాలు చేస్తున్నాడట .... పాపం, దొరికితే బావుండు. కుర్రాడు' రామారావు పొద్దుటి పేపరు తిరగేస్తూ అన్నాడు.

రోజూ కన్నా ముందే తెల్లవారింది ఆ రోజు శారదకి .... అతను వస్తాడు.... కాఫీ తాగుతూ దిక్కులు చూస్తాడు.... తనకేసి చూస్తూ కప్పు క్రింద పడేస్తాడు.... నేను అతని వికారపు చేష్టలు తెలిసీ కూడ, పొరపాటు లాగ అనుకొంటూ, ఆ విరిగిన కప్పు ముక్కల్ని జాగ్రత్తగా, మళ్ళా ఆ అబ్బాయి కాలికి గ్రుచ్చుకోకుండా ఎత్తి పారెయ్యాలి. మళ్ళా ఇంకో కప్పు కాఫీ అతని బల్లముందుంచాలి. అబ్బ,ఇంతకన్నా కఠిన శిక్ష ఇంకేం కావాలి తనకు! పాలు కుంపట్లో పొంగిపోర్లాయి.

'అరే ... అతన్నిరమ్మన్నాను కదూ, ప్రొద్దున్నే లేపద్దూ నన్ను....' రామారావు పడక గదిలోంచి బయటకొచ్చాడు.

అతను కుర్చీలో పెద్ద మనిషిలా కూర్చున్నాడు. కాఫీ ఫలహారం మొహమాటం లేకుండా పూర్తిగా తీసుకున్నాడు. శారద ఒళ్ళు భగ, భగ మండిపోయింది.... ఎందుకా నటన!

ఇంతకీ ఆ చూపుకి అర్థమేమిటో!

'తనని ప్రేయసిగా ఊహించుకొని కలలు కనటం లేదుకదా ఈ అబ్బాయి-' శారదకి నవ్వొచ్చింది తన ఆలోచనకి, ఎందుకయినా మంచిదని అబ్బాయి వినేలా 'రాత్రికి ఈయన వస్తే బావుండు .... నాకు జ్వరం తగిలింది కూడాను' అంది కొంచెం గట్టిగానే—

కానీ ఆ మాట విని కూడ ఆ అబ్బాయి నూతి దగ్గర కొచ్చిన శారద కేసి చూడటం మాననేలేదు!

చివరకు ఒక నిర్ణయానికి వచ్చింది శారద. ఈమాటు అతనలా చూస్తున్నపుడు తనే వెళ్ళి పలకరిస్తే సరి. తప్పేముంది? అతనిని ఎలా పలకరించాలో, ఏమేమి ప్రశ్నించాలో అన్నీ ఒకటికి నాలుగుసార్లు రిహార్సల్ వేసుకుమరీ గుమ్మం ముందుకు వెళ్ళింది శారద.

అనుకోకుండా ఆ రాత్రే వచ్చాడు రామారావు. శారదకి కొండంత బలం వచ్చింది. భోజనం చేసిన తర్వాత అసలువిషయం చెప్పడానికి నిశ్చయించుకొంది శారచ.

'పక్క గదిలో....ఆ అబ్బాయి చదువుకుంటున్నాడు కూచుని. బుద్ధిమంతుడిలా వున్నాడు....' అన్నాడు రామారావు భోజనానికి కూచుంటూ.

శారద ఉలిక్కిపడింది.

'ఆ(....' పరాకుగా అంది.

'అచ్చు మా రాజులాగ వున్నాడు.'

'ఎవరూ—'

'మా పెద్దనాన్న కొడుకు రాజు లేడూ అచ్చంగా ఆ పోలికలో ఉన్నాడు యీ కుర్రాడు' అన్నాడు రామారావు.

'ఏమో....నాకే పోలికా కనిపించడంలేదు' శారద ఏదో విసుగ్గా అంది.

"పాపం - మంచి ఉద్యోగం యిప్పించాలి" రామారావు మళ్ళా అన్నాడు.

'అంత జాలెందుకు. మరిప్పించండి పోనీ' లోపల కోపాన్ని దిగ మింగుకుంటూ అంది శారద.

'తప్పకుండా....ఆ సంగతి అతనితో చెప్పా కూడ' శారద గుండె ఆగినంత పనయింది. దీర్ఘంగా నిట్టూర్చింది చేసేది లేక.

'అసలు విషయం....రేపు పొద్దున్న అతన్ని కాఫీకి రమ్మన్నాను' రామారావు నెమ్మదిగా శారద కేసి చూస్తూ ఆవులిస్తూ అన్నాడు.

శారదకు నిజంగానే ఏడుపొచ్చింది. తనకు ఇష్టంలేని వ్యక్తికి, తను అసహ్యించుకుంటున వ్యక్తికి తెల్లవారేసరికి కాఫీ, టిపిన్ తయారు చేసి యివ్వాలి. చేయను అనే స్వతంత్రం లేదు తనకు! ఛీ ఆడబ్రతుకు!! తను పూర్తిగా ఓడిపోయినట్లు నిస్పృహతో నీరసంగా నిద్రపోయింది శారద ఆ రాత్రి. తెల్లవారింది. అతను రామారావుతో మాట్లాడి.

''థాంక్యూ....' నవ్వుతూ మెట్లు దిగాడు

'విషపునవ్వు'—శారద గట్టిగా మనసులో తిట్టుకుంది.

రామారావుని గడియారం తొందర పెట్టింది. రెండు మెతుకులు నోట్లో వేసుకొని ఆఫీసుకి వెళ్ళిపోయాడు ఇల్లంతా ఖాళీగా వుంది ఎందుకో! ఆ గదిలో అతను.... ఈ గదిలో శారద!

నాలుగు నెలల క్రితం సగం అల్లి ఆపిన స్వెట్టరు బయటికి తీసింది శారద. ఆలోచనలతో ఆవేదనతో అల్లిక ముందుకు జరుగలేదు. స్వెట్టరు అక్కడే వదిలేసి నిద్ర కుపక్రమిద్దా మనుకుంది శారద.

వీధి తలుపు చప్పుడైంది.

అతను!

శారద కొయ్యబారిపోయింది.

క్షణంలో ధైర్యాన్ని గాంభీర్యాన్ని తెచ్చుకొని 'రండి లోపలకు' అంది గుమ్మం తలుపు తీస్తూ. అతను లోపల కొచ్చాడు.

'నేను వెళ్ళిపోతున్నాను .... నాకు చిన్న ఉద్యోగం ఉందని రమ్మని మా స్నేహితుడు వైర్ చేశాడు ... ఆయనతో చెప్పండి' అన్నాడు .... అతను తల దించుకునే మాట్లాడుతున్నాడు. అదేమిటి! శారద కీమాటు నవ్వొచ్చింది....ఎందుకో జాలేసింది!

'మీ అమ్మగారు ఎక్కడున్నారు' అంది శారద నిశ్శబ్దం భరించలేక.

అతను ఒక్కసారి ఆమె ముఖంలోకి భయంగా చూచాడు. ఒక్క క్షణం ఆగి అన్నాడు:

'దగ్గర ఊళ్ళోనే .... మిమ్మల్ని చూస్తే మా అమ్మ గుర్తొస్తుంది. మా అమ్మ మీలాగే వుంటుంది.కానీ ఆవిడ హృదయం....' అతని కళ్ళు చెమర్చాయి - అతను తన తల్లిని గురించి ఏదో ఏదో చెప్పాడు.... ఎన్నో సంగతులు.... అతనికీ, అమ్మకీ పడదు. అందుకే ఇంట్లోంచి వచ్చేశాడు. 'చేతనయితే బ్రతుకుతాను. లేకపోతే ...' అతని కళ్ళలో నీళ్లు నిలిచాయి.

శారద అతని ముఖంలోకి చూడలేకపోయింది.

అతను నెమ్మదిగా మెట్లు దిగి వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

మమతెరుగని మనసులా....

అర్థంలేని ఆలోచనలా....

శూన్యంగా, వికారంగా, వెక్కిరింపుగా, విసుగ్గా వుంది ఆ రోజు సాయంత్రం శారదకి.

అతని మాటలు నెమరువేసుకొంది శారద. అతనన్నాడు—తనలో తల్లి పోలికలున్నాయని... పోలిక లేనా, హృదయంకూడ అంతేనేమోనని భయపడ్డానన్నాడు.

నిజమే. అతని మనసు ఎంతగా గాయపడకపోతే తల్లినుండి దూరంగా వచ్చేస్తాడు!!

మనిషినిపోలిన మనుష్యులుంటారు! .... హృదయాన్ని పోలిన హృదయాలుంటాయేమో మరి!

అతనన్నాడు 'మీరే చెప్పండి. మీకూ ఉన్నారుగా పిల్లలు—మీరూ తల్లిగదా!!' అని నా ఇంట్లో వున్న రఘు నా పిల్లాడానుకుంటున్నాడా!!...

తనా చెప్పడం!!

తనేమీ చెప్పకుండా అతను ప్రశ్నించినపుడు నీళ్ళునిండిన కళ్ళను అతను చూడకుండా పమిటతో ఒత్తుకొంది!! తనకా అదృష్టమేది!

అతని ముఖం చూడలేకపోయింది.

ఏదో తప్పు చేసినట్లు,

పాపం అనుభవిస్తున్నట్లు,

ఏదో పోగొట్టుకొన్నట్లు,

అలాగే శిలలా నిలబడింది శారద. అతను పోతున్నదిక్కే చూస్తూ!

అతని చూపుకి - అర్థం పూర్తిగా తెలిసింది....

కానీ,

అతనికి మావారు ఉద్యోగం పొద్దున్నే ఇప్పిస్తే ఎంత బావుండేది.... అతను ఈ ఇంట్లోనే ఉండిపోతే....ఉండిపోతే,ఈ ఇంటికి పెద్దకొడుకులా, ప్రేమగా, గారాబంగా, గౌరవంగా చూసుకోదూ తను!!....

శారద ఒక్కసారి వెనక్కి తిరిగి ఆ గది గుమ్మం ముందు నిల్చుంది. అతను వదలి వెళ్ళిన గది శూన్యంగా వెక్కిరించింది శారదను....

నీళ్ళునిండిన కళ్ళతో, మనసుతీరని మాతృత్వాన్ని తల్చుకొంటూ అక్కడే ఆ గది మెట్లమీదే కూలబడింది శారద *

# నిద్రించిన వెన్నెల

ఎండ కన్నెరుగని ఇంద్రుని ఇల్లాలు లాటి శశి ఒక్కసారి ఉలిక్కి పడింది. చేతిలోవున్న నవల ఖంగారులో కిందపడింది. గబుక్కున తీసి గాద్రెజ్‌లో చీరల మధ్య దాచేసింది. నవలలు చదివి పాడయిపోతారు ఆడవాళ్ళు అనే అభిప్రాయమున్న చాలామందిలో మొదటివాడు రాజేంద్ర.

అందుకే అతని అభిప్రాయం పొరబాటని చెప్పి ఒప్పించే ధైర్యం లేని శశి ఈ మధ్య రహస్యంగా నవలలు చదవటం మొదలెట్టింది.

*　　　*　　　*

ఆ వినిపిస్తున్న గొంతు బాగా పరిచయమున్నదే - శశి ఆ గది లోంచి డైనింగ్ టేబులు దగ్గర కొచ్చింది. అలా ఆవిడ రావడమే ఆలస్యం. గ్లాసుతో నీళ్ళు తెచ్చి బల్లమీదుంచటం రాములు అలవాటు అక్కడనుంచి డ్రస్సింగ్ టేబులు దగ్గర కొచ్చింది.. లిప్‌స్టిక్ పెదాలకు టచ్ చేసుకుంది ఒక్కసారి క్రీమ్ రాసుకుంది. అలంకరణ మళ్ళీ మళ్ళీ అద్దంలో చూసుకుంది. చెవులకున్న వజ్రాలదుద్దులు, ఒంటి నున్న ఖరీదయిన చీర, ఆరోగ్యంగా నిగనిగలాడుతున్న ఒళ్ళు, శశికి ఓ నిమిషం నవ్వొచ్చింది. ఈ బెడ్‌రూము, ఈ భవనం, ఆ తోట, ఓ-ఇది ఇంద్రభోగమే! అందులో తను - తను అసూర్యంపశ్య. శశి మళ్ళా ఓసారి అద్దంలోకి చూసుకుంది.

తలుపు తోసుకుని లోపలకొచ్చాడు రాజేంద్ర.

"నీకు తెలుసుగానే వచ్చి చాలా సేపయిందని."

"ఆ"

"మరి"

"ఇంకెవరిగొంతో కూడా వినిపిస్తోంది...." నెమ్మదిగా అంది బ్రోచ్ సరిచేసుకుంటూ.

"అందుకే-నిన్ను పరిచయం చేస్తాను."

రాజేంద్ర ముందు నడుస్తుంటే వెనకాతలే వెళ్ళింది శశి.

"నా మిసెస్ శశి."

శశి నమస్కారం చేసింది. ఒక్క నిముషం మతిపోయింది. మరొక్క క్షణంలో అక్కడనుంచి కదిలింది. అది అంతే. రాజేంద్రకి రకరకాల స్నేహితులు, రకరకాల పరిచయాలు. శశి కనిపించి నమస్కారం పెట్టి లోపల కొచ్చాయాలంతే-అక్కడ నుంచోకూడదు-వెనక్కి తిరిగి చూడకూడదు - తెలుసున్నా ఆప్యాయంగా పలకరించకూడదు. ఆ తర్వాత కూడా ఎప్పుడూ పరిచయం చేసిన వాళ్ళ గురించి అడక్కూడదు, మాట్లాడకూడదు. ఆ ఇల్లాలిని, ఇంటిని రాజేంద్ర పాలిస్తున్న విధమది. అందులో మార్పు రాకూడదు! రాదు!!

*　　　*　　　*

కానీ ఈ రోజు లోపలకొచ్చి మంచం మీద వాలిపోయిన శశికి కన్నీళ్ళు ఆగలేదు- ఈ రోజు ఇతను తనకి చాలా ఆత్మీయుడు. బాగున్నావా అని పలకరించడానికి, నీ భార్య. పిల్లలు ఎలా ఉన్నారూ అనడానికి కూడా స్వతంత్రంలేని తన బతుకెందుకూ?

రాజు, శశి ఎనిమిదో క్లాసునించి బి. ఎ. దాకా చదువుకున్నారు. కాలేజీ బ్యూటీ శశి. ఎందరో ప్రేమలేఖలు రాయటం, రాయబారాలు పంపటం ఎన్నిసార్లు జరిగిందో చెప్పటం కష్టం. అవేవీ ఏనాడూ లెక్క

పెట్టలేదు శశి. అన్నిటికన్నా శశి మనసుని అకట్టుకొన్నది ఆ రోజు నోట్సు పుస్తకంలో రాసి రాజు యిచ్చిన రెండు వాక్యాలు.

"అందంగా వుంటే మాత్రమే చాలదు - అందంగా వుండే మనసుని అందుకోటం జీవితంలో ముఖ్యం."

ఆ రోజు ఆ వాక్యాలు చదివి నవ్వేసి "ఏమిటి ఈ నాన్‌సెన్స్" అంది.

"అది అంతేలే" అన్నాడు రాజు నవ్వుతూనే.

"ఎందరిలాగో నువ్వూ ఓ ప్రేమలేఖ రాయక ఏమిటిది" అంది చక్రాల్లాంటి కళ్ళు వయ్యారంగా తిప్పుతూ.

"నీతో ఎవరు మాట్లాడినా నిన్ను ప్రేమిస్తున్నారనే అనుకుంటు న్నావా-నీకో విషయం చెప్పనా"-రాజు ఆ మాటంటూ సిగ్గుపడ్డాడు.

"చెప్పు."

"శ్రద్ధగా విను - మా శారద యింటర్ చదువుతోంది-"

"అంటే."

"అంటే-అగస్టులో నా పెళ్ళి....ఊ."

"పెళ్ళా"-

"అవును, పెళ్ళిచేసుకుంటాను - ఈ బి. ఎ. పాసయిపోయి ఓ గుమాస్తాగా చేరిపోతాను- ఓ ఇద్దరు పిల్లలు- నేను, శారద హాయిగా బతికేస్తాం-చాలదా...."

రాజు ముఖంలోకి చూస్తూ "నిజంగానా" అంది శశి.

"ఆ."

శశి ముఖం ఒక్కసారి పాలిపోయింది. అయితే, రాజు తనని ప్రేమించటంలేదు. తనో మరి? ఏమో-ఎందుకో ఒక్కసారి ఎక్కడనుంచో కింద పడ్డట్టనిపించింది.

కాలేజీ రోజుల్లో పాట పాడాలన్నా, మాట్లాడాలన్నా, ఉపన్యాసం యివ్వాలన్నా, అన్నిటికీ తనే. తనంటే ఎందరికో ప్రేమ. ఎందరికో అభిమానం. ఏమైంది అదంతా. ఏమో.

చెల్లాచెదరుగా వున్న ఆలోచనల్ని, రద్దుచేసే ప్రయత్నం ఎంత గానో చేసింది. ఏం చేసినా మనసు ఇటు, అటు ఊగులాడుతోంది. మంచం మీద నుంచి లేచింది - గాజు షెల్ఫులో అందంగా అమర్చిన తన ప్రైజు పుస్తకాలు, సిల్వర్ కప్పు, పెద్ద షీల్డు-దగ్గరగా వెళ్ళి ఒక్కొక్కటీ చూసింది- గాజు షెల్ఫులో మెరుస్తున్నాయి తనలాగే!

అడుగుల చప్పుడుకి వెనక్కి తిరిగింది శశి.

"ఇద్దరికీ భోజనాలు వడ్డించమన్నారు అమ్మగారూ" - రాములు గుమ్మం బయట.

"ఊ- చూడు ఏంకావాలో" - శశి షెల్ఫు దగ్గరే నిలబడింది.

*　　　*　　　*

ఎక్కడ చూసినా ఆధునికత, ఎక్కడ చూసినా సంపద వెదజల్లి నట్లున్న ఆ ఇంటిని చూసి విస్తుపోయాడు రాజు.

కుర్రాడు కావలసినవన్నీ చూస్తున్నాడు. ఇల్లాలు కనిపించదేం? ఏమో గొప్పింటి పద్ధతి ఇదిలాగుంది. రాజు ఆలోచిస్తున్నాడు. "అలా కనిపించి తెలియనట్టే వెళ్ళిపోయిందే" రాజు శశి గురించే అనుకుంటు న్నాడు.

"నేను. శశిగారు క్లాసుమేట్సుమి."

రాజేంద్ర రాజు ముఖంలోకి చూశాడు. "అలాగా!" అంతే. ఆ సంభాషణ అక్కడే ఆగిపోయింది. చాలా సేపు కంపెనీ విషయాలు మాట్లాడుకున్నారు.

"రెండు రోజుల తర్వాత కనిపించు."

రాజేంద్ర దగ్గర సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు రాజా.

*　　　*　　　*

శశికి ఆ రోజంతా మనసు కలతగానే వుంది. అసలు ఈ పెళ్ళి జరక్కుండా వుంటే ఎంత బావుండేది! ఛ, ఛ, అదేం ఆలోచన?

ఏం-నిజమే - గుండెలోంచి వస్తున్న మాటలే-ఎవరూ విననప్పుడు కూడా నిజం తెలుసుకుందుకు ఎందుకు భయపడుతోంది తను! శశికి నవ్వొచ్చింది-నిర్జీవమైన నవ్వు.

గతం కళ్ళముందునుంచి కదలటంలేదు. పిల్ల అందంగా వుందని వాళ్ళే కబురంపించారు. లేకపోతే ఇంత గొప్ప సంబంధమా!

తన భర్త పెద్ద బిజినెస్ మాగ్నెట్—

తరతరాలుగా వస్తున్న ఆస్తి-తన ప్రసక్తి లేకుండా కుదిరిపోయిన ఈ సంబంధాన్ని గురించి ఎంతో గొప్పగా చెప్పుకున్నారంతా. తన అదృష్టాన్ని పదేపదే మెచ్చుకున్నారు.

కానీ ఈ చీరల వెనక, నగల వెనక, భోగం వెనక వున్న నిజం బయటపడడానికి, తనకి కావలసింది ఇది మాత్రమే కాదని తెలియటానికి ఎక్కువ కాలం పట్టలేదు శశికి.

"నేను ఎవరినయినా పరిచయం చేస్తే ఒక్క నిముషం నిలబడి వెళ్ళిపోవాలి. తెలిసిందా?" రాజేంద్ర శశిబుగ్గలు నిమురుతూ.

"ఊ."

తనకి మాట్లాడటం. మాట్లాడించటం. నవ్వడం, నవ్వించడం ఇలాటి వన్నీ తెలుసు ఇవన్నీ మరి?

"వింటున్నావా డియర్ - ఇప్పుడు నీవు చాలా హుందాతనం నేర్చుకోవాలి-మీ ఊర్లో వీధిగుమ్మంలో నిల్చుని మాట్లాడినట్టు ఇక్కడ మాట్లాడకూడదు. ఏం - ఎప్పుడూ చక్కగా ముస్తాబయి అందంగా బొమ్మలా వుండాలి - మా వాళ్ళందరూ నన్ను చూసి అసూయపడిపోవాలి —"

"అంటే షోరూమ్‌లో డాల్ లాగ ఉండాలి" శశి తలెత్తి రాజేంద్ర ముఖంలోకి చూసింది.

"ఇంచుమించుగా అంతే - అందరితో కబుర్లు చెప్పటం- ఇల్లెగిరిపోయేలా నవ్వడం నాకు ఇష్టం వుండదు

రాజేంద్ర సడన్‌గా లేచి సిగరెట్టు వెలిగించాడు.

"స్నేహితుల ఇళ్ళు కెళ్ళడం, సినిమాలకి ఒకర్తివీ వెళ్ళిపోటం లాటివి -" రాజేంద్ర మాట పూర్తిచేయ్యలేదు. "జరక్కూడదు, అవునా?" అంది శశి. రాజేంద్ర ఇంకా మాట్లాడుతూనే వున్నాడు.

"ఎందరెందర్నో కాదని నిన్ను అడిగి మరీ చేసుకున్నాను- నిన్ను ఈ ఇంట్లో పూజిస్తాను."

"ఈ నాలుగు గోడల జైల్లో పడేశా...." శశి నోటినుంచి అప్రయత్నంగా వచ్చేసాయి. వెంటనే నాలుక కరుచుకుంది.... ఏమనుకున్నాడో? అంతేకాదు- తల్లి చెప్పన మాటలు మనసులో మార్మోగాయి.

'నీ అదృష్టంకొద్దీ అడిగి చేసుకుంటున్నారు. అతను ఎలా చేప్తే అలా విను. నీ వితండ వాదన. నీ ఆదర్శాలు, ప్రోగ్రెసివ్ ఉమెన్ వ్యవ

హోదాలు అన్నీ ఆ కాలేజి వదలినప్పుడే వదిలేశాననుకో. ఇప్పుడు నువ్వు ఐశ్వర్యవంతుని భార్యవి....' తల్లి ఏదో చెప్తోంది. శశి పకపక నవ్వి "నాన్ సెన్స్, నాకో వ్యక్తిత్వం వుందని మరిచిపోయి గంగిరెద్దులా తల వూప మంటున్నావా? నాకు చేతకాదు."

శశి తల్లి చూపుకి వెంటనే తలొంచుకుంది. "సరే" అంది. అంతే - ఆ దృశ్యం కళ్ళలో కదలాడుతుంటే రాజేంద్ర కేసి చూసింది శశి. మంచి నిద్రలో ఉన్నాడు. అంతే. శశి జీవితచక్రం గాడిలో పడింది.

రాజేంద్ర బయటికి వెళ్ళినప్పుడు టై సరిచేయడం, కారు కదులు తుంటే బై అనటం, ఇంటికొచ్చే టయిముకి చక్కగా అలంకరించుకు ఎదురుచూట్టం. ఇంతే.

ఈ భవనం దాటాక మరొక ప్రపంచం వుందనిపించినప్పుడల్లా శశి గుండెలు బద్దలవుతాయి. కళ్ళలో నీళ్ళు ఎడతెగకుండా వర్షిస్తాయి.

ఒక్కసారి చిన్ననాటి స్నేహితురాలింటికి రిక్షాలో వెళ్ళివస్తే?

ఒక్కసారి చదువుకున్న కాలేజీకి వెళ్ళి అందరితో కబుర్లు చెప్పి వస్తే?

ఒక్కసారి బజారుకు వెళ్ళి కూరలు కొనుక్కువస్తే!

ఒక్కసారి స్నేహితులతో సినిమా కెళ్ళి వాళ్ళు మరిచి నవ్వుకుని కబుర్లు చెప్పుకువస్తే! వస్తేవస్తే! ఈ కోరిక లెప్పటికీ తీరవని శశికి తెలుసు. అయినా అవే కోరుకుంటోంది మనసు.

గ్యారెజ్ నిండావున్న రకరకాల చీరలని చూస్తే ఒక విధమైన విసుగు, అసహ్యం.

జూయలరీ బాక్సు తెరవాలంటే అలర్జి - తను మనిషా, వస్తువా ఒక్కోసారి సమాధానం రాని ప్రశ్న మనసుని వేధిస్తుంది.

అర్ధరాత్రి గడిచిపోయాక నౌకరు ఎప్పుడు తలుపు తీస్తాడో, ఎప్పుడు బెడ్‌రూమ్‌లో రాజేంద్ర పడుకుంటాడో చాలాసార్లు తెలియకుండానే రాత్రులు గడచిపోతాయి శశికి.

* * *

ఆ రోజు శశికి చాలా ఉడుకుమోతుతనం వచ్చింది. ఈ బంగారు కోట తనకొద్దు - కానీ, వదలుకోటం తేలికా కాదు! భోజనాలు చేస్తుంటే నిశ్శబ్దం - కోపం - విసుగు - ఈ పెద్ద భవనం ఈ ఇంట్లో ప్రతి వస్తువు నిర్జీవంగానే కనిపిస్తుంది శశికి.

ఎక్కడికక్కడ మెరుస్తూ తీర్చిదిద్దినట్లే వుంటాయి. అయినా —

"రాజు నీకు తెలుసా?" రాజేంద్ర ప్రశ్న పిడుగుపాటులా వినిపించింది.

"ఆ - నా క్లాసుమేటు, చాలా తెలివైనవాడు. ఎన్నిసార్లో మేమిద్దరం పోటీలో పాల్గొనడం- నేనే గెలవటం." శశి ఒక్క సెకను ఆగింది. వెంటనే గుర్తొచ్చింద. రాజు క్లాసుమేటని చెప్పటమే అనవసరమేమో. పైగా ఇన్ని మాటలా —

రాజేంద్ర అన్నాడు "అతను ఓ కంపెనీలో గుమాస్తాగా వున్నాడు. చాలా చురుకైనవాడని, తెలివైనవాడని నా ఫ్రెండు పరిచయం చేశాడు. వీలయితే మన కంపెనీలోకి తీసుకుందామని."

శశికి ఓ నిముషం సంతోష మనిపించింది.

"ఆ గుమాస్తాగా కన్నా ఇందులో నాలుగు డబ్బులు ఎక్కువొస్తే అతను, భార్య సుఖపడతారు."

"ఊ" రాజేంద్ర టేబిలు దగ్గరనుంచి లేచాడు.

* * *

"ఆవిణ్ని మనింటికి రమ్మనలేకపోయారా?" అంది శారద పూలు కడుతూ గుమ్మంలో కూచుని.

"ఇంకా నయం - ఆవిడ ఒక సెకను కనిపించి, నేనెవరో ఎరగనట్టే లోపలికెళ్ళిపోయింది. ఆవిడ ఇప్పుడు గొప్పింటి యిల్లాలు. ఆ యజమాని దగ్గర నౌకరీ కోసం వెడుతున్నవాడిని నేను." సిగరెట్టు ముట్టించాడు రాజు.

"ఏమో బాబు - నా కవన్నీ తెలియవు." పూలచెండు తలలో తురుముకుంది శారద.

ఆ రాత్రంతా ఆలోచించాడు రాజు. కొత్త ఉద్యోగం ఇస్తానంటే చేరాలా వద్దా అని.

అయినా ఎంత గర్వమయినా తెలిసున్న మనిషిని పల్కరించకుండా వెళ్ళిపోటం ఎంతో చిత్రంగా వుంది. గొప్పవాళ్ళే కావచ్చు. అయితే బంగారం తింటారా - అందగత్తెనని మొదట్నుంచీ బలే గర్వం శశికి - రాత్రంతా ఇలాగే ఆలోచనలో మునిగిపోయాడు రాజు.

రాజేంద్ర కూడా ఇలాగే ఆలోచనలో ఆ రాత్రి మునిగిపోయాడు. ఇతన్ని ఉద్యోగంలో తీసుకుంటే తను కావాలనుకున్న చురుకైన కుర్రాడు దొరికినట్టే. కానీ తను భార్య స్నేహితురాళ్ళు కలిస్తేనే ఇష్టపడదు - ఇప్పుడితను - ఈ ఉద్యోగం - సరే చూద్దాం తొందరేముంది - నిద్రలో అన్నీ మరిచిపోయాడు రాజేంద్ర.

శశికి నిద్రే పట్టలేదు. తనని ఏమనుకుంటున్నాడో రాజు. తను గొప్ప ఐశ్వర్యవంతురాలని, గర్విష్ఠి అని. ఇలా ఏదో ఏదో అనుకుంటూ వుంటాడు. శశి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. గుండె గొంతుకలో కొట్లాడింది.

"రాజూ - నేను బంగారు పంజరంలో వున్న బంగారు చిలకని. చిలకకి మాటలు నేర్పించి మాట్లాడిస్తాం. కానీ నేను వచ్చిన మాటలు కూడా మరిచిపోయాను. ఈ భవనం దేవేంద్ర భవనం - నేను అసూర్యం పశ్యని - నాకు లేనివి లేవు - అయినా పరమ దరిద్రురాలిని - ఆఖరికి మనసు కూడా పోగొట్టుకున్న బీదదాన్ని - అది ఎప్పుడో చచ్చిపోయింది - నేనొక వ్యక్తినని, నిన్ను అగౌరవపరచానని అనుకుంటున్నావేమో - నేను వ్యక్తిని కాదు. వస్తువుని - నాలో చైతన్యం, వ్యక్తిత్వం ఏమీ మిగల లేదు. అందుకే ఆ రోజు నీకో కప్పు టీ యిచ్చి-నీ భార్య గురించి, పిల్లల గురించి ఏమీ మాట్లాడకపోయిన మరమనిషిని. నన్ను క్షమించమని నేను కోరటం లేదు."

మనసంతా పోగుచేసి నాలుగు మాటలు కాగితం మీద రాసి మడిచింది. పరుపు కింద పడేసింది.

అటు ఇటు ఒత్తగిల్లిన రాజేంద్ర లేచి సిగరెట్ ముట్టించాడు-

''ఆ కుర్రాడికి ఉద్యోగం ఇద్దామా?''

''మీ యిష్టం.''

''నీ యిష్టమేమిటని....''

''ఇయ్యండి.''

''ఊ'' - రాజేంద్ర మరో సిగరెట్టు ముట్టిస్తూ ఆ నిముషంలోనే నిర్ణయించుకున్నాడు- ఆ ఉద్యోగం మరొకరి కివ్వాలని.

ఏడుగంట లయేసరికి వీధి గదిలో కూర్చున్న రాజుకి కాఫీ పంపింది శశి. ఎనిమిది దాటితేకాని రాజేంద్ర ఏనాడూ నిద్ర లేవడు. గుండె చిక్కబట్టుకుని ముందు గదిలో కొచ్చింది శశి. రాజు పలకరిద్దా మనుకొనే లోపలే మడిచిన కాగితం రాజు చేతిలో పెట్టి ''ఇంటికెళ్ళి చదువు'' అంటూ నిముషంలో లోపల కెళ్ళిపోయింది శశి.

రాజేంద్ర గంట దాటింతర్వాత ముందుగదిలో కొచ్చాడు.

''హలో! చాలా సేపయిందా? మీరు రేవు సాయంత్రం రండి మాట్లాడదాం.'' రాజు ముఖం వెలవెలపోయింది. సరే కానీ అనుకుంటూ నడిచాడు ముందుకు.

*　　　*　　　*

ఇంట్లో అడుగు పెట్టడం ఆలస్యంగా కాగితం మడతలు విప్పాడు. పాపం, దీర్ఘంగా నిట్టూర్చాడు.

''ఇదిగో - చూడు'' శారద చేతికిచ్చాడు. కాగితం చదివి కళ్ళొత్తుకుంటూ "బంగారు గోడల మధ్య వుండమంటే ఎవరుంటారు? నేనయితే ఒక్క నిముషం వుండలేను బాబూ!'' పిల్లాడికి పాలసీసా నోటికందిస్తూ శారద అంటుంటే 'ఊ' అన్నాడు రాజు.

సాయంత్రం అయిదు దాటింది. రాజేంద్ర ఇంటికి బయలుదేరాడు రాజు. మనసెందుకో ప్రశాంతంగా లేదు - ఈ కొత్త ఉద్యోగం ఎందుకో రాకపోతే బావుండుననిపించింది ఓ క్షణం. గబగబా రెండడుగులు వేశాడు. ఎత్తయిన భవనం ముందు ఆగాడు.

కొందరి బతుకులు బంగారు బతుకులు - బాంక్ లాకర్లలో భద్రపరిచే వస్తువులు - అవి అంతే, అంతే - నిద్రించిన వెన్నెలలా శశి రూపం కళ్ళముందు కనిపిస్తుంటే అడుగులు ముందుకు వెయ్యలేక పోయాడు. రెండు నిముషాలు ఆ భవనం ముందు నిలబడి, గబగబా వెనక్కి నడిచి ఇల్లు చేరుకున్నాడు రాజు.

*

న్చాడు.
ం్రతం రండి
అనుకుంటూ

లు విప్పాడు.

డిచి కళ్ళొత్తు
? నేనయితే
ోటికందిస్తూ

మ లుదేరాడు
ం ఎందుకో
ాడడుగులు

్కలో భద్ర
లలా శశి
వెయ్యలేక
గబగబా
*

# మమత – మానవత

కారులో షికారు వెళ్ళొచ్చిన ఆరేళ్ళ రమ వీధి గోడపక్కన మందార చెట్టు దగ్గర కొచ్చింది. ఒళ్ళో పోసుకున్న బొమ్మలన్నీ మట్టిలో దిమ్మరించి గౌను దులుపుకుంది. ఎన్నో బొమ్మలు. ఆ బొమ్మలతో ఆడుకుంటూ మధ్య మధ్య అమ్మ ఇచ్చే మందులు వేసుకుంటూ వుండటం రమకి అలవాటే. ఆరోగ్యం బాగుండని రమని ఎవరూ ఏమీ అనరు. అంతేకాదు, పిల్లలులేని పెద్దనాన్నకి రమంటే చాలా ముద్దు.

చిన్న చిన్న వంట సామానులు, ప్లాస్టిక్ బొమ్మలు, చిన్న నీళ్ళ బకెట్టు.... ఎన్నో ఎన్నో వరుసలు వరుసలుగా అమర్చిన రమకి ఒక్కసారిగా గుర్తొచ్చింది బొమ్మకి నీళ్ళు పొయ్యాలని. సందులో వున్న పంపు దగ్గరకెళ్ళి చిన్న గిన్నెతో నీళ్ళు పట్టింది. ఆ నీళ్ళు ఒలికిపోకుండా అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న రమకి గుమ్మంలో నుంచున్న ముష్టిది కనిపించింది.

"పో_" ముసలిదానికేసి చూస్తూ కసిరింది.

"గుప్పెడు బియ్యం....వరాల తల్లీ!"

రమ ఆటలో మునిగిపోయింది ... స్నానం చేయిస్తే సరా-ఎన్నెన్ని పనులు తనకి-బొమ్మకి ఒళ్ళు తుడవాలి. బట్టలు కట్టాలి-అబ్బా!

ముసల్ది గుమ్మంలోనే నుంచుంది....అలాగే చూస్తోంది-ఎంతసేపో-ఏమో!

"ఇంకా పోలేదా?" రమ ఆట ఆపి లేచింది.

'ఇదిగో' తాటాకు గిలక పిల్ల దగ్గరకు విసిరింది ముసల్ది. గల గలమంటూ కాళ్ళ దగ్గరొచ్చిపడింది గిలక.

"ఛీ, ఇదేమిటిది-తాటాకుది-చూడు-ఎన్ని బొమ్మలో! ఈ కారుచూడు ఎలా పరిగెడుతుందో- ఈ బొమ్మచూడు ఎలా నవ్వుతుందో." అటుతలెత్తి చూసింది. ఛీ- ముష్టిదానితో ఈ మాటలేమిటి-వెంటనే కసిరేసింది. ముసల్ది గిలక అక్కడే వదిలేసి వెళ్ళిపోయింది.

బొమ్మలన్నీ బుట్టలోకి ఎత్తుతుంటే, తాటాకు గిలకలోని గులక రాళ్ళ గలగల తమాషాగా వినిపించింది రమ చెవులకి.

రెండు రోజులు ముసల్ది వస్తుందని ఎదురు చూసింది. బొమ్మలాట ఆడేసి వీధిలో నుంచునేది. రమకి మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది గిలక లోపల గులకరాళ్ళు. అంత చిన్న చిన్న గళ్ళు గళ్ళుగా ఎలా అల్లిందో. అందులో చిన్నచిన్న రాళ్ళు ఎలా పోసి మూతవేసిందో అర్థం కావటం లేదు. పోనీ ఆ తాటాకులన్నీ విప్పేసి చూస్తే, — అమ్మో, తనకి చేయడం రాదుగా— రమ అలా వీధిలో నుంచుని చూస్తుంటే వీధి చివర సందులో నడుస్తూ కనిపించింది ముసల్ది.... "ఇటురా ఇటు"—గట్టిగా కేక పెట్టింది.

"ఎలా చేసేవ్— నీకు డబ్బులు వద్దా మరి?" ముసల్ది నవ్వేసి ఊరుకుంది.... రమ లోపలకి పరిగెత్తి ఒళ్ళో బియ్యం పోసుకొచ్చింది.... రెండు గుప్పెళ్ళ బియ్యం గౌనులోవి ముసల్దాని గిన్నెలో గుమ్మరించి చేతులు దులుపుకుంది.

అన్ని బొమ్మల్లోకి రమకి ఇప్పుడు బాగానచ్చింది గిలకే. పెద్దనాన్న రమని చూసి నవ్వుతుంటే కోపమొచ్చింది.

'ఈ కారు ఇందాక కిందపడి విరిగింది. ఈ గిలక విరగదు కదూ?" రమ మాటలకి నవ్వు ఆగలేదు తల్లి, తండ్రి, పెదనాన్న అందరికీ.

రోజూ రోజూ ముసలమ్మ రావటం ఏదో ఒక తాటాకు వస్తువు ఇయ్యటం, కాసిని బియ్యం పొయ్యటం మామూలై పోయింది రమకి. పిల్ల ఆడుకుంటుందని చూసి చూడకుండా ఊరుకోవడం తల్లికి అలవాటయి పోయింది.

వారం రోజుల తర్వాత అడుగులో అడుగేసుకుంటూ వస్తున్న ముసల్దాన్ని చూస్తే జాలేసింది రమకి.

'జ్వరమా నీకు?'

'ఆ— ఇంద'—

చిన్న తాటాకు బొమ్మ - దానికి చిన్న గౌను, మెడలో ఎర్రని పూసలు, కళ్ళకి కాటుక- అబ్బ ఎంత బావుందో! మురిసిపోయింది రమ.

వచ్చిన ముసల్ది వెంటనే వెళ్ళిపోదు ఏ రోజూ. రమని అలా చూస్తూనే కూచుంటుంది ఎంత సేపో....

"ఈ బొమ్మలకి డబ్బు తీసుకోవా?"

"వద్దు "

"ఎందుకూ-"

"ఊరికే-" ముసలమ్మ రమని చూస్తూంది.

"ఇదే జుట్టు. ఇదే ముక్కు.... అచ్చం ఇంతే-"

ఏంటీ, మాట్లాడుతున్నావు-" రమ చిత్రంగా ముసలిదాని ముఖం లోకి చూస్తూ.

"ఏంలేదులే-" లేచింది ముసల్ది. కర్ర కిందపడిపోయింది చేతిలోంచి. రమ గబుక్కున అందించింది.

"బంగారు తల్లి!" మెటికలు విరిచి నెమ్మదిగా వెళ్ళిపోయింది.

ఆ తర్వాత ముసల్ది నెలరోజులయినా రాలేదు. రమకి రోజూ ముసల్ది వస్తుందేమోననే అనిపిస్తుంది. ముసల్దానిమీద కోపమొస్తుంది. ఒక్కోసారి ఏడుపొస్తుంది. "అయినా దాని ఇల్లు ఎక్కడో కనుక్కోవాల్సింది"- రమకి వెంటనే భయమేసింది. ఎవరైనా ముష్టివాళ్ళ ఇల్లు కనుక్కుంటారా- వాళ్ళ ఇళ్ళకి వెడతారా- అమ్మో- ముష్టి వాళ్ళలో దొంగలు కూడా ఉంటారని అమ్మ చెప్పింది.ఎవరైనా తన్ని ఎత్తుకుపోతే- ఛీ పాపం ముసల్ది మంచిది.

ఆ రోజు రమ నాన్న, పెద్ద నాన్న, తల్లి అంతా హాల్లో కబుర్లు చెప్పుకుంటున్నారు. వీధి గుమ్మంలో కర్ర చప్పుడు వినిపించి పరిగెత్తింది రమ. ముసలమ్మ. రమ ముఖం ఒక్కసారి వెలిగిపోయింది.

"ఇన్ని రోజులెక్కడికెళ్ళావ్- మీ ఊరెళ్ళావా?" ముసలమ్మ మాట్లాలేదు.రమ లోపలికి పరిగెత్తి బియ్యం తెచ్చి ముష్టిదాని గిన్నెలో పోసింది. ముసల్ది గోడనానుకుని కూర్చుంది. రమ ఏదో మాట్లాడుతూనే వుంది. చిన్న తాటాకుబుట్ట - "అబ్బ, ఎంత బావుందో...."

అంతా గమనిస్తూనే వున్న తల్లి. ఒక్క ఉదుటున బయట కొచ్చింది. 'రోజూ ఈ తాటాకు ముక్కలు ఇచ్చి, ఇన్ని బియ్యం కాజేస్తోందన్నమాట - ఇంకా ఏమేమి ఎత్తుకుపోతుందో - మొన్న సందులో ఆరేసిన రెండు జాకెట్లు కనిపించలేదు - ఎవరో ఎత్తుకుపోయారనుకున్నాను.'

"పిల్లకి మాయమాటలు చెప్పి ఏవేమి కాజేస్తున్నావ్? పో-గుమ్మంలోంచి - ఇంకోసారి గుమ్మంలోకి వచ్చావో కాళ్ళు విరక్కొడతా."

రమ తెల్లముఖమేసింది. ముష్టిది విస్తుపోయింది. తల్లికి తెలిసే గుప్పెడు బియ్యం తెస్తోందనుకుంటోంది ఇన్ని రోజులూ-

బొమ్మల్ని కాలితో తోసి విసవిసా వెళ్ళిపోయింది లోపలికి రమ. తల్లి. ఎండ నడినెత్తికొచ్చింది. ముసల్దానికి కష్టం తిరుగుతున్నాయని పించింది. అలాగే ఆ పిల్లని చూస్తోంది.

గౌనుతో కళ్ళు తుడుచుకుంటూ బొమ్మల్ని బుట్టలోకి ఎత్తుతోంది. రమ.

అడుగడుగు భారంగా వేస్తూ నడుస్తున్న ముసల్దానికి చిన్నారి గౌరి కళ్ళముందు కదుల్తోంది. పుట్టగానే తల్లిని పోగొట్టుకున్న పసిగుడ్డును చేతుల్లో పెట్టుకు పెంచింది. రెండేళ్ళు వచ్చినప్పట్నుంచీ ఇంటింటికీ తనతోబాటు తిప్పేది. వాళ్ళని వీళ్ళని అడిగిన గౌన్లు తొడగేది దొడ్లో పూసిన బంతి పూలు తల్లో తురిమేది. 'మనింటికిది మాలచ్చిమి' అనేవాడు తాత.

ఆ రోజు ఎదిరింట్లో పెళ్ళి సందండి - పందిరి నిండా పిల్లలు ఆడుకుందుకు వెడతానంది గౌరి.

రాత్రికి పెళ్ళి - అంతా సందడి - ముసలమ్మతో చెప్పి పందిట్లోకి పరిగెత్తింది గౌరి ...అంతే. ఆ వెళ్ళిన పిల్ల మళ్ళా కనబడలేదు. ఏమైంది- ఏమో!

పిల్లల్ని ఎత్తుకెళ్ళుంటారు అని ఒకరంటే బిచ్చమెత్తుకునేవాళ్ళే ఎత్తుకు పోయి కాళ్ళో, చేతులో విరక్కొట్టి అడక్కుందుకు ఉపయోగించు కుంటారు అని వకరన్నారు. అందరి మాటలూ వింటూ, ఒళ్ళంతా కళ్ళు చేసుకుని గౌరి కోసం గాలిస్తూనే వుంది ముసల్ది. వెళ్ళిపోయేనాటికి ఆరేళ్ళది.. అప్పుడే ఏడాదవుతోంది - గౌరవమ్మ బతికుందా - ఏమో? ముసలమ్మ మూగగా వెతుకుతూనే వుంది.

మజ్జిగ అన్నం ముసలాడి నోటికందించి, మసకచీకటిలో నులక మంచం వాల్చింది ముసల్ది- ఆకాశం రంగు రంగులతో అందంగా కనిపి.

స్తోంది.... గౌరమ్మ తల్లి ఓ చుక్కయిందేమో - ముసల్ది ఆకాశంకేసి చూస్తోంది.... ఇంకా నక్షత్రాలు మెరవటం లేదు.

'రాములమ్మా- రాములమ్మా' - గుడిసె బయట ఎవరిదో గొంతు.

'రాములమ్మా'-

'ఆ ఎవరూ'.

'నేను' దగ్గరకొచ్చింది కుంటికాలి పోచి.

'నీ గౌరిని చూసా.'

'ఆ' నోరు తెరిచింది ముసల్ది.

'ఏటంటున్నావ్'

'గౌరిని చూసా-!'

కుంటికాలి పోచి చెప్పింది - గౌరి తండ్రి బరి తాగుబోతు అర్రాత్రి పెళ్ళి పందిట్లోంచి పిల్లని ఎత్తుకుపోయాడు. పిల్ల ఏడ్చిందట-గొంతెత్తితే నరికేస్తానన్నాడట - ఆడేమొ రిక్షా తొక్కుతున్నాడట - పిల్లది ఆ కాలేజీ కుర్రాళ్ళ గదివూడ్చి కేరియర్ తెస్తుందిట - పోచి చెప్తున్న మాటలన్నీ వింటూ అలాగే వుండిపోయింది ముసల్ది.

గౌరికి ఏడేళ్ళు నిండుతాయి-హమ్మొ! ఇంకో మూడేళ్లు, నాలుగేళ్లు పోతే, తండ్రి అసలే తాగుబోతు- ఏమొ దానిఖర్మ! ముసల్ది తలకొట్టుకుని పోచికేసి చూసింది.

"పిల్ల బాగుంది రాములమ్మా.... నువ్వు బెంగపడకు."

రాములమ్మ గొంతు తడారింది.

"పిల్ల బాగుందా ... ఇంకేమంది - పోచీ, ఒక్కసారి నాకు చూపరాదుటే—"

"అయ్యో నాకేటి తెలుసు— సంతలో కనిపించి,అయ్య వస్తున్నాడంటూ పరిగెత్తింది రాములమ్మా...." దీర్ఘం తీసింది పోచి.

"పోన్లే అది దాని అయ్య దగ్గరికి అదెళ్ళింది. అయినా కాటికి సిద్ధంగా వున్న నేనేటి చేస్తానే పోచీ"-

ముసల్దాని దగ్గర కూచుని ఆ మాట ఈ మాట చెప్పి వెళ్ళి పోయింది పోచి.

ఇంతకీ గౌరి ఎవరు - ముసల్ది ఎవరు - ఎవరికి ఎవరు - తన గుండెలెందుకు మండుతున్నాయి - తన కళ్ళలో నీళ్ళెందుకు - తనెవరో, అదెవరో - ఏమొ?!

తనతో బాటు అడుక్కునే మరో ముష్టిదానిపిల్ల గౌరి.... పురిటిలోనే వాతం కమ్మి తల్లి చచ్చిపోతే, తండ్రి తాగుబోత్రై ఊరొదిలి వెళ్ళిపోతే, ఆ పసికందును పెంచింది తను. పోన్లే- బతికుంది కదా - దానయ్య దగ్గరి అది వుంది - నేనెవరు మధ్యలో - ముసల్ది ముక్కు చీదుకుంది.

పిల్ల బాగుందిట - ఎట్లా వుందో - ఏమొ నాకెందుకు - ముసల్ది నెమ్మదిగా గుడిసెలోకి పోయింది.

ఆ రోజు నుంచీ ముసల్ది గౌరి కోసం వెతకటం మానేసింది. ఎందుకో ఆ రోజు ఆడుకుంటున్న రమని చూస్తే పెళ్ళి వందిట్లోకి పరిగెత్తిన గౌరి కనిపించినట్టయింది. అంతే. ఆ పిల్లని చూడ్డం కోసం రోజూ ఏదో ఒకటి తయారు చేసి ఎంత దూరమో కాళ్ళీడ్చుకుంటూ రావటం మొదలెట్టింది ముసల్ది.

*   *   *

రమ బొమ్మలాట మానేసింది.... బడికి వెడుతోంది.అయినా అప్పుడప్పుడు పెట్టెలో వున్న బొమ్మలన్నీ దిమ్మరించి చూసుకుంటుంది.... తాటాకు బొమ్మలు,గిలకలు, బుట్ట అలానే వున్నాయి. పాపం,ముసలమ్మ మళ్ళీ రాలేదు. అమ్మని చూసి భయపడిపోయింది - స్కూలుకి వెళ్ళే

టప్పుడు, వచ్చేటప్పుడు ఎక్కడైనా ముసల్ది కనిపిస్తుందేమోనని చూస్తుంది రోజూ.

స్కూలుకి సెలవలిచ్చారు. విసుగ్గా వున్న రమ బీరువా తెరిచింది. పెద్ద నాన్న కొన్న బొమ్మలు, ముసలమ్మ ఇచ్చిన బొమ్మలు ఎన్నెన్నో వున్నాయి. అవి చూస్తే నవ్వొచ్చింది రమకి. ఎన్ని ఆటలాడుకొనేదాన్ని! అన్నీ వరసగా బల్ల మీద పేర్చింది. ఇంట్లో తల్లి, తమ్ముడు లేరు. తండ్రి ముందు గదిలో ఏదో చదువుకుంటున్నాడు.

వీధిలో కారు హారన్ మోగడంతో గబ గబా పరిగెత్తింది రమ. తల్లి ముభావంగా ముందుకెళ్ళిపోయింది. పెద్దనాన్న ముఖం పక్కకు పెట్టుకు లోపలకి నడిచాడు. తమ్ముడు పరిగెత్తుకుంటూ వచ్చి, రమ చెవిలో ఏదో గుసగుసలాడాడు. కొయ్యబారిపోయింది రమ. బల్లమీద తలాన్చి వెక్కి వెక్కి ఏడ్చింది. చూస్తున్న తల్లికి ఒళ్ళుమండిపోయింది.

"ముసల్ది చావక బతుకుతుందా-కాకపోతే మన కారు కిందపడింది. అయినా-" తల్లి మాటలు వినిపించటం లేదు రమకి.

"ముసల్ది మంచిదమ్మా పాపం——"

"అయితే ఏం చేద్దాం?" విసావిసా లోపలకెళ్ళింది తల్లి.

"ఆ బొమ్మలు అవతల పారేయ్. ఆ ఏడుపు వదులుతుంది" పడక్కుర్చీలో కూచున్న పెద్ద నాన్న తాటాకు బొమ్మల్ని చూపిస్తూ అన్నాడు.

"వీథిలో పారేస్తే ఏరితెచ్చుకుంటుంది" - బల్లమీదున్న తాటాకు బొమ్మలన్నీ పోగుచేసింది. తల్లి....రమచూస్తూనే వుంది ఎండిన తాటాకులు భగ్గుమన్నాయి. ఒక్క క్షణంలో వంటింటి గుమ్మంలోకి రమ పరిగెత్తింది.

గబగబా మంటలోంచి బయటకి లాగింది ఒక్కటే. ఒక్క గిలక- ఒక్క గిలక-

*　　　　*　　　　*

కాలం గబగబా నడుస్తోంది - పెట్టి అడుగున తాటాకు గిలక అలానే వుంది....పెట్టి ఎప్పుడు సర్దినా గిలక అడుగున దాచేసేది ఒక్కసారి చూసి - 'ఎన్ని రోజులయినా ఇలానే దాచుకుంటాను.నా పెళ్ళయ్యాక మా వారికి చెప్తాను దీని కథ. నా పిల్లలకి చూపిస్తాను దీన్ని'నవ్వుకుంది.... రమ పెళ్ళయిపోయింది ఆ నెలలోనే.

రమ గిలకని తీసింది పైకి....ఎండిన తాటాకు లోపలనుంచి సన్నని గులకరాళ్ళు మెల్లిగా చప్పుడు చేస్తున్నాయి - ముసలమ్మ నవ్వులా అనిపించింది ఒక్కసారి.

"అయ్యో పాపం - ఒకదానికయినా తను డబ్బు లియ్యలేదు - ఒక్కసారి కూడా గిలకలకి పైసలిమ్మని అడగలేదు" - ఏదో తప్పు చేసినట్లు, ఎక్కడో గుండె పట్టు కదిలినట్టయింది రమకి.

కాని క్షణంలో మనసు మరలించేసింది-

"ఆ - అయినా బియ్యం పెట్టానుగా-"

"బియ్యం బిచ్చగాళ్ళకి చాలామంది పెడతారు-"

"మరి తను తీసుకున్న బొమ్మలకో-"

"ఆ - ఏం బొమ్మలు - తాటాకువేగా-"

"అయితే మాత్రం-"

తన ప్రశ్న-సమాధానాలకి చిరాకొచ్చేసింది తనకే! గబగబా పెట్టె తీసింది.

వస్తువులన్నీ బయట పెట్టింది - పెట్టడుగున తాటాకులు ఫెళ ఫెళ లాడాయి.

గుమ్మంలో నుంచున్న రామం రమకేసి చూస్తున్నాడు. తాటాకులు పైకితీస్తుంటే రమకే నవ్వొచ్చింది.

"ఏమిటా చెత్తంతా?"

"ఆ - చెత్తే మరి - ఒట్టి చెత్త"- పెట్టె దులిపింది.

వంటింట్లోంచి చీపురు తెచ్చింది. ఎండిన తాటాకు ముక్కల్ని తుడిచి, గోడవతల విసిరేసింది. ఆ ముక్కల్లో మునల్ది ఒక క్షణం కదిలి మాయమయినట్లయింది.

"నాన్సెన్సు - సెంటిమెంటు" - 'ఛీ' - చీరలు మడతలు పెట్టి చక్కగా సర్దుకోవటం ప్రారంభించింది రమ.

*

# నీతికథ

మల్లెపూలంటే ఇష్టం లేనిదెవరికి? సామాన్యులు, గొప్పవాళ్ళు అన్న తేడా ఉండదు ఆ విషయంలో. మల్లెపూల మీద మనసు పెంచుకున్న రత్తిని ఆ పనికై ప్రేరేపించింది ఏమై ఉంటుంది?

రత్తి లలితమ్మ ఇంట్లో పనికి కుదిరి ఆర్నెల్లయింది. దొంగబుద్ధి లేదని, పని బాగా చేస్తుందని అందరి మెప్పూ పొందింది అప్పుడే. పొద్దున్నే పనికి వచ్చి సాయంత్రం దాకా ఉండిపోతుంది రత్తి ఆ ఇంట్లో. రెండేళ్ళ బాబుని లలిత ఆఫీసు నుంచి వచ్చేవరకు జాగ్రత్తగా చూసుకోటం రత్తి చేసే ముఖ్యమైన పని ఆ ఇంట్లో.

లలితమ్మకి ఇరవై అయిదేళ్ళుంటే, రత్తికి పద్దెనిమిదేళ్ళుంటాయి. నల్లగా, సన్నగా ఉండే రత్తి ముఖంలో ఎంతో కళ ఉంది. నవ్వుతుంటే చక్కని పలువరస మెరుస్తూ ఎంతో అందాన్నిస్తుంది రత్తికి. నల్లటి పొడుగాటి జడకు ఎర్రని రిబ్బను పెట్టుకోవడం ఎప్పుడూ మరిచిపోదు రత్తి.

రత్తి మొగుడు రిక్షా లాగుతాడు. స్కూలు పిల్లల్ని రిక్షాలో దింపి సాయంత్రం ఇళ్ళకి చేర్చటం వాడి పని.

లలితమ్మ ఇంట్లో రత్తి పనిచేయాల్సిన పనుల్లో మరొకటి ఉంది. పూలవాడు వీధిలో కేక పెట్టడం ఆలస్యం, గుమ్మంలోకెళ్ళి ఆ పూల మాల తీసుకోవాలి. భద్రంగా ఫ్రిజ్‌లో ప్లాస్టిక్ కవర్‌లో చుట్టిపెట్టాలి. ఆఫీసు

నుంచి ఇంటికొచ్చిన లలితమ్మ కొంచంసేపు విశ్రాంతి తీసుకొని, తల దువ్వుకుని ఆ పూలమాలను తలలో పెట్టుకుంటుంది. ఇది రోజూ జరిగేదే.

ఆ రోజు పూలవాడి కేక వినబడగానే వీధిలోకి రోజులాగే పరిగెత్తింది రత్తి. పూలమాల తీసుకుంది. ఫ్రిజ్ దగ్గరికి రాగానే రత్తి చూపు పూలమాలపైనే నిలిచింది. "చిన్న ముక్క తుంపి తలలో పెట్టుకుంటే? ఆఁ వద్దులే రేపు అమ్మగార్నడిగి తీసుకుంటా." పూలమాలను వాసన చూసి లోపల దాచింది రత్తి.

లలితమ్మ ఆఫీసునుంచి వచ్చేసింది. పిల్లాడిని అప్పగించింది రత్తి. వీధి గేటు దగ్గర ఆగి, ఎర్రమందారం కోసి జడలో తురుముకొని గబగబా నడిచింది.

వేసవి వచ్చేసింది. రత్తికి వేసవి కాలం అంటే చాలా ఇష్టం.... కారణం ఒక్కటే, బోలెడు మల్లెపూలు వస్తాయి బజార్లోకి. అప్పుడప్పుడు వెంకడు పూలు కొని తెచ్చిపెడతాడు తనకి.

గదులన్నీ తుడిచి, పడగ్గదికి తుడవటానికి కొచ్చిన రత్తి క్షణం అలాగే నిలబడింది చీపురు చేత్తో పట్టుకుని.

"తల్లో పెట్టుకోవటమే కాకుండా పక్కమీద కూడా చల్లుకుంటారా?".... మూతి వంకరగా తిప్పింది రత్తి. "అంత ఎక్కువైతే నాకిమ్మగూడదూ?" చీపురుతో గబగబా తుడిచింది. వాడి నేలపైన రాలిన, పక్కమీద పడున్న పూలను చూస్తుంటే భలే కోపమొచ్చింది రత్తికి.

అమ్మగారిలో ఏదో మార్పును గమనిస్తూనే ఉంది రత్తి ఈ మధ్య. ఏదో వంకని ఆఫీసుకి సెలవుపెట్టడం, ఒంట్లో బాగాలేదని పడుకోడం చూస్తున్న రత్తికి విషయం అర్థమైపోయింది. "అయినా బాబుకి రెండేళ్ళేగా? ఏమో, నాకెందుకీ గొడవ?" రత్తి బాబుకి అన్నం పెడుతూ నవ్వుకుంది తనలో తానే.

తనకీ ఓ పాప పుడితే? పెళ్ళయి మూడేళ్ళయింది. తన తర్వాత పెళ్ళయిన తన చెల్లి బంగారికి తొమ్మిదో నెల. రత్తికి ఉన్నట్టుండి వెంకడి మీద, చెల్లి బంగారి మీద, అమ్మగారి మీద, చిన్నబాబు మీద ఒక్కసారి కోపం వెల్లుబికి వచ్చింది.

"తినూ"— ముద్ద నోట్లో కుక్కగానే, టక్కున ఉమ్మేశాడు చిన్నబాబు.

"రత్తీ"—

అమ్మగారి గొంతు విని ఉలిక్కిపడింది.

"రేపు ఇంట్లో చాలా పని ఉంటుంది. చుట్టాలొస్తారు. అమ్మ, చెల్లి, అన్న వస్తారు. నువ్వు పెందరాడే రావాలి. రాత్రి అయేవరకు ఉండాలి. ముందే చెప్తున్నా."

"సరేనమ్మా!" రత్తి తల ఊపింది.

"ఇంద."లలితమ్మ పూలమాలలోని చిన్న ముక్క తుంపి ఇచ్చింది.

"ఇంకొంచం పెద్ద ముక్క యిస్తే ఏమవుతుందో?" రత్తి లోపలే సణుక్కుంటూ, ఆ చిన్నముక్కను పెద్ద జడలో కుక్కుకుంది.

ఆ ముందురోజు చూసిన సంగతే రత్తి కళ్ళలో కదలాడుతోంది. లలితమ్మ తలలో పూలదండ పెడుతున్నాడు అయ్యగారు.

విడిపూలు మంచంపైన జల్లుతున్నారు అమ్మగారు.

గది తుడవటానికొచ్చిన రత్తి ఒక్క అడుగు వెనక్కివేసింది.

"ఈరోజు గది తుడవనక్కర్లేదులే వెళ్ళిపో."

రత్తి గబగబా ఇంటికెళ్ళిపోయింది.

అమ్మగారెంత అదృష్టవంతురాలో!

తన వెంకడు ఒక్కనాడన్నా తనతలలో పూలు పెట్టాడా....?

అయినా, అమ్మగారికీ, తనకీ పోలికా? రత్తి పెదాలపై చిన్న నవ్వు, కళ్ళలో సన్నటి నీటిపొర ఇలా కనిపించి అలా మాయమయ్యాయి.

రాత్రంతా అమ్మగారి తలలో పూలే కనిపిస్తున్నాయి రత్తికి. పక్కకి ఒత్తిగిల్లింది.... బండలా నిద్రపోతున్న వెంకడిని మోచేత్తో ఒక పోటు పొడిచి కళ్ళు గట్టిగా మూసుకుంది రత్తి.

* * *

ఇల్లంతా సందడి.... "ఇది లోపల పెట్టు"- పెద్ద పూలదండ, ఎన్ని మూరలుంటుందో, రత్తి చేతికందించాడు లలితమ్మ భర్త. ఆ దండ అలాగే చేత్తో పట్టుకు నిలబడిపోయింది రత్తి.... ఆ పరిమళం శరీరానికి గిలిగింతలు పెట్టింది.... ఈ దండంతా తను జడకి చుట్టుకుంటే? చుట్టుకుంటే? రత్తి ముఖం వెలవెలపోయింది. ఇదెలా సాధ్యం? ముఖం నిండా చెమటలు పట్టింది. కంగారుగా అటూ ఇటూ చూసింది. అంతా ఎవరి పనులలో వారున్నారు. ఈ పూలమాల జడమీద చుట్టుకోవల్సిందే. తన కోరిక ఎలా తీరాలి మరి?- రత్తి గబగబా వీధిలో కొచ్చింది. గోడవారగా నడుస్తూ, ఇంచుమించుగా పరుగుతీసింది. చిన్న గుడిసెలో తలుపు కింద నుంచి పూలమాలతో ఉన్న పొట్లం బలవంతంగా తోసింది.

అంత పరుగులోనూ మళ్ళీ ఇల్లు చేరింది రత్తి.

అంతా ఎవరి హడావుడిలో వారున్నారు.

"రత్తీ!"

"అమ్మా!"

"ఏదది?"- లలితమ్మ సవరం పెట్టి వేసుకున్న జడ ముందుకు వేసుకుని అడిగింది.

"ఏదమ్మా?"

"అదే- ఇందాక అయ్యగారిచ్చిన పూలపొట్లం."

"అక్కడే పెట్టాగా!"

"ఎక్కడ?" లలితమ్మ చిరాగ్గా అంది.

ఇంట్లో అంతా ఆ పూలమాల ఎక్కడ ఉందో వెతకడం మొదలు పెట్టారు. రత్తి కూడా అదేపనిలో మునిగిపోయింది.

"పోన్లే - ఉంటే అదే దొరుకుతుంది. మరో పదిమూరల దండ తీసుకురండి, జడమీద చుట్టాలి."

లలితమ్మ తల్లి తొందర పెట్టింది.

పది నిముషాల్లో పూలదండ వచ్చేసింది. లలితమ్మ చిన్న జుట్టుకు పెద్ద సవరంతో వేసిన జడనిండా పూలమాల చుట్టారు. పెద్ద పూలజడతో, పట్టుచీరతో, నిండుగా లలితమ్మ కనిపిస్తుంటే రెప్పపాటు కూడా లేకుండా చూస్తూ కూచుంది రత్తి.

శ్రీమంతం, పేరంటం అయిపోయింది.... రత్తి ఇంటికెళ్ళాలని తొందరపడింది.

బాగా చీకటిపడింది. టిఫిన్ కారియర్‌లో ఎన్నో స్వీట్లు, అన్నం, కూరలు- అన్నీ పెట్టి ఇచ్చింది లలితమ్మ.

ఉత్సాహంగా ఇంటికొస్తున్న రత్తికి వెంటనే అనిపించిందీ, వెంకడు ఈ పూలదండ ఎక్కడిదీ అని అడిగితే తనేం చెబుతుంది? అమ్మగారింట్లో దొంగతనం చేసిందనా? ఛీ ఛీ! - అమ్మగారే ఇచ్చారని చెప్తే? వెంకడు నమ్మడు. గబగబా నడుస్తున్న రత్తికి ఆయాసం వచ్చింది.

గుమ్మంలోకి రాగానే గుప్పుమంది మల్లెల వాసన. చిన్న దీపం మినుకు మినుకు మంటోంది.

వెంకడికి కోపం వస్తే? రానీ! అమ్మో, వెంకడు చాలా కచ్చితం మనిషి. తనని తంతే? రత్తి పూలమాలతీసి జడపైన పెట్టుకుంది. సగం పగిగిన అద్దంలో మళ్ళా మళ్ళా చూసుకుంది.

ఎంత బావుందో! రత్తి కళ్ళనిండా వెలుగు.

మరో క్షణంలో రత్తి ముఖం వెలవెలపోయింది. వెంకడు అబద్ధం చెబితే వెంటనే గ్రహించగలడు. ఓ రోజు రిక్షా తొక్కిన డబ్బులతో పూలు తెచ్చి పెట్టమంటే తెచ్చిపెట్టడా? రత్తికి నవ్వొచ్చింది. పూలకోసం అన్ని డబ్బులే!!

వెంకడు తనని ఎంతో ప్రేమగా చూస్తాడని రత్తికి తెలుసు. కానీ నీతి తప్పితే వెంకడు తల నరికేయడానికి కూడా వెనుకాడడు! తను అమ్మగారింట్లో పూలదండ దొంగిలించి తెచ్చానని తెలుస్తే వెంకడు తనని తన్ని, ఆ పూలదండ తనతోనే అమ్మగారికి పంపిస్తాడు. రత్తి చేతులు వణికాయి. కళ్ళలో నీళ్ళు తిరిగాయి అయినా తనకెందుకీ దొంగబుద్ధి? - రత్తి మనసు చెదిరిపోయింది. - వస్తువు చిన్నదయినా, పెద్దదయినా దొంగతనం దొంగతనమే!!

రత్తి చీకట్లో గబగబా దగ్గరలో ఉన్న చెత్తకుండీలో పూల పొట్లాన్ని గబుక్కున విసిరి,- వెనక్కి తిరిగి, గుడిసె చేరింది. అమ్మయ్య! మనసు తేలిక పడింది. తనకిచ్చే నెలజీతంలోంచి ఒకసారి పదిరూపాయల పూలు కొనుక్కుంటా! బుగ్గల మీద జారిన కన్నీళ్ళు తుడుచుకుంది.

బాగా పొద్దుపోయింది. రత్తి మనసు నిండా వెంకడే నిండి పోయాడు. ఇంకా రాలేదే? పొయ్యి మీద వేన్నీళ్ళు మరుగుతున్నాయి. రాగానే నీళ్ళు పోసుకోమనాలి. అమ్మగారిచ్చిన ఫలహారాలు పెట్టాలి. తన వెంకడు ఎంతో మంచివాడు. ఎంతో కష్టపడుతున్నాడు.

వెంకడి కోసం ఎదురుచూస్తూ గుమ్మంలో కూచుంది రత్తి.

* * *

పిల్లల్ని రిక్షాతో ఎవరింట్లో వాళ్ళని దింపాడు వెంకడు. చివరగా ఇంజనీరు గారింట్లో పిల్లల్ని దింపాడు.

"ఒరేయ్! ఇటు రా!!"

"అమ్మ- చెప్పండి." వెంకడు పక్కనున్న పంపులో నీళ్ళు తాగి ముఖం, కాళ్ళుచేతులు కడుక్కున్నాడు.

"ఈరోజు క్లబ్బులో ఈ దండ అయ్యగారి మెడలో వేశారు. కానీ నేనేం చేసుకుంటానిది? నువ్వు తీసికెళ్ళు - రత్తికియ్యి."

వెంకడు పరమానందంతో తీసుకున్నాడు- పెద్ద మల్లెపూల దండ. ఎంత పెద్దదండో. నా రత్తి జడనిండా నిండిపోతుంది - ఎప్పటినుండో పెద్ద పూలదండ కొనిపెట్టాలి రత్తికి అనుకుంటున్నా - ఈనాడు అయ్యగారి శేసిన దండ నాకు దక్కింది. అమ్మగారేం పెట్టుకుంటుంది జడలో? అసలు జడ ఏదీ? చెవుల వరకు కత్తిరించిన జుట్టు.

వెంకడికి నవ్వొచ్చింది. అమ్మగారు దువ్వెనతో తల దువ్వుకుంటున్నది, అయ్యగారిలాగే వెంకడి రిక్షాలో పూలదండ ఘుమఘుమలు ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. హుషారుగా ఈలపాట పాడుకుంటూ, వేగంగా రిక్షా తొక్కటం మొదలుపెట్టాడు వెంకడు.

పది గజాలు వెళ్ళాడో లేదో రిక్షా టక్కున ఆగింది. రిక్షాలోని పూలదండ కేసి కన్నార్పకుండా చూస్తున్నాడు వెంకడు. ఈ పూల దండ నా భార్య తలలో పెట్టడానికా? అయ్యగారి మెడలో ఎవరో వస్తే అది నా భార్య జడలో పెడతానా? ఛూ, నీ-నాకు నీతిలేదా? వెంకడి కళ్లు ఎర్రబడ్డాయి. అయ్యగారికి. అమ్మగారికి అక్కర్లేదు కనుక ఇంత పెద్ద దండ నాకిచ్చారు. ఏం, లలితమ్మగారైనా ఒక్కనాడైనా పెద్దదండ నా రత్తికిచ్చిందా? ఈ గొప్పోళ్ళనీ వెంకడు వేగంగా రిక్షా తొక్కాడు.

"నా రత్తికి ఒకరోజు రిక్షా తొక్కిన డబ్బుల్తో పూలదండ కొంటా" దగ్గరలో వున్న చెత్తకుండీ దగ్గర రిక్షా ఆగింది.

రిక్షాలోని పూలదండ ఒక్క విసురులో చెత్తకుండీలో పడింది. వెంకడు గబగబా రిక్షా తొక్కి గుడిసె చేరాడు.

"ఉడుకునీళ్ళోసుకో. ఆకలవుతోంది." గుమ్మంలో కూచున్న రత్తి మాటలు వినిపించటంలా వెంకడికి.

"రేపు రిక్షా తొక్కిన డబ్బుల్తో నీకు పూలు కొని తెస్తా." గబగబా లోపలకెళ్ళాడు వెంకడు.

రత్తి చిన్నగా నవ్వింది.

వెంకడు పకపకా నవ్వాడు.

చెత్తకుండీలో రెండు పూలదండలూ గుసగుసలు చెప్పుకుని ముసి ముసిగా నవ్వుకున్నాయి, ఆ వెన్నెల రాత్రిలో.

*

# అంతస్తుకి అటు ఇటు

విమానం కదలగానే రాజారాం కారు స్టార్టు చేశాడు. [illegible] [illegible] నుకున్నాడు, కాని ఎందుకో వెళ్ళాలనిపించలేదు. ఒక క్షణం [illegible] ఇంటిదారి పట్టాడు.

"వెళ్ళిందా అమ్మాయి?" పక్కకు ఒత్తిగిల్లుతూ [illegible] [illegible] రాణి.

"ఆ" సిగరెట్టు పొగ గాలిలోకి వదులుతూ [illegible] కూలబడ్డాడు రాజారాం.

*　　　　*　　　　*

"ఆయనకి ఇష్టం ఉండదు నాన్నా.... నాన్నా! [illegible] పోయాక చిన్నబాబుని తీసుకువస్తాను కాదూ.. ఏం [illegible] నెమ్మదిగా చెవిలో చెప్పిన మాటలు [illegible] ముక్కలు ముక్కలు చేస్తున్నాయి. సింహం [illegible] [illegible]ద్రంలా గంభీరమైన రాజారాం, డబ్బుతో [illegible] దృఢంగా నమ్మే రాజారాం కళ్ళలో [illegible] కున్నాడు.

*　　　　*　　　　*

అందాల బొమ్మలా వుండే ఇందిర[illegible] పెళ్ళి [illegible] అనుకున్నారు. మరెందరో ఇంటికి తామే [illegible] పెళ్ళి గురించి ఆలోచిస్తుందో లేదో కాని [illegible]

అమ్మాయి పెళ్ళి గురించి మనసులో అనుకోలేదు. తనకున్న ఒక్క కూతు రికి పెళ్ళిచేసి పంపేస్తే ఇల్లు చిన్నబోదూ—

'అయితే పిల్లకి పెళ్ళి చేయరా?' అంటుంది రాధారాణి లిప్‌స్టిక్ పెదాలు తడుపుకుంటూ.

"ఒకవేళ పెళ్ళిచేస్తే-ఆ అబ్బాయి ఈ ఊళ్ళోనే వుండాలి. మా చిట్టి తల్లిని ఎప్పుడు పంపమంటే అప్పుడే పంపాలి- ఒక్క పని చేయించ కూడదు, ఒక్కమాట అనకూడదు. విన్నావా? అది ఎవరి కూతురను కున్నావ్? రాజారామ్స్ డాటర్?" రాజారాం గర్వంగా చిట్టితల్లికేసి చూసాడు ''యస్ డాడీ!" షెమీనా తిరగేస్తూ, భుజాలమీదపడ్డ జుట్టు ఓసారి సరిచేసు కుంటూ తండ్రికేసి చూసింది ఇందిర.

* * *

అదృష్టం అనుకోకుండా కలసివచ్చేసింది. చాలా గొప్పవారి సంబంధం ఇందిరకి ఖాయమైంది. పిల్లవాని తాత జడ్జి పదవిలో ఎన్నో ఏళ్ళు చేసి రిటైరయ్యాడు. పిల్లవాని తండ్రి మిలటరీలో పెద్ద ఆఫీసరు. పిల్లాడు ఓ పెద్ద కంపెనీలో మేనేజరు. వాళ్ళకున్న ఆస్తి, అంతస్తు సందేహం లేకుండా చాలా పెద్దవి. ఎంతోమంది కావాలని కోరుకునేవి.

"వాళ్ళ అంతస్తుకి మనం తగం నిజంగా. కాకపోతే పిల్ల అదృష్టం ఎన్నో పెద్ద పెద్ద సంబంధాలు వస్తే కాదనుకుని మన పిల్లని చేసు కోటం...." రాధారాణి మాట పూర్తి కాకుండానే—

"అంతస్తంటే?" రాజారాం విసుగ్గా రాధారాణికేసి చూశాడు.''అదే- అంతస్తంటే- అదేనండి—మనకన్నా వాళ్ళు చాలా గొప్పవాళ్ళనా మరి...."

రాజారాం మనసును సమాధానపరచుకో ప్రయత్నిస్తున్నాడు. వాళ్ళు చాలా గొప్పవాళ్ళు - అయితే మాత్రం, మా అమ్మాయి ఎంత అంద

పైందీ! అందుకే వచ్చి అడిగి, నన్ను ఒప్పించి మరీ వెళ్ళారు - రాజారాం తన మీసాలు ఓసారి సరిదిద్దుకుని గర్వంగా నవ్వుకున్నాడు. అంతస్తు మాత్రం ఏం తక్కువని తన్ను తానే ప్రశ్నించుకున్నాడు.

* * *

ఇందిర పెళ్ళి చాలా గొప్పగా జరిగింది. కాని కేవలం ఇందిర లాంటి అందమైన పిల్ల కోడలు కావాలని వాళ్ళు తనతో సంబంధం కలుపుకున్నారు అని రాజారాం మనసుకి దృఢంగా తెలిసిపోయాక ఎక్కడ నుంచో కిందకు పడిపోయినట్లు కృంగిపోయాడు.

అమ్మాయిని చూడ్డానికి రాజారాం రెండు మూడుసార్లు వెళ్ళాడు. తన రాకపోకలు గుర్తించనట్లే వుండేవాడు అల్లుడు. "పోన్లే-నా పిల్లకోసం నేను వస్తున్నానంతే" పేలవంగా నవ్వుకుంటూ మెట్లెక్కేవాడు రాజారాం చాలాసార్లు.

* * *

రాజారాం ఎదురుగా బల్లమీద ఉత్తరం రెపరెప లాడుతోంది. ఈ ఉత్తరం రాయబట్టి వెళ్ళి అమ్మాయిని ఎయిర్‌పోర్టులో చూడనైనా చూడగలిగాడు. ఒక్క వారం రోజులయినా తనదగ్గరుంచమని రాస్తే, ఇంచుమించుగా బతిమాలుతున్నట్టుగా రాస్తే- విమానం విమానాశ్రయంలో కొద్దిసేపు ఆగుతుంది కాబట్టి అక్కడికి వచ్చి చూసివెళ్ళమనే సమాధానం!

మళ్ళా ఓమాటు ఆ ఉత్తరం చదువుకుని పళ్ళు కొరుక్కుని, కాసేపు గదిలో అటూ ఇటూ పచార్లు చేసి ఆ ఉత్తరాన్ని చెత్తకాగితాల బుట్టలో విసిరేశాడు రాజారాం. తన తాహతు వాళ్ళకి తెలీదు. మొన్నా అల్లుడు పనిమీద ఈ వూరొచ్చి హోటల్లో దిగి వెళ్ళిపోయాడు. ఏమిటీ అహం - డబ్బు, డబ్బు! రాజారాంకి క్షణం మతిపోయినట్లే అనిపించింది.

విమానం ఎక్కి వెళ్ళిపోయే అమ్మాయి వెనక్కి తిరిగి నాన్నని చూసి పేలవంగా నవ్వటం, 'ఆయనకి ఇష్టంలేదు నాన్నా!' గొంతు తగ్గించి నెమ్మదిగా చెప్పటం ఎంత మరచిపోవాలన్నా మరిచిపోలేకపోయాడు రాజారాం. ఆ నిమిషంలో ప్రపంచం అంతా అంధకారంగా అనిపించింది. మనిషి అంతస్తే కొలబద్ద అయితే ఈ ప్రపంచంలో రకరకాల మనుషులు ఎలా బతికిపోతున్నారు హాయిగా? రాజారాం ఆ చీకటి గదిలో అలాగే కూర్చుండిపోయాడు.

*　　　*　　　*

చిన్న వీధి బడి మాష్టారు కొడుకుగా పెరిగాడు రాజారాం. చిన్న పెంకుటింట్లో అమ్మ, నాన్న, తాత, బామ్మ, ఇద్దరన్నయ్యలు, ఇద్దరు చెల్లెళ్ళు, తను - అంతా వుండేవారు. అమ్మ పెట్టిన చద్ది అన్నం తిని పలక పట్టుకుని లాగు ముడి వేసుకుంటూ వీధిబడికి పరిగెత్తేవాడు. చిన్న లాంతరు ముందు కూచుని చదువుకున్నాడు. బాగా చదువుకుంటున్నాడని తాతయ్య మెచ్చుకునేవాడు. "ఏం చదువో - వాడి కడుపుకి వాడు సంపాదించుకుంటే చాలు" అనేది తల్లి ఏ నూతి దగ్గరో పనిచేసుకుంటూ.

అలా అలా చిన్నపల్లెటూరిలో, చిన్న ఇంట్లో, చిన్నబడిలో, మరీ చిన్న బతుకులో కొంచెం కొంచెం పెరిగాడు.

మామయ్య తనకి కాలేజీ చదువు చెప్పిస్తానని పట్నం తీసుకొచ్చే వరకు పట్నం ఎలా వుంటుందో తెలియదు. చాలా కష్టపడి చదువుకున్నాడు. అదృష్టం కలసివచ్చింది..అంతే,

జీవితం కొత్తమలుపు తిరిగింది. మంచి ఉద్యోగంలో ప్రవేశించడం ఆలస్యం, పిల్లనిస్తామంటూ వెంటబడ్డ వాళ్ళెందరో! రాధారాణి తండ్రి జానకిరామయ్య తన గురించి విని, వారం రోజులు తిరగకుండా పెళ్ళి సంబంధం కుదిర్చేసాడు. తనని కొనేసుకున్నాడు.

తను ఇంకో మెట్టు పైకి వెళ్ళిపోయాడు. గొప్పవాడైన మామగారు-ఆరోజు తనని వెంట బెట్టుకుని మరీ పెద్ద హోటలులో డిన్నరిచ్చినపుడు, తనవాళ్ళందరూ నిత్యం తినే తిండి, తనవాళ్ళ బ్రతుకులు కళ్ళముందు నిలచి, అక్కడ తియ్య తియ్యని పదార్థాలు గొంతు దిగక తికమకపడ్డ రోజు ఎలా మరిచిపోగలడు? మొదట్లో కొన్ని రోజులు తల్లితండ్రులకి నెలనెలకి డబ్బు పంపేవాడు. వారం వారం ఉత్తరం రాసేవాడు కాని, తర్వాత తర్వాత పూర్తిగా మారిపోయాడు రాజారాం. 'తన అదృష్టం తనది' అని సర్ది చెప్పుకుంటూ బతికేయడం అలవాటు చేసేసుకున్నాడు. తన ఇంటిచుట్టూ పూలమొక్కలు, పెద్ద బంగళా, మరీ పెద్దకారు, తన కోసం చుట్టూ చుట్టూ తిరిగే రకరకాల మనుష్యులు, తన అంతస్తు - ఓహో - గొప్ప గొప్పవాళ్ళే తన ఆత్మీయులని నమ్మేస్తూ, తన డబ్బుతో ఈ ప్రపంచాన్ని కొనేయగలనని గాఢంగా నమ్మేస్తూ - ఓహో - ఎన్నేళ్ళు, ఎన్నెన్నేళ్ళు బతికేశాడు తను! మనిషి ప్రేమకి, ఆప్యాయతకి. త్యాగానికి - ఇలాటి ఎన్నిటికో ప్రపంచంలో కొంతైనా విలువ వుందని గుర్తించాల్సిన అవసరమే లేకుండా హాయిగా బతికేశాడు. చుట్టరికాన్ని, స్నేహాన్ని కూడా అంతస్తుల తూకంలో తూచి ఖరీదు కట్టేశాడు - ఓహో ఎంత పెరిగిపోయాడు తను!!

కానీ మరీ పెరిగిపోయిన రాజారాం. హాయిగా నవ్వడం, కళ్ళు మూసుకు సుఖంగా నిద్రపోవడం మరిచిపోయాడు. నిజానికి తను మనిషిగా బతకడమే మరిచిపోయాడు - కానీ బతికేసాడు - ఎన్నేళ్ళు-ఎన్నేళ్ళు!!

*　　　*　　　*

తన వాళ్ళని తలుచుకోగానే రాజారాం కళ్ళు చెమర్చాయి. తను చిన్నప్పుడు పెరిగిన ఇల్లు. తనతోబాటు ఒకే కంచంలో తిన్న అన్నయ్య, తన చిన్నారి చెల్లాయి - రాజారాం ఒళ్ళు పులకించింది. తనకోసమే

ఎదుడుచూసే వాళ్ళంతా ఏరీ? ఎవరు దొంగో, ఎవరు దొరో తెలియకేసి ఇన్ని వేల అనుబంధాల మధ్య తనవాళ్ళేరీ!?

ఇంత పెద్ద రాజారాం చీకట్లో కన్నీళ్ళు తుడుచుకున్నాడు. పెద్ద బంగళా, మరీ పెద్ద కారు, పూలతోట - ఇంకా ఎన్నో ఎన్నో తననే వెక్కి-రిస్తున్నాయనిపించి కదలిపోయాడు.

చిట్టి తల్లిని అల్లుడు పంపలేదని కృంగిపోయిన తను ఎన్ని అను బంధాల్ని తేలిగ్గా వదిలేశాడు ఇంతవరకు! రాజారాం దీర్ఘంగా నిట్టూర్చాడు. హోదా మనిషిని పెద్దవాణ్ణి చేస్తుంది. కాని, దానితోబాటు మనసుకూడా పెరిగితేనే. అలా కాకపోతే - ఎన్ని ఉన్నా అన్నీ వృథా వృథా!!

డబ్బు మనిషయిపోయి తను బతికిన బతుకు అసహ్యంగా, భయంగా కనిపించి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు రాజారాం.

ఆ రోజు,

"ఊరెడుతున్నాను" సూట్‌కేసులో బట్టలు సర్దుకుంటూ రాజారాం.

"ఊరేమిటి" ఆశ్చర్యపోయింది రాధారాణి. "అమ్మాయి దగ్గరకా?"

"కాదు - అమ్మ దగ్గరికి!" రాజారాం రాధారాణి ముఖం చూశాడు.

"బాగుంది మీ హాస్యం. అమ్మాయి కోసం బెంగపడుతున్నారు అసలే - దీనికితోడు ఆ ఊరెళ్ళి ఆ కారాలు తింటూ కూచుంటే ఇంక మీ ఆరోగ్యం-" రాధారాణి మాట పూర్తికాలేదు.

"అక్కడుండి తిన్నంతకాలం మనిషిలాగే ఉన్నాను. అవన్నీ మానేశాక ఇలా మారిపోయాను" విరాగిలా ఓ నవ్వు నవ్వి గబగబా ముందుకు అడుగులేశాడు రాజారాం.

*  *  *

తను చదువుకున్న చిన్న వీధి బడి దాటిపోతుంటే ఒళ్ళు గగుర్పొడిచింది. గబగబా నడిచి ఇంటిముందు ఆగాడు రాజారాం. కిటికీలోంచి తొంగిచూశాడు. అమ్మ దొడ్లో తులసికోట దగ్గర తలపెట్టుకు నిద్రపోతోంది. నాన్న ముందు వరండాలో గురకతీసి నిద్రపోతున్నాడు. రాజారాం అదేపనిగా చూస్తున్నాడు లోపలికి. దీపపు వెలుగులో పక్కగా ఏదో చదువుతున్న అన్నయ్య కనిపిస్తున్నాడు. రాజారాం ఇక ఆగలేక గబగబా తలుపు తట్టాడు.

"ఎవరు కావాలండీ?" తియ్యని చిన్న గొంతు విని పులకించి పోయాడు.

"మీరంతా!" అప్రయత్నంగా అనేశాడు.

ఇంట్లో అందరూ రాజారాం చుట్టూ మూగారు. అనుకోకుండా రాజారాం రావటం అందరికీ ఆశ్చర్యంగానే వుంది.

"ఇలా కూచో." మంచం చూపించాడు తండ్రి.

"మీ ఆవిడ కులాసాయేనా?'' అంది అమ్మ.

రాజారాం నవ్వాడు.

క్షణంలో ఇంట్లో అందరూ ఏదో హడావిడి పడుతున్నారు. అమ్మ రహస్యంగా అన్నయ్యకి ఏదో చెప్తోంది చిన్నవాడు దొడ్డిగుమ్మంలోంచి వెళ్ళి మళ్ళా లోపలకొచ్చాడు.

రాజారాం అన్నీ గమనిస్తూనే ఉన్నాడు. తనకి అతిథి మర్యాదలు చేయడానికి వాళ్ళు పడుతున్న తాపత్రయం - రాజారాం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'చల్లారిపోయిన అన్నం మీలాగ నేనూ తినగలనని, నేనూ మీలాగ నేలమీద పడుకోగలననీ, నేనూ మీ అందరిలో ఒకడనేనని, అందరిలా ఒకడనేనని - గట్టిగా అందరికీ చెప్పాలి చెప్పాలి' అనుకుంటూ, గుండె

గొంతుకలో కొట్లాడుతుంటే, గద్గద్వంగించి చూస్తూ వుండిపోయాడు రాజారాం.

తనని వీళ్ళు ఎందుకు ప్రత్యేకంగా చూస్తున్నారు - తనూ వీళ్ళ రక్తం పంచుకున్నవాడేనే - అందరూ ఒకటైనట్లు, తనొక్కడూ ఒక్కటైనట్లు అనుకున్న రాజారాంకి ప్రపంచమంతా శూన్యంగా వికారంగా కనిపించింది.

వారం రోజులు అక్కడే గడిపిన రాజారాం బయలుదేరుతుంటే బుట్టనిండా అరిసెలు సద్ది పెట్టింది అమ్మ. తనకి ఇవి యిష్టమని అమ్మ మరిచిపోలేదా ఇంకా?!

'బాబాయ్ - మళ్ళీ రా!' చిన్న తియ్యని గొంతు - 'ఒక ఉత్తరం ముక్క రాయరా బాబూ' - నీళ్ళు నిండిన కళ్ళతో అమ్మ చూపు - కదిలి పోతున్న రాజారాంని క్షణం కట్టివేశాయి. ఈ ఆప్యాయతలు తను భరించ లేకపోతున్నాడు - ముందుకేస్తున్న అడుగులో మార్గం కనిపించకుండా కన్నీళ్ళు అలుముకున్నాయి. 'ఈ ఆప్యాయతల్ని ఏ డబ్బుతో కొనుక్కో గలను?!' - లక్షాధికారి రాజారాం దీర్ఘంగా నిట్టూర్చి ఆ నిశీధిలో కలసి పోయాడు.

*

తన అల్లుడు తన అంతస్తును లెక్కపెట్టడు - తనో!!

అంతస్తుకి అటు ఇటు-

చిత్రం, భళారేవిచిత్రం - రాజారాం విరాగిలా నవ్వుకున్నాడు తనలో తను కూనిరాగం తీస్తూ

# నింగినుండి నేలకి

విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో యూనివర్సిటీ ఫస్టు వచ్చి, గోల్డుమెడల్ అందుకున్న చిట్టిబాబులో ఆ క్షణంనుంచే చిత్రమైన మార్పు వచ్చేసింది. ఇంట్లో అందరూ ఆ గోల్డుమెడల్ చూసి మురిసిపోతుంటే, ఓ మాటు ఛాతీ విరుచుకుని, జుట్టు సరిచేసుకుని, నల్లని మీసాలు అద్దంలో మరొక్కసారి చూసుకుని, ఇవాల్టినుంచి 'చిట్టిబాబు ది గ్రేట్' - అంతే - తనలో తనే నవ్వుకున్నాడు, ది గోల్డు మెడలిస్ట్ చిట్టిబాబు!!

ఇద్దరన్నయ్యలు, ముగ్గురు చెల్లెళ్ళు, రవిబాష, అత్త, బామ్మ, అమ్మ, నాన్న - అంతా వుండే ఆ చిన్న పెంకుటింట్లో పుట్టి పెరిగాడు చిట్టిబాబు. వీధి గుమ్మంలో చదువుకుంటుంటే, ఇంకెవరో వచ్చేవారు. 'చిట్టీ, లోపలకెళ్ళి చదువుకో' - నాన్న గొంతు వినిపించడం ఆలస్యం - చిట్టిబాబు పుస్తకాల సంచి గబగబా చంకనెత్తుకుని వంటింటి గుమ్మంలోకి పరిగెత్తేవాడు. "ఒరేయ్ చిట్టీ, ఆ చారకా కరివేపాకు తీసుకురా" - వంటింట్లోంచి అమ్మ కేక పెట్టేది. లాగు దులుపుకుని సందు చివర కూరలమ్మి దగ్గర కరివేపాకు తెచ్చి వంటింటి గుమ్మంలో విసిరేవాడు. "నా రబ్బరు ఏదిరా అన్నయ్యా" బుజ్జి ఏడుపు ముఖంతో చిట్టి పక్కన కూచునేది. ఎక్కడో వెతికి ఓ చిన్న రబ్బరు తెచ్చి చెల్లికి ఇచ్చేవాడు - ఇంకేముంది! గడియారం గంటలు కొట్టడం, చిట్టిబాబు స్కూలుకి పరిగెత్తడం -! 'ఒక్క పది నిముషాలు ఆగరా అన్నం పెడతాను' - వంటింట్లోంచి తల్లి కేక వినపడే లోపలే చిట్టిబాబు వీధిలో కొచ్చేసేవాడు - ఇంచుమించుగా

చిట్టిబాబు స్కూలుకి రోజూ ఇలాగే వెళ్ళేవాడు - అలాగే కాలేజీ చదువూ పూర్తయింది.

డిగ్రీ అయింది కదా, ఇక మనం పై చదువులు చెప్పించలేము అని తండ్రి నిశ్చయించినా, చిట్టిబాబు అన్నలు మాత్రం చాలా పట్టు పట్టారు - చిట్టిబాబుకి ఎలాగైనా పెద్ద చదువు చదివించాలని. చదువు ఖర్చంతా మేమే భరిస్తాం అన్నారు.

చిట్టిబాబు యూనివర్శిటీ చేరిపోయాడు. హాస్టల్‌లో చేరాడు. నెలనెలా ఒక్కరోజు కూడా ఆలస్యం కాకుండా అన్నలిద్దరూ డబ్బు పంపుతున్నారు. చిట్టిబాబు ఎంతో శ్రద్ధగా చదువుకుంటున్నాడు.

నెలవలకి చిట్టిబాబు ఇంటికొచ్చాడు. తల్లి అన్నం వడ్డిస్తూ పక్కనే కూచుంది. "ఒరేయ్ చిట్టీ, అన్నయ్యలిద్దరూ మంచి మనసుతో నిన్ను పెద్ద చదువు చదివిస్తున్నారు - వాళ్ళ చిన్న జీతాలలో నీ కోసం కూడబెట్టి నెలనెలా పంపిస్తున్నారు. నీ చదువు పూర్తయ్యాక, అన్నయ్యలని ఎలా ప్రేమగా, గౌరవంగా చూసుకుంటావో ఏమో.... డబ్బు సంపాదించగలం కానీ ప్రేమలు, ఆప్యాయతలు సంపాదించలేం తెలుసా?" అంది మజ్జిగ పోస్తూ.

"అమ్మా! నేను నిజంగా గొప్ప పదవి సంపాదించుకుని, నిజంగా చాలా గొప్పవాణ్ణయిపోతే, నా వాళ్ళంతా గొప్పవాళ్ళుకారా - ఏమిటమ్మా నీ భయం? అన్నయ్యలు నాకు చేస్తున్న మేలుమరిచిపోతాననా?" నవ్వాడు, అమ్మ పమిటకొంగుతో చేయి తుడుచుకుంటూ.

* * *

కాలం ఆగకుండా పరిగెడుతోంది. అదృష్టంతో పాటు ఎక్కడో దాగివున్న అహం ఒక్కసారి తన్నుకు బయటికొచ్చేసింది చిట్టిబాబుకి.

ఆ రోజు ఐ.ఎ.ఎస్. ట్రయినింగ్‌కి బయలుదేరుతున్న చిట్టిబాబుకి దిష్టి తీసింది తల్లి. "ఏమిటిదంతా, నాన్సెన్స్" విసుక్కున్నాడు. తల్లి చెప్తున్న మాటలు వినటానికి చిరాగ్గా వున్నాయి. వినకుండానే సరే, సరే అంటున్నాడు చిట్టిబాబు.

చిట్టిబాబు పూర్తిగా మారిపోయాడు. అదివరకిటిలా నవ్వుతూ అందరితో మాట్లాడడు. న్యాయాన్యాయాల గురించి, ధర్మాధర్మాల గురించి చర్చించడు ఇప్పుడు. తనతో గోళీలు ఆడుకున్న చిన్ననాటి స్నేహితుల గురించి, తనతోపాటు గాలిపటాలు ఎగరేసిన రవిబావ గురించి, పక్కింటి స్కూలు టీచరు ఇందిరక్క గురించి, పోలియో వచ్చి అవిటికాలుస్న చిన్నన్నయ్య గురించి ఎప్పుడూ తల్చుకోడు. ఒకవేళ వాళ్ళెవరయినా గుర్తొస్తే వెంటనే మనసు మరల్చుకుని టి.వి. చూస్తూ కూచుంటాడు చిట్టిబాబు.

అదృష్టం వెంటబడితే ఆగకుండా తరుముకొస్తుందంటారు కదా! ఓ శుభ ముహూర్తాన చిట్టిబాబు ఐశ్వర్యవంతునికి అల్లుడయిపోయాడు. లీలారాణిని చేపట్టిన మరుక్షణం నుంచి చిట్టిబాబు లోకం ఇంకా పూర్తిగా కొత్తదారి తొక్కింది - డబ్బుంటే చాలు లోకంలో ఎన్నైనా చేజిక్కించుకోవచ్చు. డబ్బుంటే చాలు మరేమీ లేకపోయినా పరవాలేదు - డబ్బే లోకం, డబ్బే జీవం, డబ్బే తను! చిట్టిబాబు నింగి వైపే చూస్తున్నాడు. కాళ్ళకిందున్న నేలను మరిచిపోయాడు.

* * *

చెల్లాయిలు పంపే పుట్టినరోజు గ్రీటింగ్ కార్డులు, అన్నయ్యలు రాసే ఉత్తరాలు చూడటానికే విసుగు చిట్టిబాబుకి. "ఇదిగో రాణీ - వాటికి ఏదో సమాధానం రాసేయి - కింద సంతకం చేస్తాను." చిట్టిబాబు రాణి ఎర్రని పెదాలవంక చూస్తూ అన్నాడు.

"మీ పెద్దన్నయ్య పంపిన మీ బర్త్‌డే గ్రీటింగ్‌కార్డు - చూడండి ఒక్కసారి" - రాణి గ్రీటింగ్‌కార్డు చిట్టిబాబు చేతి కందించింది .... గోర్లకున్న ఎర్రని పాలిష్ నిగనిగా మెరుస్తోంది. రాణి పెదాలు ఎర్రగా. రాణి బుగ్గలకు వేసుకున్న రంగు ఎర్రగా, రాణి కట్టుకున్న చీర ఎర్రగా. చెవుల దిద్దులు ఎర్రగా .... చేతి కెంపుల గాజులు ఎర్రగా - చిట్టిబాబు గ్రీటింగ్‌కార్డు చూడడం లేదు....

"రాణీ, నిన్ను ఇంత అందంగా ఎందుకు సృష్టించాడో"—

"మీ కోసమే" - చిట్టిబాబు కౌగిలిలో ఉక్కిరిబిక్కిరయింది లీలారాణి.

"ఈ రాత్రికి నేను ఊరు వెడుతున్నా!"

"నేనూ వస్తా."

"నేను ఆ రూట్ మీదుగా వెళ్ళి ఓ రెండు గంటలు మా ఇంట్లో.... అదే మా ఊళ్ళో ఆగుతాను ... ఎన్నేళ్ళయిందో ఆ ఊరెళ్ళి" - చిట్టిబాబు రాణి వంకే చూస్తున్నాడు.

"మరింకేం, నేనూ వస్తాను....అందరినీ చూస్తా."

"నువ్వా. ఒక్క పది నిముషాలు అక్కడ ఉండలేవు - నేను ఆ ఇంట్లో ఓ గంట ఉండలేను - ఓ, ఆ చిన్న ఇల్లు, ఆ బావి, ఆ ఇండి ముందర కాలువ - అమ్మో - ఇంపాసిబుల్ - నువ్వేం వస్తావు" నవ్వాడు చిట్టిబాబు.

* * *

కారు గుమ్మంలో ఆగగానే పిల్లలంతా మూగారు చుట్టూ. 'అన్నయ్యొచ్చాడు', 'బాబాయొచ్చాడు' - ఇంట్లో అంతా గబగబా బయటికొచ్చారు.

ఫుల్ సూట్‌లో, అందంగా, దర్జాగా, ఠీవిగా వెలిగిపోతున్న చిట్టిబాబు లోపలకొచ్చాడు....ఇల్లంతా కలయచూశాడు - ఏమిటో ఎంతో కొత్తగా అనిపిస్తోంది....ఎవరితో ఏం మాట్లాడాలో తెలియటంలేదు....అబ్బ ఇంతా ఈ చిన్న ఇరుకు కొంపలో ఎలా జీవిస్తున్నారో! అన్నయ్యా, వదిన అలాగే వున్నారు. ఏ మార్పులేదు. చిట్టిబాబు అటు చూస్తున్నాడు - ఈ ఇంట్లోనేనా తను ఇరవై నాలుగేళ్ళు గడిపింది? ఈ ఇంట్లోనేనా తను బి.ఎ. వరకు చదువుకుని ఫస్టుక్లాసు తెచ్చుకున్నది? గోడలకేసి చూశాడు చిట్టిబాబు - తాతగారు, బామ్మ వున్న పెద్ద ఫోటో - మరోవైపు సీతారామ లక్ష్మణ హనుమంతుల ఫోటో - ఇంకోవైపు సత్యనారాయణస్వామి పటం - ఓ పక్కన అన్నయ్య పెళ్ళి ఫోటో - చిట్టిబాబుకి నవ్వొచ్చింది.

"అమ్మాయిని కూడా తీసుకురా లేకపోయావా?" తండ్రి గొంతు గంభీరంగా వినిపించింది చిట్టిబాబుకి.

"ఊఁ....టైము లేదుకదా, నేను కూడా ఓ పది నిముషాల్లో వెళ్ళి పోతాను." చిట్టిబాబు ఎటో చూస్తున్నాడు.

"భోజనం చేసి వెళ్ళు - అయినా ఒక్క నాలుగు రోజులు ఉండేట్టు వస్తే." తల్లి వంటింటి గుమ్మంలో నుంచుంది. చిన్నన్నయ్య ఫక్కున నవ్వాడు.

"అమ్మా - వాడు ఒక్క పది నిముషాలు వుండటం కోసం వచ్చాడు - నువ్వు నాలుగు రోజులుండటం గురించి అంటుంటే - అదే నాలుగు రోజులు అంటే ఎన్ని పది పది నిముషాలో లెక్కేస్తున్నా-" మళ్ళీ నవ్వాడు చిన్నన్నయ్య.

"నే వెడతానమ్మా....గెస్ట్‌హౌస్‌లో నా స్నేహితుడు నా కోసం వెయిట్ చేస్తుంటాడు."

"పెద్దాడి కూతురి పెళ్ళి పై నెలలో. నువ్వు, మీ ఆవిడ రావాలి మరి....ఇదిగో, అందరినీ నువ్వు చూసినట్టూ వుంటుంది...."

"ఆ చూద్దాంలే - వీలుండాలిగా....అయినా డబ్బు ముఖ్యం ఆ సమయంలో - మీరు ఊరికే బంధువులని, ఇరుగు పొరుగులనీ డబ్బు అవసరంగా తగలేయకండి....అన్నయ్యకి నేను ఉత్తరం రాస్తా తర్వాత - మరి నేను వెడతాను...." చిట్టిబాబు లేచాడు. చేతిలో వున్న కాఫీ గ్లాసు కింద పెట్టాడు.

"ఒరేయ్ - ఇది నీకు ఇష్టం - తీసికెళ్ళు, పెళ్ళికొస్తావుగా మళ్ళీ పెట్టి ఇస్తాను" - వంటింట్లోంచి గబగబా తెచ్చిన నిమ్మకాయ సీసా అందించింది.

"ఈ మాటొస్తాగా - అప్పుడు తీసుకుంటాను ......బాగ్‌లో ఇది పెడితే - అ - నో, వద్దులే." చిట్టిబాబు ఆ చిన్న సీసా బల్లమీద పెట్టేసి కారులో కూర్చున్నాడు.

కారు కదిలిపోతుంటే నీళ్ళు నిండిన కళ్ళు ఒత్తుకుంది తల్లి రహస్యంగా.

"మనవాడు చాలా ఎదిగిపోయాడే" గుమ్మంలో కూచున్న చిన్నన్నయ్య అంటుంటే,

"ఆ....చాలా, చాలా" - గదిలో అటు ఇటు తిరుగుతూ తండ్రి గొంతు కలిపాడు.

బాబాయి వేసుకున్న సూట్ బాగుందని, పెట్టుకున్న కళ్ళజోడు ఎంతో ఖరీదైందని, బూట్లు ఎంతో నిగనిగలాడుతూ చక్కగా వున్నా యని, బాబాయి చేతికున్న వాచీ ఫారిన్‌దేనని - ఇలా ముచ్చట్లు చెప్పు కుంటూ మురిసిపోయారు ఆ ఇంట్లో వున్న పిల్లలు.

* * *

చిట్టిబాబు బంగ్లా దీపాలతో ధగధగలాడిపోతోంది. ఖరీదయిన కార్లు బారులు తీరివున్నాయి. ఆఫీసర్లు, వారి భార్యలు, వారి పిల్లలు, ఆ పిల్లలను ఎత్తుకుని ఆడించే పనిపిల్లలు - ఆ బంగ్లా ఎంతో సందడిగా వుంది. అందమైన బట్టలతో, ఆభరణాలతో అక్కడున్న ఆడవాళ్ళంతా వెలిగిపోతున్నారు. ఏమిటా హడావిడి? చిట్టిబాబు వంశోద్ధారకుడు దిలీప్ పుట్టిన రోజు పండుగ!

"ఎన్నిసార్లనుంచో అనుకుంటున్నాను - ఆ గోల్డు మెడల్ చూడాలని" - మిసెస్ మీనన్ పైట పిన్ను సరిచేసుకుంటూ అంది. గబగబా లోపల కెళ్ళింది లీలారాణి.

"ఆల్ హిజ్ ప్రైడ్ ఈజ్ దిస్" - లీలారాణి ఓ అందమైన చిన్న ప్లాస్టిక్ పెట్టె తెచ్చింది ఉత్సాహంగా - ధగధగా మెరుస్తోంది బంగారు పతకం!

ఆ బంగారు పతకంపైనే అందరి కళ్ళు.

"మా వారి కొచ్చిన గోల్డు మెడల్ లాకర్‌లో దాచుకున్నారు - మనవడికి చూపించాలట" మిసెస్ సుబ్రహ్మణ్యం అంది. అందరూ నవ్వారు.

"మా వారికి భయం - నేను ఆ గోల్డు మెడల్ కరిగించి గాజు చేయించుకుంటానేమోనని" - రామలక్ష్మి గలగలా నవ్వింది. పెట్టెలోంచి బయటికి తీసి అందరూ చూశారు ఆ బంగారు పతకాన్ని.

"నిజంగా గోల్డుమెడలా అమ్మమ్మా....మా నాన్న కొచ్చింది వెండి మీద గోల్డుపూత అని చెప్పావు." అనిత ఆ గోల్డు మెడల్ అటు ఇటు తిరగేస్తూ చూస్తోంది.

లీలారాణి, చిట్టిబాబు వచ్చిన అతిథులతో కబుర్లుచెబుతూ వున్నారు. గోల్డుమెడల్ పెట్టెలో పెట్టి, ఆ పెట్టె బ్యాగ్‌లో పడేసుకుంది లీలారాణి.

నిద్రపోతున్న పసివాణ్ణి గదిలో పడుకోబెట్టి, హాండ్ బాగ్ పక్కన పెట్టి, తలుపు దగ్గరగా వేసి వచ్చింది లీలారాణి. పసివాడు గాఢనిద్రలో మునిగిపోయాడు.

"బాబుని చూసుకో" లీలారాణి అక్కడున్న నౌకరుతో చెప్పి ముందు హాలులోకి వచ్చేసింది.

పార్టీ అద్భుతంగా సాగింది. పిల్లలు రికార్డు డాన్సులు చేశారు. కొందరు జోక్స్ చెప్పారు. అందరు హాయిగా భోజనాలు చేశారు.

అలసిపోయిన చిట్టిబాబు ఆవులిస్తున్నాడు. ఎక్కడివాళ్ళు అక్కడ వెళ్ళేసరికి రాత్రి పన్నెండు కావచ్చింది. అలిసిపోయిన అలుమగలు మంచంపై వాలిపోయారు. పసివాడు గాఢనిద్రలో వున్నాడు.

ఒక్కసారి చిట్టిబాబుకి మెలకువ వచ్చింది. అటుఇటు ఒత్తిగిల్లాడు. ఒక్క పొరపాటు చేశాడు తను. ఎన్నో వేలు ఖర్చు చేశాడు. ఎందరో వచ్చి భోంచేశారు. కానీ....కానీ....ఒక్క నిముషం గొంతు తడారినట్టు అనిపించింది చిట్టిబాబుకి. మంచినీళ్ళు తాగాడు.

తనకి చదువు చెప్పించి, అనుక్షణం తన క్షేమంకోరేవాళ్ళనే తను మరచిపోయాడు కదూ!

"రాణీ, రాణీ...." కదిలించాడు.

"అబ్బ! ఏమిటండీ?" అటు ఒత్తిగిలి పడుకుంది లీలారాణి.

"అమ్మనైనా రమ్మని రాయాల్సింది కదూ!" మాటలు తడబడ్డాయి.

"ఏమోనండీ....అబ్బ, ఇవి చాలా బరువుగా వున్నాయి. తీసేస్తాను." నిద్ర కళ్ళతోనే చెవులకున్న పెద్ద పెద్ద వజ్రాల దుద్దులు తీసి దిండుకింద పెట్టి మళ్ళా నిద్రపోయింది లీలారాణి. చిట్టిబాబుకి నిద్ర పట్టలేదు. యాష్ట్రే సిగరెట్టు నుసితో నిండిపోయింది.

"ఆ- ఎవరి అదృష్టం వాళ్ళది." చిట్టిబాబు స్వగతం చెప్పుకుని క్షణంలో తృప్తిగా నిద్రపోయాడు మళ్ళీ!

*　　　*　　　*

తొమ్మిది దాటాక నిద్ర లేచారు లీలారాణి, చిట్టిబాబు. ఆ పని ఈ పని అయిపోయింది. పిల్లాడికి స్నానం చేయించి, పాలు పట్టి తెచ్చింది ఇంట్లో పనిమనిషి.

"ఈరోజు హోటల్‌లో భోంచేద్దాం." లీలారాణి చీర కుచ్చెళ్ళు సర్దుకుంటోంది

ఊ-రాణీగారి మాటకి ఎదురేముంది?"

అద్దంలో చూసుకుంటున్న లీలారాణి వంకే చూస్తున్నాడు చిట్టిబాబు.

లిప్‌స్టిక్ పెదాలు, సన్నని కనుబొమలు, పల్చని చెక్కిళ్ళు, భుజాల వరకు కత్తిరించిన జుట్టు-అలానే చూస్తున్నాడు చిట్టిబాబు-తల్లిలా కనిపించకూడదనే తాపత్రయం!

ఎందుకో నవ్వొచ్చింది చిట్టిబాబుకి.

"కొత్తగా చూస్తున్నా రేమిటీ?" బాగ్ భుజాన తగిలించుకుంటూ అంది లీలారాణి.

*　　　*　　　*

హోటల్లోన కూర్చున్నాక, పక్కనున్న మెనూ కార్డు చూస్తూ, "ఈరోజు మీకు నేను లంచ్ ఇస్తున్నాను-ఏం కావాలో మీరే ఎన్నుకోండి." కార్డు భర్తకి అందించింది. చిట్టిబాబు కార్డు చూస్తున్నాడు. పెదాల లిప్‌స్టిక్ టచ్ చేసుకోడానికి బాగ్ తెరిచింది లీలారాణి - చిన్న అద్దం కోసం. తక్కున గుర్తొచ్చింది - రాత్రి ఆ బాగ్‌లోనే గోల్ మెడల్ వున్న చిన్న పెట్టె పడేసిన విషయం. లీలారాణి గబగబా బాగ్ అంతా కలియచూసింది.

చిన్న పెట్టె ఎక్కడా కన్పించలేదు. ఖంగారుగా బాగ్‌లోంచి ఒక్కొక్కటి బైటికి తీసింది. పూల పూల రుమాలు, పక్క పిన్నులు, నైల్ కట్టర్, ఏరోగ్రాములు తలనొప్పి మాత్రలు, వందల నోట్లు - ఇలాంటివి మరెన్నో ఎన్నో బాగ్ బోర్లించింది. అన్ని వైపులవున్న జిప్‌లు తెరిచి మరీ మరీ చూసింది. ఏదీ....ఏదీ తన భర్త జీవితమార్గాన్నే మార్చేసిన గోల్డుమెడల్! తన భర్త అహానికి ఆయువుపట్టయిన గోల్డ్ మెడల్ ఏదీ!

లీలారాణి ముఖమంతా చెమట - కళ్ళలో నీళ్ళు-శ్రద్ధగా గాడ్రెజిలో పెట్టి తాళ్ళం వేసివుంటే!

చిట్టిబాబు, ది గోల్డుమెడలిస్ట్‌కి అర్థమైపోయింది. దేన్ని చూసి ఇంత కాలం గర్వపడిపోయాడో, తను చాలా తెలివైనవాడని తక్కిన వాళ్ళని ఎంత తేలిగ్గా తీసిపారేశాడో, దేన్ని అమితంగా ప్రేమించి అందర్నీ దూరం చేసుకున్నాడో, దేన్ని చూసుకుని అహం నింపుకుని నింగి వరకు ఎదిగిపోయానని అహంకరించాడో- అదే, ఆ గోల్డ్ మెడల్ ఏదీ ఏదీ!

ఇల్లంతా వెతికారు. మూల మూలలా గాలించారు. చిట్టిబాబు గుండె పట్టులెక్కడో కదిలాయి. కన్నీళ్ళంటే అసహ్యించుకునే చిట్టిబాబు దిండులో తలదాచుకుని నిశ్శబ్దంగా రోదించాడు.

ఆ ఇంట్లో ఏదో అశాంతి నిండిపోయింది. భార్యాభర్తల మనసు లెందుకో చిన్నపోయాయి. ఆనాడు స్నాతకోత్సవంలో మోగిన కరతాళ ధ్వనులు చెవుల్లో మారుమ్రోగాయి చిట్టిబాబుకి. నిద్రలేని రాత్రులు ఎన్నో గడిచిపోయాయి- చిట్టిబాబుకి తన బాల్యం, తను పెరిగిన వాతావరణం, తన ఇల్లు, తన అన్నయ్యలు, చెల్లెళ్ళు, తన రవిబావ - కళ్ళముందు కదలాడుతుంటే, చిట్టిబాబు మనసు ప్రశ్నించింది- ఇంతవరకు తను పోగొట్టుకున్నవి ఎన్ని, వాటి విలువ ఎంత?

తనను ప్రేమించి, చదివించిన అన్నలను తను ఇంతకాలం మరిచి పోయాడా, తన చిన్ననాటి స్నేహితులని గుర్తుంచుకున్నాడా, తన బంధు వులని తను ఆప్యాయంగా పలకరించాడా నిజానికి ఎన్నిటికో దూర మయిపోయి, హోదా ముసుగులో, ఐశ్వర్యపు అహంలో జీవించిన తను వాళ్ళందరికన్నా ఏ విధంగా గొప్పవాడు?- చిట్టిబాబు మనసు ఆవేదనలో మునిగిపోయింది. మనిషి ఆనందాన్ని పంచుకుందుకు ఎందరుండాలో,మనిషి ఆవేదనని పంచుకుందుకు అందరుండాలి అని అమ్మ ఎప్పుడూ అనేమాట గుర్తొచ్చింది చిట్టిబాబుకి- తన వాళ్ళంతా తనను ఎందుకు వదిలేశారు?- చిట్టిబాబు ఈ లోకంలో ఒంటరివాడయిపోయినట్టుగా బాధపడిపోయాడు. నింగినుండి నేలకు పడిపోయాడు. ఎవరి ఆప్యాయతలు లేకుండా మనిషి జీవించగలడా? ఏ విలువలూ లేకుండా జీవితం గడిపేయగలడా? చిట్టి బాబుకి సమాధానం దొరకలేదు.

తన గోల్డుమెడల్ పోయింది. ప్రాణానికి ప్రాణంగా దాచుకున్నది పోయింది. ఈ విషయం తెలిస్తే ఎవరు తనపై జాలిపడతారు? ఎవరు తనని ఓదారుస్తారు?

నెల రోజులు గడిచాయి. ఆ రోజు చిట్టిబాబు ఆఫీసు నుంచి ముందరే వచ్చేశాడు.

"నా గోల్డుమెడల్ పోయింది. ఏ గర్వంతో మీ అందరి ఆప్యా యతల్ని కాలదన్నానో, ఇప్పుడు తల్చుకు సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించరా". ఒకనాడు తనని ప్రేమించిన వాళ్ళకి, దీవించిన వాళ్ళకి, కన్న వాళ్ళకి, ఆడుకున్న వాళ్ళకి ఎందరెందరికో ఉత్తరాలు రాశాడు చిట్టిబాబు.

రోజూ పోస్టుమాన్ కోసం ఎదురు చూస్తూనే వున్నాడు ఆ రోజునుంచీ-

ఎవరికి పట్టింది ఆ వుత్తరానికి వెంటనే సమాధానం రాయటానికి?

చాలా రోజులకి ఒకే ఒక్క ఉత్తరం చిట్టిబాబుకి అందింది. ఆనందంతో ఉక్కిరి బిక్కిరై కళ్ళకద్దుకున్నాడు. అది అమ్మ ఉత్తరం! ఆ ఉత్తరం కింద నాన్న రెండు వాక్యాలు- "మానవ విలువలు పోగొట్టు కోటం తేలిక, నిలబెట్టుకోవటం కష్టం."

నిజమే! పోగొట్టుకున్న ఆప్యాయతల్ని తిరిగి ఎలా పొందగలడు, ఏ విద్యతో సాధించగలడు, ఏ ధనంతో కొనగలడు, ఏ ప్రలోభంలో పెట్టి చేజిక్కించుకోగలడు-నిజమే! తనకెవరూ లేరా- చిట్టిబాబు ఎటో చూస్తు న్నాడు. ఒళ్ళోవున్న అమ్మ ఉత్తరంపై ఆగని కన్నీళ్ళు బొట్టు బొట్టుగా జారిపడ్డాయి.

*

# సుశీల మనసు

''హమ్మయ్య! యింక గెలిచిపోయాను'' అనుకున్నాడు ప్రకాష్, సుశీల నెల తప్పిందని తెలిసిన మరుక్షణంలో. ''హమ్మయ్య! మళ్ళా బతికాను'' అనుకుంది సుశీల తాను నెల తప్పిందని, గ్రహించగానే.

ఆ సాయంత్రం ఎన్నో స్వీట్సు, పళ్ళు యింటికి తెచ్చాడు ప్రకాష్.

''సెలెబ్రేట్ చేస్తున్నాను'' అన్నాడు నవ్వి సుశీలతో. ''అవును సెలెబ్రేట్ చెయ్యాల్సిందే'' - సుశీల - చీరపైనున్న ఎంబ్రాయిడరీ పూలు చూసుకుంటూ!

''ఒక్కోసారి సమస్యలు వాటంతట అవే విడిపోతాయి కదూ'' - సుశీల ప్రకాష్ కళ్ళలోకి చూస్తూ.

ప్రకాష్ చూపులు ఎక్కడో - క్షణం సుశీల కళ్ళనిండా భయం!

''ఏమిటీ-మళ్ళా మూడ్ మారిపోయిందా—''

''ఆ ఏం లేదు'' - చేతిలో సిగరెట్టు కిటికీలోంచి విసురుతూ ప్రకాష్.

''ఈ రోజు ఆయన్ని కలసి చెప్పేస్తాను - నేను కనిపించి కూడా ఎన్నో నెలలైంది.''

''నేను చెప్తాగా ఎప్పుడెళ్ళాలో - ఇద్దరం కలసే వెడదాం-సరేనా?'' సుశీల ప్రకాష్ మాటలు వింటూ తలూపింది.

కాలం గడుస్తుంటే సుశీల మనసూ మారింది. ప్రకాష్ చాలా మంచి వాడు - అన్నగారి మాటలు విని అలా అయిపోయాడు - అంతే -

యిప్పటికైనా మంచి రోజులొచ్చాయి - సుశీల రాబోతున్న మంచి రోజుల్ని గురించి ఆలోచిస్తోంది.

*　　*　　*

సుశీల తల్లి కూరగాయలమ్మేది. సుశీల మిషన్ కుట్టేది. తండ్రి రైల్వేలో లైన్‌మన్. చిన్న నౌకరీలో ఉన్న ప్రకాష్ ఆఫీసరు గారింటి కొచ్చేవాడు ఏదో పని చేయడానికి. ఆ ఇంట్లోనే వెనుక చిన్న గదిలో ఉంటున్న సుశీల కుటుంబంతో ప్రకాష్‌కి పరిచయమైంది. ఆ పరిచయం అలా పెరిగి పెళ్ళివరకు వచ్చేసరికి సుశీలకి, తల్లిదండ్రులకి కూడా భయ మేసింది. "చూడు నాయనా, మీ పెళ్ళికి మీవాళ్ళు ఒప్పుకోరు - తరువాత పేచీలూ అవీ బావుండవు .... నువ్వేమో రిజిష్టరు పెళ్ళి చేసుకుంటానంటు న్నావు - బాగుండదు-మాకూ యిష్టం లేదు - మీ వాళ్ళని ఒప్పించి ...." సుశీల తల్లి మాటలకి ఓ నవ్వు నవ్వాడు ప్రకాష్.

"మా వాళ్ళు నా విషయం పట్టించుకోడం మానేసి చాలా ఏళ్ళ యింది - నేను శ్రద్ధగా చదువుకోలేదని, బుద్ధిగా లేనని మా వాళ్ళు పూర్తిగా నా ఖర్మకి నన్ను వదిలేశారు - కాబట్టి వాళ్ళని గురించి మీకేం భయం వద్దు - కాకపోతే మీకు, ముఖ్యంగా సుశీలకి యిష్టం లేకపోతే .... సరే" - ప్రకాష్ సుశీలకేసి చూస్తూ అన్నాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకే ప్రకాష్ సుశీలల వివాహం అయి పోయింది, నువ్వు లేకపోతే నేను బతకలేనని. నువ్వు బతికితేనే నేను బతి కేదని మైమరచి మాట్లాడుకున్న మధుర క్షణాలు గడిచిపోయాయి. అంతే!

యుగాలు క్షణాలుగా గడిచిన రోజులయిపోయాక - క్షణాలు యుగాలుగా గడవటం మొదలు పెట్టాక - ప్రకాష్ గతాన్ని గురించి ఆలోచించడం మొదలు పెట్టాడు - తను చేసిన పనివల్ల తనకు వచ్చిన నష్టాలు లెక్క వేసుకోటం మొదలయిందప్పుడే!

తన ప్రవర్తనంటే యిష్టంలేకపోయినా తన వాళ్ళందరికీ తనంటే ప్రేమ లేకపోలేదు - మరి - తనని చిన్నప్పుడు తల్లి తండ్రులు చేసిన గారాబం! తన అన్న తనని ఎంత ముద్దుగా చూసేవాడో - తన వాళ్ళందర్నీ వదిలి తనొక్కడయి పోయాడు - తన వివాహం విషయం విన్న అమ్మ కళ్ళల్లో నిండిన నీళ్ళు, మూగవేదన తనెలా మరచిపోతాడు - తనెందుకీ పొరబాటు చేసాడు - ఏమో - ప్రకాష్ మొదటి సారిగా తన వివాహాన్ని గురించి తల్చుకుని పశ్చాత్తాప పడటం మొదలెట్టాడు- "ఇప్పుడైనా వాళ్ళు తనని క్షమిస్తారు ....''

* * *

ఓ రోజు డబ్బు తీసికెళ్ళిన మర్నాడే వచ్చింది.

"ఏం - ఈరోజు కూడా మళ్ళా డబ్బిస్తాడనుకున్నావా?" అన్నాడు నవ్వుతూ రామనాథం.

"కాదండి...." కొంచెం జంకింది సుశీల.

"ఏమిటి మరి-"

"నిన్న మా యింటికొచ్చారు-"

ఉలిక్కిపడ్డాడు రామనాథం.

"నిన్న వచ్చాడా - చూడమ్మా - ఒక్కసారి కూడా రానీయకు - ఒక్క నిమిషం కూడా ఉండనీయకు - తెలిసిందా?" సుశీల మాట్లాడ లేదు.

"నిర్మొహమాటంగా చెప్పేయి - రావద్దని - నాతో వచ్చి ఏమన్నా చెప్పాల్సింది ఉంటే చెప్పమను-" చాలా గంభీరంగా ఉన్న రామనాథం ముఖం చూడ్డానికి భయమేసింది సుశీలకి.

ఇంటికొచ్చి మాట్లాడితే తప్పేముంది - మనసులో అనుకుంటూ "సరేనండి" - నెమ్మదిగా వెళ్ళిపోయింది సుశీల.

ఆ ఆత్రంతా రామనాథం ఇదే ఆలోచిస్తున్నాడు. ప్రకాష్ మొదట ఇంటికొస్తాడు - తర్వాత! తర్వాత - సుశీల భవిష్యత్తు గాఢాంధకారంగా కనిపించింది రామనాథానికి.

* * *

సుశీల కొన్ని నెలలు కనిపించలేదు రామనాథానికి. ప్రకాష్ రామనాథం దగ్గరకొచ్చి డబ్బు యివ్వటం మానేశాడు - వాళ్ళిద్దరూ ఏమయ్యారు - బహుశ పెద్దలెవరయినా రాజీ చేసారేమో! అనుకున్నాడు రామనాథం ఒకటి రెండుసార్లు.

* * *

లోపలనుంచి వచ్చిన రామనాథం ఆఫీసు గదిలో కూచున్న సుశీలను చూసి విస్తుపోయాడు.

"ఎలా గడుపుతున్నావు? డబ్బు తెచ్చి యివ్వటమేలేదు" అన్నాడు సుశీలను చూస్తూ.

సుశీల చటుక్కున తలెత్తి చూసి, నాలుక కరుచుకుంది. "ఇంటికి తెచ్చి యిస్తున్నాడు-" ముసి ముసిగా నవ్వుతోంది. "ఇంటికొచ్చి యిస్తున్నాడా-అలా తీసుకోవద్దని చెప్పానుగా! కోర్టులో కేసున్నంతవరకు యింటికి రానియ్యవద్దని యింతకు ముందు కూడా చెప్పాను నీకు." రామనాథం ముఖం కోపంతో జేవురించింది.

"ఇందులో పెద్ద కుట్ర వుంది"- గబగబా సిగరెట్టు ముట్టించాడు.

సుశీలకి రామనాథం మాటలు చాలా కోపాన్ని కలిగించాయి.

"ఇందులో కుట్ర ఏముంది - మీకిచ్చి మీరు నాకిచ్చినా అతనే నాకిచ్చినా రెండూ ఒకటేగా?" అంది. వెంటనే "ఒకటి కాదు-అవి రెండు" అరిచాడు రామనాథం.

ఈ ప్లీడర్లంతా యింతే - కలిసివస్తే సమయానికి చెతగొడతారు-ఏం, యింటికొచ్చి డబ్బిస్తే? ఏమో-ఏ నిముషంలోనైనా అతని మనసు మారొచ్చుగా? నిజానికి ప్రకాష్ మంచి వాడే .ఆ క్షణంలో నామనాథం పరమ కిరాతకునిలాగ, ప్రకాష్-హృదయమున్న గొప్పవ్యక్తి-పరిస్థితులకి తలొగ్గి దీనుడై పోయినట్లు అనిపించింది సుశీలకి.

నెమ్మదిగా లేచి నిలబడింది. ఒక్క నిముషం ఆగి రెండడుగు లేసింది.

"వాణ్ణి పొరబాటునకూడా నీ యింట్లో అడుగు పెట్టనీయొద్దు-ఈ నెల డబ్బిస్తే తీసుకోకు - యిక్కడికే తెచ్చి యిమ్మను-నువ్వు వచ్చి తీసుకెళ్ళు - నేను అనుభవంతో మాట్లాడుతున్నాను - ఎన్నో మోసా లుంటాయి - అర్థమయిందా?-" రామనాథం మాటలు విని, "ఆ" అంటూ గబగబా బయటకు నడిచింది సుశీల.

"ఏమిటిది - డబ్బిచ్చేది నేనేగా - రాత్రి వస్తాను, పగలు వస్తాను-నా యిష్టం" అంటాడు ప్రకాష్ - అతను రావటం తనకీ యిష్టమే - ఈ మధ్య యిక్కడే ఉండిపోతున్నాడు-మనిషి ఎంతగా మారిపోయాడు! సుశీల నడుస్తోంది.

"ఇదేమిటి మరి - 'నేను అనుభవంతో చెప్తున్నాను - అతన్ని రాని య్యొద్దు. యిందులో ఏదోవుంది' అంటాడు రామనాథం - ఏముంది-కొన్ని రోజులయ్యాక డబ్బు యివ్వటం మానేస్తాడు - పోనీ, మనిషే తనవాడవు తుంటే డబ్బు యివ్వడం, ఇవ్వక పోవటం ఏమిటి?''- సుశీల నడుస్తోంది.

తను, భర్త ఒకటైపోయినట్లు, హాయిగా కాపురం చేసుకుంటు న్నట్లు, కోర్టుకెళ్ళి ప్రకాష్ కేసు కొట్టించేసినట్టు వూహిస్తూ గబగబా నడిచింది.

వీధి గుమ్మంలో ప్రకాష్ సైకిల్ కనబడింది, అప్పుడే వచ్చాడే. ఏమన్నా కానీ యింక యీ ప్లీడరు దగ్గరకెళ్ళను - ఏన్నేం చేస్తారేం! సుశీల చాలా హుషారుగా యింట్లోకి అడుగు పెట్టింది.

సుశీల ప్లీడరు దగ్గరకెళ్ళటం పూర్తిగా మానేసింది. ప్రకాష్ పూర్తిగా సుశీల యింట్లోనే వుండిపోతున్నాడు.

రోజులు గబగబా గడుస్తున్నాయి. సుశీలకి నెలలు నడుస్తున్నాయి. సుశీలకి చాలా గర్వంగా సంతోషంగా వుంది. ఈ మాటు ప్లీడరుగారి ఆఫీసుకి నా బాబుని ఎత్తుకు వెడతాను - ఏం చేస్తారో? నవ్వుకుంది.

* * *

పక్కలో వున్న పసి కందుని గుండెలకి హత్తుకుంది సుశీల. ఈ కోర్టులు, సాక్షులు, ప్లీడర్లు-ఏమన్నా కాని-నేనూ, నా బాబు"…. సుశీల ఆనందం ఆకాశాన్ని అంటకముందే క్షణంలో చీకట్లు ముసిరాయి. పసికందు కళ్ళుతెరిచినట్లే తెరిచి శాశ్వతంగా కళ్ళు మూసుకున్నాడు.

"ఈ వానలో మళ్ళా పుస్తకం ఎక్కడ తెచ్చేది-ఆ మూల పాతిపెట్టు!'' అన్నాడు వల్లకాటి గుమస్తా ఆ రాత్రి సుశీల తండ్రితో, జోరున వాన కురుస్తుంటే. ఇలా పుట్టి అలా వెలిగి, పేరన్నా లేకుండా మట్టిలో కలసిపోయిన పసివాణ్ణి తల్చుకుని గొల్లున ఎడ్చింది సుశీల ఒంటరిగా!

తనని హాస్పటల్‌లో చేర్పించి, పిల్లాడు పుట్టినట్లు రిజిస్టరులో రాయించానని చెప్పిన ప్రకాష్ ఏడీ? సుశీల మనసు విలవిల్లాడి పోయింది-రాకేం చేస్తాడు-పిల్లాడు లేని దుఃఖం అతన్ని పీడిస్తోంది - అంతే! సుశీల మనసులోనే వూరట చెందింది. కానీ ఆ వూరట మనసులోనే అణిగి పోయింది. మళ్ళా చూడలేదు ప్రకాష్‌ని సుశీల అప్పట్లో!

రోజులు పరిగెడుతున్నాయి.

కళా కాంతి లేకుండా, జీవచ్ఛవంలా సుశీల రామనాథం ఆఫీసులో కూర్చొనివుంది తలొంచుకుని.

"ఇదిగో చూడు"—సుశీల వైపు విసిరాడు నోటీసు కాగితం రామనాథం. అతని కళ్లు, ముఖం ఎర్రబడ్డాయి. "చదువు!" గర్జించాడు.

సుశీల తలెత్తలేదు.

"నీ క్లయింటు వ్యభిచారి— ఫలానా హాస్పటల్లో పురుడు పోసుకుంది—కొడుకుని కంది—మనోవర్తి రద్దు చేస్తున్నాను" అంటున్నాడు.

"ఏం సమాధానం చెప్తాం—" రామనాథం అరిచాడు. ప్రపంచం నిండా మోసం, ప్రపంచంనిండా అన్యాయమే వున్నట్టు అర్థమయిపోయిన సుశీలకు కన్నీళ్ళాగలేదు.

అతనొచ్చినప్పుడు తనెందుకు రానిచ్చింది?

తనకీ అతను కావాలనిపించింది—యిప్పటికి కావాలి—

మరి అతనికో—ప్రకాష్ తలపుకు రాగానే సుశీల కన్నీళ్ళాగకుండా ఒళ్లో వచ్చి పడ్డాయి.

ఆ పిల్లాడే వుంటే— వుంటే— తనని రక్షించేవాడా!— సముద్రంలో కొట్టుకుపోతూ గడ్డిపోచకోసం చూడటం యిదే!

సుశీల చాలాసేపు రామనాథం ఆఫీసులో కూర్చుంది. "మరి-నేను...." సుశీలకి గొంతు పెగలటంలేదు. "నేనేం చేయలేను-తీసుకెళ్ళు-" రామనాథం ఫైలు బయటకి తీశాడు.

"ఇప్పుడర్థమయిందా ఎందుకు రానియ్యవద్దన్నానో?" సుశీలకేసి చూశాడు. సుశీల తలెత్తింది. ఆ చూపులో నీవే తప్ప ఇతఃపరంబెరుగనన్న దీనత్వం—కళ్ళనిండా నీళ్ళు—

పాపం—పిచ్చిపిల్ల—అంత పెద్ద వకీలు రామనాథమూ క్షణంలో కరిగిపోయాడు.

సుశీల కూర్చునే వుంది.

"సరే - ఆలోచిద్దాం—వెళ్ళు" అన్నాడు తాను కుర్చీలోంచి లేస్తూ. రామనాథానికి తెలుసు సుశీలకి ప్రకాశ్ అంటే ఇష్టమని— ప్రకాష్ చాలా అందంగా వుంటాడు. ఆకర్షణీయంగానూ వుంటాడు. సుశీల ప్రకాష్ని నమ్మనీ, అతనికి లొంగిపోవటంలో పెద్ద ఆశ్చర్యమేమీ లేదు—కాకపోతే యిప్పుడీ అమాయకురాల్ని రక్షించటం ఎలా— నిజం చెప్పి యీ కేసు గెలవటం సాధ్యమా?!

ధర్మాధర్మాల సంఘర్షణలో రామనాథం మనసు కొట్టుమిట్టాడింది.

ఉన్నట్టుండి మెరుపులాంటి ఆలోచన ఒకటి రామనాథం మెదడులో మెరిసింది. మనసు చాలా తేలికపడింది.

సుశీల వ్యభిచారి కనుక మనోవర్తి రద్దు చెయ్యాలని ప్రకాష్. ధరలు పెరిగాయి కాబట్టి మనోవర్తి పెంచాలని సుశీల కోర్టులో కేసులు దాఖలు చేశారు.

ఆ కేసులు విచారణ కొచ్చాయి.

ప్రకాష్ వకీలు హాస్పటల్లో సుశీలకి పురుడు పోసిన డాక్టరు చేత, పిల్లాడి బర్త్ సర్టిఫికెట్ సంతకం చేయించిన ఆమెచేత కోర్టులో సాక్ష్యమిప్పించాడు. సుశీల గగజ వణికిపోయింది భయంతో.

ఇంక ఆ డాక్టర్ని క్రాస్ ఎగ్జామిన్ చేయడం వుంది.

మధ్య మధ్య చాలా గర్వంగా చూసే ప్రకాష్!

మధ్య మధ్య చాలా బేలగా చూసే సుశీల!

రామనాథం చాలా గంభీరంగా ఉన్నాడు.

"డాక్టరుగారూ! మీ హాస్పటల్లో మీ దగ్గరకి కాన్పులకు వచ్చే వాళ్ళందరినీ మీరు గుర్తుపట్టగలరా?'' రామనాథం ప్రశ్నకి డాక్టరు నవ్వింది.

"చాలా కష్టం— ఎవరెవరో వస్తారు. వెడతారు— అంతే.''

"అయితే, మీ రికార్డుల్లో వున్న అమ్మాయి పురుడుపోసుకుని ఎంత కాలమైందో ఇప్పుడు చెప్పగలరా?'' డాక్టరు క్షణం ఆలోచించింది.

"రికార్డు చూసి మాత్రమే చెప్పగలను.''

"మంచిది—చూడండి.'' రామనాథం డాక్టరుకి రికార్డు అందించాడు.

"సుమారు మూడు నెలలు దాటింది.''

వెంటనే రామనాథం అన్నాడు "ఈ మూడు నెలల్లో మీరు ఎన్ని కేసులు చేశారు?''

బహుశా కొన్ని వందలు." డాక్టరు నవ్వింది.

"డాక్టరుగారూ— క్షమించాలి— మిమ్మల్ని విసిగిస్తున్నాను. ఈ మూడు నెలలుగా వచ్చివెళ్ళినవారి ముఖాలు, పేర్లు గుర్తుపట్టగలరా?"

"సాధ్యం కాదు.''

"అయితే మీ రికార్డు ప్రకారం సుశీల అనే అమ్మాయి మీ దగ్గర పురుడు పోసుకున్నానని చెప్తే మీరు ఆ అమ్మాయిని గుర్తించగలరా?''

"ఇమ్పాసిబుల్''—డాక్టర్ గట్టిగా చెప్పింది. రామనాథం చాలా హుషారుగా వున్నాడు.

"మీరు సాక్ష్యమిస్తున్న కేసులో సుశీల, మీ రికార్డులో పురుడు పోసుకున్నట్టుకున్న వున్న సుశీల ఒకరేనని చెప్పగలరా?''

"చెప్పలేను. కానీ—ప్రకాష్ భార్యని, సుశీల నా పేరు—అని చెప్పుకుని మా హాస్పటల్‌లో పురుడు పోసుకున్న సంగతి చెప్పగలను"—

డాక్టర్ కొంచెం ఖంగారుపడుతోంది. వెంటనే రామనాథం, "ఎవరైనా అమ్మాయి తనపేరు సుశీలని, ప్రకాష్ భార్యనని అబద్ధం చెప్పి పురుడు పోసుకు వెళ్ళచ్చుగా ?"

"ఆ—అలాటివి జరగవచ్చు...."

"అంటే- అసలు పేరు చెప్పకుండా, యింకో పేరు చెప్పుకుని హాస్పటల్లో చేరవచ్చు—అవునా?"

"అవును—కొన్ని సందర్భాలలో అలాటివి జరుగుతుంటాయి."

రామనాథం డాక్టరు సమాధానానికి చాలా ఆనందపడ్డాడు. "థాంక్యూ డాక్టర్!"

నిజంగా సుశీలే ప్రకాష్ ఆరోపణల ప్రకారం హాస్పటల్లో చేరితే ఆమె పేరు మార్చుకొనే చెప్పేదని, అప్పటికే కేసు జరిగి మనోవర్తి పుచ్చుకుంటున్న సుశీల తన నేరాన్ని కప్పిపుచ్చే ప్రయత్నమే చేసేదని, ప్రకాష్ కేవలం సుశీలకిచ్చే మనోవర్తి ఎగ్గొట్టే నిమిత్తం యీ నిందారోపణ చేసాడని, యీ కేసులో వున్న సుశీల, సుశీల అనే పేరుతో పురుడు పోసుకున్నఅమ్మాయీ ఒకరే అనటానికి ఏమాత్రం రుజువు లేదని, సుశీల పట్ల విముఖత ప్రకాష్‌కి వుందనటానికి రికార్డు ఆధారం చాలా వుందని, మనోవర్తి ఎగ్గొట్టే ప్రయత్నంతో యీ కుట్ర పన్నాడని చాలా గట్టిగా గొంతు చించుకుని మరీ మరీ చెప్పాడు రామనాథం కోర్టులో.

*                    *                    *

రెండు రోజుల తర్వాత తీర్పు వినటానికి వచ్చిన సుశీల గుండె దడదడలాడుతోంది. మేజిస్ట్రేటు చాలా హుందాగా కాగితాలు తీసి చదవటం మొదలుపెట్టాడు.

సుశీల గర్భవతే కాలేదని, పురుడే పోసుకోలేదని, కేవలం ప్రకాష్ మనోవర్తి ఎగ్గొట్టడానికే యీ తప్పుడు కేసు దాఖలు చేశాడు కనక యీ కేసు డిస్మిస్ చేస్తున్నానని తీర్పు చెప్పాడు.

సుశీల ముఖంలో ఒక్కసారి కొత్త వెలుగు వెలిగింది. గుండె బరువు తీరింది. గబగబా లేవబోయిన సుశీలని కూర్చోమని సైగ చేశాడు రామనాథం.

యాంత్రికంగా కూచుంది సుశీల.

మేజస్ట్రేటుగారు రెండో జడ్జిమెంటు చదవటం మొదలుపెట్టాడు.

నిత్యం ధరలు పెరుగుతున్న విషయం అందరికీ తెలుసు. పైగా - సుశీల తను స్వయంగా సంపాదించుకోలేదు కనుక నెలకు ఏభై రూపాయలు అదనంగా మంజూరు చేస్తున్నానని సుశీల దాఖలు చేసిన కేసులో తీర్పు చెప్పాడు.

* * *

ఆ రోజు రామనాథం ఆఫీసులో కూర్చుని ప్రకాష్ పంపిన నోటీసు చూసి నిర్ఘాంతపోయింది సుశీల. నోటమాట రాలేదు. తను నెల తప్పటంలో ఉన్న అధర్మమేమిటో అర్థం కాలేదు. ధర్మాధర్మాల సంఘర్షణలో కొట్టుమిట్టాడింది సుశీల మనసు అప్పుడు!

ఈ రోజు సత్యాసత్యాలతో సంబంధం లేకుండా తను కేసు గెలవటం గొప్ప ధర్మంగా, న్యాయంగా అనిపించింది సుశీలకి.

ఒక్కసారి న్యాయస్థానాన్ని తలెత్తి చూసి, ముందుకు నడిచింది సుశీల!

*

# సీటు దొరికింది

గబగబా నడుస్తూంది సంధ్య. ఈ బస్సు మిస్సయితే మళ్ళా ఎంతో సేపు నిలబడాలి....అది నడక అనడానికి వీల్లేదు - పరుగే అది....

'మేడమ్.... మేడమ్....' అయాసపడుతూ ఎదురుగా వచ్చి నిలబడింది. భుజాన బాగ్, చూడిదార్ పైజామా - రుమాలుతో ముఖం తుడుచుకుంది. కాగితం అందించింది.

'ఏమిటీ' అంటూనే కాగితపు మడతలు విప్పింది సంధ్య.

'ఇందిర.... ఇంది రెవరు....'

'మా పిన్ని - మీరు.... మా పిన్ని ఎమ్.ఎ.లో క్లాసుమేట్సట '

'ఓహో ఇందూ....' కాగితం మడతపెట్టి, బస్సు కోసం చూస్తూంది సంధ్య.

'తప్పకుండా మీ హెల్ప్ కావాలి.... మా పిన్ని రేపు మీ ఇంటికి వస్తానంది. ఆ ఇంట్లోనే ఉంటున్నారా?'

'ఆఁ.' బస్సు వచ్చే వేపే చూపు!

'మా పిన్ని ఈ నెల ఆరో తారీఖున స్టేట్స్ వెళ్ళిపోతోందండి-'
'హుఁ - అయితే నాకేమిటి' మనసులో అనుకుంటూ టైము చూసుకుంది.... అమ్మాయి ఏదో చెప్తూనే ఉంది - అడుగు ముందుకు పడనీయటంలేదు. అంతలో బస్సు నిలబడి నిలబడనట్టుగా వచ్చి వెళ్ళిపోయింది.

'ఇంక చెప్పు' - బస్స్టాప్ సిమెంటు బెంచిమీద తీరిగ్గా కూచుంటూ సంధ్య అమ్మాయి కేసి చూసింది.

'నాకు ఎలాగయినా ఈ కాలేజీతోనే చదవాలని ఉందండీ - ఎక్కడా అప్లయి చెయ్యలేదు-మీరు దయుంచి'-నవ్వు వచ్చింది సంధ్యకి.

'మంచిదే - నాలుగు రోజులయ్యాక కనిపించు....' చేతిలో ఉన్న కాగితం మడిచి పర్సులో పడేసింది. అప్పటికి అది పద్దెనిమిదో కాగితం! అన్నిటికీ ఒక సీజన్ ఉన్నట్లు ఇది ఎడ్మిషన్ల, సీట్ల సీజన్! ఎక్కడెక్కడలేని బంధువులు, స్నేహితులు, పరిచయస్థులు - ఒకళ్ళేంటి - బస్సులో ఒకనాడు కలసి స్టాపులో దిగినవాళ్ళు, ఒక రోజు రేషన్ షాపులో కలసి కిరసనాయిలు సమస్య ముచ్చటించుకున్నవాళ్ళు - ఒకనాడు కూరగాయల మండీలో కలసి బేరమాడి కూరలు కొన్నవాళ్ళు.... ఎందరెందరో ఆత్మీయులు - ఈ ఆత్మీయుల ఒత్తిడి తట్టుకోడం కష్టంగానే ఉంది. అయినా ఈ ఆత్మీయులనించి దూరమవటమూ సాధ్యం కాదు.

సంధ్య బస్సులో కూచుని ఆ కాగితం విప్పి మళ్ళీ ఒకమాటు చూసింది. 41 కంపార్టుమెంటల్ - ఏ మీడియం అయినా పరవాలేదు. ఈ అమ్మాయి ఎలాగయినా ఈ కాలేజీలోనే చదవాలనుకుంటోందా- బాగ్‌లో కాగితం పడేసింది.

రోజుకన్నా అర్ధగంట ఆలస్యంగా ఇల్లు చేరింది సంధ్య.

'మమ్మీ - నీ కోసం ఎవరో వచ్చారు. ఇందాకట్నుంచీ వెయిట్ చేసి ఇప్పుడే వెళ్ళారు.'

'హమ్మయ్య....'

'కాదు - పది నిమిషాల్లో మళ్ళా వస్తారుట. నిన్నెక్కడికీ వెళ్ళకుండా ఉండమన్నారు.' ఆ పై మాటలు వినిపించుకోకుండా లోపలకెళ్ళిపోయింది సంధ్య.

కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేస్తున్నారు అంతా.

'ఇటు విను. నువ్వు కాదనటానికి వీల్లేదు.'

'చెప్పండేమిటో -' సంధ్య భర్తకేసి చూస్తూ అంది.

'మా ఫ్రెండు రామం లేడూ....'

'ఉన్నాడు.'

'వాడి బావమరిది భార్యకి మీ కాలేజీలో సీటిప్పించాలి.'

'ఇప్పించడానికి నే నెవర్ని - బావుంది.'

'నాకు అవన్నీ తెలియవు - ఆ అమ్మాయికి సీటు రావాలి.'

'సరే - ఒక చీటిమీద వివరాలు రాయమనండి - చూద్దాం.'

'అన్నీ ఇచ్చాడు. భోజనం కానీ ఇస్తాను.'

'ఇవ్వండి - ఇవ్వండి.'

'నువ్వలా తేలిగ్గా నవ్వేస్తే కాదు - గ్రాడ్యుయేషన్ పూర్తయితే కాని పిల్లల విషయం తలపెట్టడానికి వీళ్ళేదని ఆవిడ కండిషనట - పాపం, మరి-'

'ఇదీ మరీ బావుంది - ఈ విషయమే చెప్పి సీటు ఇప్పించనా' - సంధ్య అంటుంటే డైనింగ్ టేబులు దగ్గర ఉన్న పిల్లలిద్దరూ ఫక్కున నవ్వారు. భార్య, భర్త ఒకళ్ళ ముఖం ఒకళ్ళు చూసుకున్నారు.

*　　　*　　　*

బాగ్‌లో కాదితాల సంఖ్య అనంతంగా పెరుగుగుతోంది. అన్నీ జాగ్రత్తగా మడిచి, చిరిగిపోకుండా, నలిగిపోకుండా అరలో మళ్ళా భద్రపరచింది.

'ఈ అద్ద మొదటి - చిన్న అందాన్ని వదిరెట్లు ఎక్కువగా చూపిస్తుంది. ఇది ఈ అద్దం ప్రత్యేకత.' నిలువుటద్దం ముందు నిలబడి మళ్ళీ మళ్ళీ తనని చూసుకొని 'బాచీ, టైము చెప్పరా' అని ఒక కేక పెట్టింది.

'మమ్మీ....నిన్నే - ఎవరో వచ్చారు .... ఎంత సేపు కూచుంటారు పాపం ఆయన!' బాచీ బొమ్మల పుస్తకం తిరగేస్తూ అన్నాడు. జ్వరంగా ఉందని స్కూలుకి వెళ్ళకుండా, జ్వరం తగ్గినా రెస్టు తీసుకుంటూ ఇంట్లో ఉంటున్నాడు బాచీ.

సంధ్యకి చాలా కోపం వచ్చింది. 'అబ్బా - నాకు టైము అయిపో తోంది - అయినా నేనేం చేయగలిగింది లేదని ఎన్నిసార్లు చెప్పినా, నా సమర్థత మీద వీళ్ళకి నమ్మకం - ఖర్మ -' విసుగ్గా ముందు గదిలో అడుగు పెట్టింది.

'నమస్కారమమ్మా. ..నన్ను గుర్తుపట్టారా?' ఏభై ఏళ్ళ పెద్దమనిషి ఎదురుగా - ఆ వ్యక్తిని ఎక్కడా చూసిన గుర్తు రావటంలేదు.

'ఆ రోజు - అదే కిందటినెల ఐదో తారీఖున - బాలాజీ భవన్‌లో పెళ్ళికి వచ్చారు కదా - ఆ పిల్ల మీ స్టూడెంటే - విజయ.'

'ఆః - విజయ' - గుర్తొచ్చింది.

'నేను ఆ అమ్మాయి మేనమామని .... నన్ను మీకు పరిచయం చేసిందా రోజు - మా అమ్మాయి కూడా ఇక్కడే చదివింది....' ఆయన ఏదో చెప్తున్నాడు.

పెళ్ళి కెళ్ళడం వరకు గుర్తుంది....కానీ ఈ మామయ్యలు, బాబా యిలు, తాతయ్యలు, బావలు వీళ్ళంతా కాక ఫ్రెండ్స్ - అబ్బా, ఎలా గుర్తుంచుకోటం - సంధ్యకి చాలా చిరాగ్గా ఉంది. ఇంతవరకు అసలు విషయం చెప్పడు——

'మా అమ్మాయీ మీ స్టూడెంటే....'

'ఏ సంవత్సరం?'

ఒక్క నిమిషం ఆగాడు. 'అదే - 1969 లో.' సంధ్యకి ఒళ్ళు మండిపోయింది. అంటే పన్నెండేళ్ళనాడు ఒక స్టూడెంటు, కొన్ని వందల మందిలో, గుర్తుంచుకోవడం సాధ్యమా....సంధ్య గడియారం వంక రెండు సార్లు చూసుకుంది.

'ఇంతకీ మీ ఇంకో అమ్మాయికా సీటు?'

ఆయన కాస్త సిగ్గుపడి 'అబ్బే, మా మనవరాలికి - ఫస్టుక్లాసు ఒక్క మార్కులో పోయింది. అంతే - అయినా క్లాసు వచ్చిన వాళ్ళకే సీట్లు వస్తున్నాయా ఏమిటి కాని....ఈ కాగితంమీద వివరాలన్నీ రాశాను- కాస్త శ్రద్ధగా చూడాలి. ఎలాగయినా వచ్చేట్టు చూడండి. మీ మేలు....' ఇంకా ఏదో అంటున్నాడు. కాగితం తీసుకుని లేచింది సంధ్య,

'అమ్మా! ఆ వెనక ఫోన్ నెంబర్లు వేశాను - సీటు రాగానే ఫోన్ చేస్తే వచ్చి ఫీజు కట్టేస్తాను.'

'చూడండి, ఒక్కమాట. మేం చేయగలిగింది చాలా తక్కువ ఉంటుంది, ముఖ్యంగా' సంధ్య మాట పూర్తి చేయలేదు.

'ఏముందమ్మా....అక్కడంతా మీరూ మీరే - మీరు తలుచుకుంటే ఇదేమంత పెద్ద పని! వస్తానమ్మా' మెల్లగా వెళ్ళిపోయాడు. ఆ కాగితం మడిచి బాగ్‌లో పడేసింది. టైమయిపోయింది. ఆటో కోసం పరిగెత్తాల్సిందే సంధ్య విసుగ్గా ఇంట్లోంచి బయటికొచ్చేసింది.

*　　　　*　　　　*

రాత్రి తొమ్మిదయింది. పొద్దుటినుంచీ తీరిక లేకుండా అలసిపోయిన సంధ్యకి కునుకు పట్టేసింది....గదిలో ఫోను మోగుతోంది. పిల్లలు నిద్దరపోతున్నారు. 'వాట్ ఎ నాన్సెన్స్!' మంచంమీదనుంచి లేచింది.

'హలో....'

'ఆఁ.'

'హలో....'

'రాంగ్ నెంబర్ ప్లీజ్.' రిసీవర్ పెట్టేసి, గ్లాసుతో నీళ్ళు తాగు తూంటే మళ్ళీ ఫోన్.

'హలో.... సంధ్య స్పీకింగ్.'

'హలో - డాక్టర్ రావ్ హై.'

'నై హై....బహార్ గయే....'

'కబ్ ఆతే....'

'దస్ బజేకు ఆతే,'

'ఏక్ బాడ్ బోలియే....' సంధ్య రిసీవర్ పక్కన పెట్టి కొడుకుని లేపి, 'ఎవరూ లేరని, డిన్నరుకి వెళ్ళారని చెప్పు' అంది గబగబా.

'హలో... '

'డాక్టర్ రావ్‌కా బీబీ హై?'

'దోనోంబీ దావత్ గయే.'

అవతలాయన హిందీలో ఇంకా దంచుతున్నాడు, మర్నాడు ఏడు గంటల ఫ్లైట్‌లో వెళ్ళిపోవాలట- తెల్లవారు జామున ఐదింటికే ఇంటికొచ్చి మాట్లాడతాడట. సంగతేమంటే వాళ్ళమ్మాయి సీటు!

రేప్పొద్దున్నే ఐదుగంటల కొస్తాడా? 'ఒరేయ్ బాచీ, ఒక నెల రోజులు సెలవు పెట్టేసి, అమ్మమ్మ దగ్గరుండి వస్తాను - లేకపోతే....' సంధ్య గొణుక్కుంటూ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది. ఏమీ చేయలేనని చెప్పినా, ఎందరో ఎంతో ఆశ పెట్టుకు వస్తారు పాపం! తన పర్సులో ఉన్న రకరకాల కాగితాలు కళ్ళముందు కనిపించాయి సంధ్యకి.

*    *    *

సీట్ల హడావిడి చాలావరకు తగ్గిపోయింది. వరదలా తోసుకొచ్చిన సీట్ల సందడి తగ్గేసరికి కాస్త ప్రశాంతంగా ఉంది ఇంటా, బయటా వాతావరణం సంధ్యకి. అయితే మధ్య మధ్యలో ఒకళ్ళో ఇద్దరో వచ్చి, తనకు థాంక్సు చెబుతుంటే సంధ్యకి బాధనిపిస్తుంది. ఆ సీట్లు వాటంతట అవే వచ్చినవి. అయినా వస్తాయనుకున్న వాళ్ళకి రాకపోవటం, రావనుకున్న వాళ్ళకి రావటం - ఇలాటివన్నీ అన్నిచోట్ల సామాన్యంగా కనిపించేవే. ఒక్కోసారి సంధ్యకి అనిపిస్తుంది - ఈ ఆడపిల్లలు అందరూ కష్టపడి సీటు తెచ్చుకుని, చదువుకుని, వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడాలనుకోటం ఎంత గొప్ప విశేషం! అయితే అందరికీ తను సహాయం చేయలేదు. ఒకళ్ళకో ఇద్దరికో - సంధ్య బాగ్‌లో చాలా నలిగిపోయిన కాగితాల మధ్య రెండింటినే గుర్తుంచుకుంది. రాధ - పాపం! ఎంతో అమాయకంగా ఉంది. రోజూ తనని కలుసుకుంది. మార్కులు కూడా ఫరవాలేదు. పైగా తల్లి తండ్రులు చదివించమంటుంటే, ఎలాగయినా చదువుకోవాలని దీక్షతో ఉంది - అలాటమ్మాయికి సీటు ఇప్పించాల్సిందే.

లలిత - ఎంత అందంగా ఉంది! ఆ అమ్మాయి కో - ఎడ్యుకేషన్‌లో ఒక్కరోజు కూడా చదవలేదు. కాకపోయినా, తన ప్రాణ స్నేహితురాలు రమ అన్న కూతురు. ఎలాగయినా సీటిప్పించాలి! పైగా రెండు మార్కులు కలిస్తే ఫస్టుక్లాసు వచ్చేదే!

సంధ్య ఆ రెండు కాగితాలు విడిగా పర్సులో పక్కగా గుర్తుగా పెట్టింది.

*　　　*　　　*

గేటుదాటి బయటికి వచ్చిందో లేదో ఇద్దరు వ్యక్తులు మోటారు సైకిలు ఆపుకు నిలబడ్డారు.

''ఆఁ—మీరు సంధ్య కదూ....''

ఉలిక్కిపడింది సంధ్య.

'నమస్తే.'

'నమస్తే.'

పెద్ద మీసాలు, ఎర్రని ఫారిన్ షర్టు, నల్ల కళ్ళజోడు - ఒక అతను బాల్డ్ హెడ్ - ఎర్రని కళ్ళు - మరొకతను - ఇద్దరినీ ఎవరు చూసినా ఒక క్షణం బెదరక తప్పదు. రూపాలు ఎలా ఉన్నా సౌమ్యంగా మాట్లాడుతుంటే నిలబడాల్సొచ్చింది సంధ్య.

'గుర్తుపట్టలేదు కదూ? మనం ఎస్.ఎస్.ఎల్.సి.లో క్లాసుమేట్స్మి.'

'ఆఁ' అంది సంధ్య. అంటే ఇరవై యేళ్ళనాటి విషయం. ఆ రోజుల్లో వంచిన తల ఎత్తకుండా భయం భయంగా స్కూలుకి వెళ్ళివచ్చే రోజులు—ఎవరెవరో—ఎలా గుర్తు పట్టటం? సంధ్య నవ్వేసి ఊరుకుంది.

'మీరు మరచిపోయారేమో! నేను మనం చదువుకున్న స్కూలు లీడరుని—పెద్ద రౌడీనని పేరు. హాల్ టికెట్ ఇవ్వనంటే పోట్లాడి, భయపెట్టి పరీక్షలు రాసేశాను. ఇద్దరు బాల్య వీరత్వాన్ని తలుచుకు నవ్వుతుంటే సంధ్యకి కూడా నవ్వొచ్చింది.

'మనం తీయించుకున్న ఎస్.ఎస్.ఎల్.సి. గ్రూప్ ఫోటోలో నేను హెడ్ మాస్టర్ వెనక నిలబడ్డాను.' సంధ్యకి చిరాగ్గా ఉంది — అసలు విషయం చెప్పరేం? వాచీ చూసుకుంది.

'మేము సీటుకోసం రాలేదు.'

సంధ్య హాయిగా ఊపిరి పీల్చింది.

'కానీ ఫస్టు లిస్టులో పేరుంది. పిల్ల మా మరదలు. మా ఆవిడ, మరదలు కలిసి పెళ్ళి కెళ్ళి పదిహేను రోజులుండిపోయారు.' సంధ్య

నెత్తిన పిడుగు పడ్డట్లయింది. లిస్టులో పేరొస్తే ఫీజు కట్టలేదా! మై గుడ్ నెస్! ఇప్పుడేం చేయాలి—సీటు రాలేదని ఎందరో బాధపడుతుంటే పెళ్లి కెళ్ళామంటూ చెప్పి, ఫీజు ఇప్పుడు కడతానంటారు, అన్ని లిస్టులు అయి పోయాయి కదా!

'అయామ్ సారీ—నేనేం చేయలేను.లోపలి కెళ్ళి మీరే ప్రయత్నం చేసుకోండి. వస్తాను.' గబగబా నడిచి ఎదురుగా వున్న ఆటోలో ఎక్కి కూచుంది.

*　　　*　　　*

ఇన్ని మడిచిన చిన్నకాగితాల మధ్య ఆ యిద్దరూ రాధ, లలిత పట్టువదలని విక్రమార్కుడిలా వెంట పడడం, సంధ్యకి కూడా ఎందుకో ఈ యిద్దరికైనా సీటు వచ్చేలా చూడాలని మనఃస్ఫూర్తిగా అనిపించడం అన్నీ కలిసొచ్చాయి. 'ఇద్దరికీ సీట్లు వచ్చాయి కానీ, వీళ్ళు కనిపించరేం? పోన్లే—పట్టుదలతో సీటు తెచ్చుకున్నట్టే కష్టపడి పరీక్షలు పాసయి, ఒక వ్యక్తిత్వం సంపాదించుకుని లోకంలో హాయిగా బతికితే చాలు—తన్ను కలవకపోతే వచ్చే నష్టం లేదు.' నవ్వుకుంటూ పర్సులో వున్న ఆ రెండు కాగితాలు కూడా చింపేసింది.

నెల రోజులు దాటిపోయింది—ఆరోజు సినిమాహాలు నుంచి బయటకొచ్చి, ఆటో కోసం చూస్తూంది సంధ్య.

'మేడమ్....మేడమ్.'

వెనక్కి తిరిగింది—

'ఓ—రాధా—ఏమిటి? కాలేజీకి వస్తున్నావా—క్లాసెస్ బాగా జరుగుతున్నాయా?'

నవ్వింది రాధ.

'అవునుకానీ — సీటు వచ్చిం తర్వాత మళ్ళా కనిపించలేదే— నేను స్వీట్స్ అడుగుతానని భయమా?'

మళ్ళా నవ్వింది రాధ.

'చెప్పు.' పక్కనున్న అబ్బాయి రాధ కేసి చూశాడు.

'నేను మీ కాలేజీలో చేరలేదు, మేడమ్.'

'ఆఁ!' నోరు తెరిచింది సంధ్య.

'మరి!....అన్ని సార్లు....'

'కాదండి—మా—బావ—ఇతనే వాళ్ళ కాలేజీలోనే చేరమని సీటు తెప్పించాడండి—అయితే నాతో పందెం వేశాడు, నాకు మీ కాలేజీలో సీటు రాదని—నేనేమో ఎలాగయినా తెచ్చుకుంటానని—చివరికి మీ దయ వల్ల నేనే పందెం గెలిచాననుకోండి—మీ దగ్గరకొచ్చేసరికే నేను ఆ కాలేజీలో ఫీజు కట్టేశాను.' రాధ చెపుతున్న తక్కినమాటలు ఇంక వినపడలేదు సంధ్యకి—గబగబా నడిచి వెళ్ళిపోతున్న అమ్మాయిని, అబ్బాయిని చూస్తూ అలా చాలా సేపు నిలబడిపోయింది. ఇందుకా తనంత కష్టపడి సీటు ఇప్పించింది!

*　　　*　　　*

'ఒరేయ్, తమ్ముడూ—చెప్పు—నువ్వు పెళ్ళిచేసుకుంటాను అంటే ఒక చక్కటి అమ్మాయిని చూసి పెడతాను.'

'నేను నా ట్రెయినింగ్ అయేవరకు పెళ్ళిమాట ఎత్తను.'

'కాదురా....అంత చక్కటి అమ్మాయిని నేనే యింతవరకు చూడలేదు. తెలుసా. చెప్పు—'సంధ్య కళ్ళ ముందు లలిత మెదిలింది—అవును, రేపు కనుక్కోవాలి—సీటు వచ్చాక మళ్ళా కనిపించరు వీళ్ళు!!

'అక్కా—టైమైపోతోంది—పద, పద' తమ్ముడు తొందరచేశాడు బెంగుళూరులో ట్రెయినింగ్—'అదయిపోయాక హైదరాబాదులో ఉద్యోగము చేస్తాగా—అప్పుడు చూడు' అంటాడు పెళ్ళిమాట ఎత్తితే!

*   *   *

రైల్వే స్టేషన్ అంతా ఎప్పుడూ సందడే—తమ్ముడు రిజర్వుడు కంపార్టుమెంటులో కూచున్నాడు. సంధ్య అటు ఇటు జనప్రవాహాన్ని చూస్తూంది.

'మేడమ్!' పరుగెత్తుకుంటూ ఒక గుంపుని తోసుకు వచ్చి నిలబడింది. మెడలో పచ్చని పసుపుతాడు, కళ్ళనిండా కాటుక, తలనిండా పూలు—అందం పదిరెట్లు పెరిగింది—లలిత!

'ఓ లలితా.'

'నమస్తే, మేడమ్....' పక్కన సూట్‌లో ఎంతో హాండ్‌సమ్‌గా ఉన్న అబ్బాయిని పరిచయం చేసింది, బుగ్గల్లో సిగ్గు మొగ్గలు తొడుగుతుంటే. సంధ్య అలాగే చూస్తూ ఉండిపోయింది—కొత్త పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు—నవ్వు వచ్చింది.

*   *   *

రైలు కదులుతుంటే అందరితోపాటు తనూ చేయి ఊపుతూ ముందుకు ముందుకు నడిచింది.

ప్లాట్‌ఫామ్ కొంచెం ఖాళీ అవుతోంది. మెల్లిగా నడుస్తూంది సంధ్య. ఈ పిల్లలెందుకొస్తారు సీట్లు, సీట్లంటూ—ఆఁ....కొందరు సరదాగా కాలేజీలో చేరి, పెళ్ళిచేసుకుని వెళ్ళిపోడానికే! 'హాయ్—సంధ్యా!' భుజంమీద చెయ్యి పడింది—

'ఏమి టే—రమా—విశేషాలు' 'ఏముంది—చూశావుగా—మా లలితని. దాని కసలు చదువుమీద ఆసక్తిలేదు—అన్నయ్యకి దీన్ని కాలేజీలో చేర్చాలనిలేదు—లేకపోతే మా వదినకే అమ్మాయి కాలేజీకి వెళ్ళాలని సరదా మాత్రమే—దీనికి చక్కగా ముస్తాబయి, రోజూ ఒక చీర సోగ్గా కట్టుకు కాలేజీకి రావాలని—అనుకోకుండా ఈ సంబంధం కుదిరింది—అతను నైజీరియాలో డాక్టరు—చదువక్కర్లేదు—అందమైన పిల్ల కావాలనుకున్నాడు—అంతే—వారం రోజులు కాకుండా పెళ్లి అయిపోయింది—చూశావుగా—హానీమూన్‌కి వెడుతున్నారు'—నవ్వింది రమ. సంధ్యకి నవ్వాలో, ఏం చెయ్యాలో తెలియలేదు.

'పోన్లే - ఇదీ మంచి సీటే' అనుకుంటూ ముందుకు కదిలిపోయింది. *



## డా॥ ముక్తేవి భారతి

రాజాబహదూర్ వెంకట రామారెడ్డి మహిళా కళాశాల తెలుగు శాఖలో రీడర్‌గా పనిచేస్తున్నారు. విశ్వ విద్యాలయ మరియు కళాశాల అధ్యాపకుల రాష్ట్ర స్థాయి ఉత్తమ అధ్యాపక పురస్కారము 1990-91లో అందుకున్నారు. ఫిలిమ్ సెన్సార్ బోర్డ్ సలహా సంఘ సభ్యురాలిగా (1986-89) వున్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయం నుంచి యం.లిట్, పి.హెచ్‌డి. పట్టాలు పొందారు. వివిధ సాంస్కృతిక సంస్థలతో సన్నిహిత సంబంధం, జీవిత సభ్యత్వం వున్నాయి.

**రచనలు :**

1. చిలకమర్తి సాహిత్య సేవ
2. భారతంలో ప్రేమకథలు
3. కంచె చేను మేస్తే
4. ముక్తేవి భారతి కథలు
5. కావ్య తారలు - 'వనిత' మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడిన కథలు
6. భారతీయం - 'ఉదయం' వార పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడిన గేయాలు.
7. తంజావూరు నాయక రాజుల కాలంలో రచయిత్రులు (యం.లిట్ సిద్ధాంత వ్యాసం - అముద్రితము)
8. భారతీ వ్యాసాలు (రాబోవు రచన)